రామతీర్థకు నివాళి

ISSN No:2581-7477



# సాహిత్య ప్రస్థానం

జూన్ 2019

వెల రూ. 20





విజయవాడ, విశాఖపట్నం, రాజమహేంద్రవరం కందుకూరి శతవర్ధంతి సదస్సులు

## ఉత్తేజం నింపిన కందుకూరి వీరేశలింగం శత వర్ధంతి సమ్మేళనాలు!



సాహితీస్రవంతి

# విజయవాడలో మే 26న జరిగిన కందుకూరి వీరేశలింగం శతవర్ధంతి సమాలోచన కార్యక్రమ దృశ్యాలు






















సాహిత్య
ప్రస్థానం
జూన్ 2019

సంపుటి : 18 | సంపాదకీయం | సంచిక : 6

# శుభాకాంక్షలు, ప్రజాకాంక్షలు

ఆంధ్ర ప్రదేశ్‌లో కొత్తగా కొలువుతీరిన వైఎస్ జగన్ మంత్రివర్గానికి సాహిత్య ప్రస్థానం హృదయ పూర్వక శుభాకాంక్షలు తెలియజేస్తున్నది. అపూర్వమైన అత్యధిక మెజార్టి అప్పగించిన ప్రజల ఆకాంక్షలను ఈ ప్రభుత్వం నెరవేర్చాలని కోరుకుంటున్నది. కేంద్రంలోనూ నరేంద్ర మోడీ నాయకత్వంలో బిజెపి ఎన్‌డిఎ ప్రభుత్వం మరోసారి తిరిగి వచ్చింది. అయితే విభజనానంతర సమస్యల సుడిగుండంలో వున్న ఎపికి ఇవి రెండవ పర్యాయం ఎన్నికలు మాత్రమే. నిధుల కొరత, విధానపరమైన తప్పొప్పులు, కేంద్రం ప్రత్యేక హోదా నిరాకరించడం వంటి కారణాలు గత అయిదేళ్ల కాలాన్ని సమస్యాత్మకంగానే చేశాయి. ఈ సారి జగన్ నాయకత్వంలోని వైఎస్ఆర్ పార్టీని ప్రజలు 150కి పైగా స్థానాలతో ఎన్నుకోవడానికి అవన్నీ కారణాలే. ప్రత్యేక హోదా ముగిసిన అధ్యాయమని బిజెపి నాయకులు పదే పదే ప్రకటిస్తున్నారు. నిధుల మంజూరులోనూ కేంద్రంపై పెద్దగా ఆశలు పెట్టుకోగల స్థితి లేదు. మరోవైపున జగన్ ఎన్నికల వాగ్దానాలతో సహా ముందు ముందు చాలా అవసరాలున్నాయి. ఔనన్నా కాదన్నా ఇవన్నీ సవాళ్లే అవుతాయి. సరైన సంకల్పంతో పాటు సముచిత విధానాలు, ప్రజాస్వామిక సూత్రాలు పాటిస్తూ అందరినీ కలుపుకొని పోయినప్పుడే ఈ సవాళ్లను అధిగమించగలం. ప్రత్యామ్నాయ విదానాలు పాటించకుండా ఇది సాధ్యం కాదని కూడా గుర్తించాలి. యువ ముఖ్యమంత్రి ఆ దిశలో అడుగులేస్తారని ఆశించాలి. రెండు తెలుగు రాష్ట్రాల మధ్య సంబంధాల మెరుగుదల సూచనలు స్వాగతించదగినవిగా వున్నా సమస్యలు కూడా చాలా వున్నాయి గనక తక్షణం వాటిపై దృష్టి పెట్టాల్సి వుంటుంది. కేంద్రం కూడా ఇందుకు పూర్తిగా సహకరించాలి. సాహిత్య సాంస్కృతిక రంగాలలో ఆరోగ్యకరమైన ధోరణులను ప్రోత్సహించేందుకు తెలుగు భాషా వికాసానికి కొంత కృషి జరిగినా చేయవలసింది మరెంతో వుంది. నూతన ప్రభుత్వం ఆ దిశలో సమగ్ర విధానంతో ముందడుగు వేయవలసి వుంది. ఈ రంగాన్ని ప్రజా సంబంధాల కోణంలోనో లేక ప్రచార కోణంలోనో మాత్రమే గాక సుసంపన్నమైన తెలుగు జాతి వారసత్వంలో భాగంగా భవిష్యత్తుకు వారధిగా పరిగణించితేనే అనుకున్న లక్ష్యాలు సాధించగలం.

మోడీ ప్రభుత్వం మరోసారి మూడు వందల పైగా స్థానాలతో రావడం అరుదైన విషయమే. అయితే గతంలో సృజనకారులైన కవులు, రచయితలు, మేధావులపై ఆంక్షలు, అసహన రాజకీయాలు, అవార్డు వాపసీ వంటి పరిణామాలకు దారితీసిన సంగతి మర్చిపోలేము. మతతత్వ రాజకీయాలు లౌకిక ప్రజాస్వామ్య విలువలకు భావ ప్రకటనా స్వేచ్ఛకు ముప్పుగా మారాయి. కల్బుర్గి, గౌరీ లంకేశ్ వంటి వారి హత్యలు తీవ్ర కలవరం కలిగించాయి. ఈ నేపథ్యంలో మరోసారి అధికారం చేపట్టిన మోడీ ప్రభుత్వం అలాటి పోకడలు పునరావృతం కాకుండా ఖచ్చితమైన చర్యలు తీసుకోవాలి. భిన్నత్వానికి మారుపేరైన ఈ దేశ లౌకిక వారసత్వాన్ని ప్రజాస్వామ్య సంప్రదాయాలను కాపాడాలి. ముందే చెప్పినట్టు ఎపికి ఇచ్చిన హామీలు వేగంగా పూర్తిగా నెరవేర్చాలి. ◆

సంపాదకవర్గం:
తెలకపల్లి రవి ప్రధాన సంపాదకుడు
వొరప్రసాద్ వర్కింగ్ ఎడిటర్
కె. సత్యరంజన్ ◆ చీకటి దివాకర్
గనారా ◆ శమంతకమణి
కెంగార మోహన్
కె.లక్ష్మయ్య, మేనేజర్
బొమ్మలు: తుంబలి శివాజి, చిదంబరం
గంగాధర్ వీర్ల, వెంకటేష్
కవర్ డిజైన్: బ్రౌన్

రచనలు, చందాలు, విరాళాలు, మనీ ఆర్డర్లు, చెక్కులు, డిడిలు పంపవలసిన చిరునామా:
సాహిత్య ప్రస్థానం, 27-30-4, ఎం.బి. విజ్ఞానకేంద్రం, 3వ అంతస్తు, ఆకులవారి వీధి,
గవర్నరుపేట, విజయవాడ - 520002, ఫోన్: 0866-2577248, సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com, www.prasthanam.com
ISSN No: 2581 - 7477
సాహిత్య ప్రస్థానం మాసపత్రికకు చందా కట్టండి! తెలుగు భాషా, సాహిత్య కృషిలో భాగస్వాములు కండి!!
1 సంవత్సర చందా రూ. 240/- ◆ 5 సంవత్సరాల చందా రూ.1000/
◆ 10 సంవత్సరాల చందా రూ. 2000/-
Bank A/c Details: A/c Name: PRASTHANAM, SBI, Governorpet, Vijayawada
A/c No. 52001500585, IFSC: SBIN0020343
చెక్కులు, డిడిలపై prasthanam అని రాయగలరు.

## కథలు



## కవితలు



## వ్యాసాలు



## కవిత

# if

- డా॥ ఎన్. గోపి

*రైతుకు if ఉండదు.*
*విత్తనాలు మోసం చెయ్యకపోతే,*
*ఆకాశం*
*ఒక్క చుక్కైనా రాల్చక పోతే*
*ఈ వాక్యాలకు అర్థంపర్థం ఉండదు.*

*ధాన్యం ఇంటికి వస్తే*
*వస్తే గిస్తే*
*అది కవిత్వంలా హాయిగా ఉండదు.*
*ఎదురు చూపుల్లో ఉన్న ఆశ*
*సాగనంపటాల్లో కనపడదు.*



*చాకిరి మాత్రమే అతనిది*
*చెమటబొట్లు మాత్రమే రాల్చగలడు*
*కాలంగాని కాలం వచ్చేసింది.*

*సూర్యుడు ఇవాళ*
*అపరిచితుడైనాడు*
*చీకటి ఇప్పుడు*
*వెలుతురుగా మారదు*
*ఆ ఇంటిలోంచి*
*ఏడుపులు వినపడుతున్నాయి.*
*ఫలానావారు*
*బాధ్యత వహించరు*
*విశ్లేషణలచేసే*
*సంక్లిష్టవాక్యాల్లోంచి*
*if ను పీకి పారెయ్యాలి.* ◆

# మా ఇంటి నెరేడు చెట్టు

- గన్నవరపు నరసింహమూర్తి
7752020123



ఆ రోజు ఆదివారం కావడంతో ఉదయాన్నే స్నానం చేసి మా ఊరు వెళ్ళడానికి రెడీ అవుతుంటే నా భార్య రాధ వచ్చి టిఫిన్ టేబుల్‌మీద పెడుతూ "మళ్ళీ రాత్రికి వచ్చేస్తారా? అని అడిగింది.

"ఎందుకు?" అని ఆమె నడిగాను.

రాత్రి పెద్దవాడు వచ్చేసరికి మీరు పడుకుండిపోయారు. వాడికి అమెరికాలో ఎమ్మెస్ చదవడానికి సీటొచ్చిందిట. పదిహేను లక్షలు ఫీజు కట్టాలిట. మీకు చెప్పమన్నాడు... రెండు నెలలు నుంచీ మీతో చెబుతున్నా మీరేమీ పట్టించుకోవటం లేదని వాడు కోపంగా ఉన్నాడు. మీతోటి ఫిజిక్స్ లెక్చరర్ తన ఇద్దరి పిల్లల అమెరికా చదువుకోసం తన పొలం అమ్మేసి పంపించాడు. మీకవేమీ పట్టవు..." అంది కోపంగా..

"విదేశాల చదువన్నది తెలివైన వాళ్ళకోసం,... అంతేకాని డొనేషన్లు కట్టి కొనుక్కోవడానికి కాదు. బాగా చదువుకుంటే ఇక్కడ ఎన్నో అవకాశాలు, ఉద్యోగాలున్నాయి. అయినా పదిహేను లక్షలు ఉన్నపళంగా కట్టమంటే నా దగ్గర డబ్బులేవీ బేంకుల్లో మూలగటంలేదు. పీయఫ్‌లో ఉన్నదంతా జానకి పెళ్ళికి తీసేసాను. కాబట్టి అటువంటి ఆశలేవీ పెట్టుకోక ఇక్కడే బుద్ధిగా ఉద్యోగం కోసం ప్రయత్నించమను. ఇలా జీవితాంతం వీళ్ళ చదువుకు అప్పు చేస్తే మనం ఏమిటి తినాలి చెప్పు?" అన్నాడు చెప్పులు తొడుక్కుంటూ.

"ఏమో బాబూ! ఆ చెప్పేదేదో వాడికే చెప్పండి - తండ్రీ కొడుకుల మధ్య నేను నలిగిపోతున్నాను" అంది టిఫిన్ ప్లేట్ తీసికెళ్తూ.

నేనింకేమీ మాట్లాడకుండా బయటకొచ్చి ఆటోలో బస్టాండ్‌కు చేరుకొని మా ఊరు వెళ్ళే పల్లె వెలుగు బస్సు ఎక్కాను.

ఓ గంటన్నర తరువాత అది మా ఊరి అడ్డురోడ్డు దగ్గర నన్ను దించేసి వెళ్ళిపోయింది. అక్కడికి మా ఊరు ఓ కిలో మీటరు ఉంటుంది. మెల్లగా ఊరి వైపు నడవటం మొదలుపెట్టాను. నాకు బాల్యం గుర్తుకురాసాగింది.

♦♦♦

మాది కొండ పక్కన ఉండే చిన్నగ్రామం. నా చిన్నతనం అంతా అక్కడే గడిచింది. ఐదో తరగతి వరకు ఆ ఊళ్ళోనే చదివాను. నాన్నగారు టీచరుగా చేసేవారు. ఆయనే నా తొలి గురువు. 'సరస్వతీ నమస్తుభ్యం' అనీ ఆయనే నాకు అక్షరాభ్యాసం చేసారు. మాకు వ్యవసాయం కూడా ఉండేది.

మాది ఆ వీధిలో ఓ పెద్ద ఇల్లు... పెరడంతా తోటలా

ఉండేది. ఒక ఎకరం జాగాలో పెద్ద పెద్ద చెట్లు.... మధ్యలో నుయ్యి. ముఖ్యంగా ఆ తోటలో నేరేడు చెట్టు ఓ ప్రత్యేక ఆకర్షణ.. దాన్నెపుడో మా తాతగారు వందేళ్ళకిందట ఇల్లు కడుతున్నప్పుడు వేసారట... ఇప్పుడది పదడుగుల చెట్టు కొలతతో ఎన్నో కొమ్మలతో పెద్ద వృక్షమైంది.. దూరం నుంచి చూస్తే మర్రి చెట్టులా కనిపిస్తుంది! వేసవొస్తే చాలు అది విరగకాసేది. బాగా పండిన నల్లపళ్ళు అప్పుడే పళ్ళుగా మారబోతున్న ఎర్రటి పళ్ళు ఆకులతో సమానంగా పోటీపడుతూ ఉండేవి. ఇంక దాని మీద ఆ పళ్ళకోసం వేల పక్షులు. ఎక్కువగా ఆకుపచ్చని రామచిలకలు.. ఆ తరువాత గోరపిట్టలు, మైనాలు..

తెల్లారుతున్నప్పుడు మాత్రం కోకిల కూతలు వినిపిస్తుండేవి. ఇంక కాకులకైతే అది పుట్టిల్లు.

నేను తెల్లవారి లేచి తిన్నగా పెరట్లోకి వెళ్ళేవాడిని. అప్పటికే పక్షుల కిలకిలారావాలతో నేరేడుచెట్టు మారుమ్రోగుతుండేది.

కొన్ని చిలకలు ఎగురుతూ, కొన్ని కాకులు పళ్ళు తింటూ కనిపించేవి. నేను ఆ చెట్టుకింది ఆ పక్షులు తినిపడేసే పళ్ళను ఏరుకుంటూ ఉన్నప్పుడు నా బుర్ర మీద ఎన్నో పళ్ళు పడుతుండేవి. వాటినన్నింటినీ ఒక సంచిలో వేసి నూతి చవటా దగ్గర కడిగి ఇంట్లోకి తెచ్చి మా అమ్మకి ఇచ్చేవాడిని.

ఆ చెట్టునిండా కాకులగూళ్ళే ! చిలకలు మాత్రం చెట్టుకి తొర్రలు పెట్టి అందులో ఉండేవి.

ఒక ఆదివారం నాడు నేను సంచీ కర్ర పట్టుకొని చెట్టుమీద కాసిన పళ్ళను తెంపుదామనీ చెట్టెక్కాను. నన్ను చూసి పక్షులు, చిలకలు భయపడిపోయి గాల్లోకి ఎగురుతూ అరవడం మొదలు పెట్టడంతో నాన్నగారొచ్చి నన్ను తిట్టడంతో చెట్టు దిగిపోయాను.

కిందకు దిగిన తరువాత నాన్నగారు నాకు జ్ఞానబోధ చేసారు.

"తాతగారు ఈ జంబో నేరేడుచెట్టుని వేసింది పక్షులకోసం.. మనకోసం కాదు. అవి కిచకిచమని అరుస్తూ ఎగురుతూ పళ్ళను తింటూ ఉంటే ఈ చెట్టు కింద ఇక్కడే నులకమంచం మీద పడుకొని ఆనందిస్తూ ఉండేవారు. సంవత్సరంలో రెండు నెలలు.. కాసే పళ్ళకోసం సంవత్సరం పొడవునా దాని మీద గూళ్ళు కట్టుకొని ఉండే పక్షులంటే ఆయనకు ప్రాణం. అవి మన చుట్టాలనీ వాటినేమీ చెయ్యకూడదనీ చెప్పేవారు. ఇంకెప్పుడు చెట్టెక్కి పళ్ళు కోయకు" అనీ చెప్పడంతో ఆ రోజునుండి నేనెప్పుడూ చెట్టెక్కే సాహసం చెయ్యలేదు.

మా ఇంటికి వేనవిలో మా మేనమామలు, పిన్నీవాళ్ళు... వచ్చేవాళ్ళు... అప్పుడు వాళ్ళ పిల్లలతో ఇల్లంతా కళకళలాడుతూ ఉండేది.

అప్పుడు వాళ్ళంతా నేరేడు చెట్టు కిందే మంచాలు వేసుకొనీ కబుర్లు చెప్పుకునేవాళ్ళు. మధ్యాహ్నంపూట భోజనం తరువాత నాన్నగారు ఆ చెట్టుకిందే గుర్రుపెట్టి నిద్రపోవడం నేనెన్నోసార్లు చూసాను.

అలా ఆ నేరేడు చెట్టు మూడు తరాల నుంచీ మా కుటుంబంతో మమేకం అయిపోయింది. మేమెప్పుడైనా చుట్టాలింటికి వెళ్ళేటప్పుడు వాళ్ళు ఇంట్లో అందరూ బాగున్నారా? నేరేడు చెట్టు బాగుందా? పళ్ళు కాస్తున్నాయా? అనీ అడగటం ఒక రివాజుగా మారిపోయింది.

కాలచక్ర భ్రమణంలో ఎన్నో సంవత్సరాలు గడిచిపోయాయి. అమ్మా, నాన్నలిద్దరూ మమ్మల్ని విడిచి వెళ్ళిపోయారు. మేనమామలు, పిన్నీవాళ్ళంతా ఎక్కడెక్కడో సెటిలయిపోయి మా ఊరికి రావడం మానేసారు.

నేను కూడా విశాఖపట్నంలో ఇల్లు కట్టుకోవడంతో మా ఇల్లు మూతబడిపోయింది. మా తాత నుంచి వారసత్వంగా వచ్చిన పొలాన్ని, ఇంటిని అమ్మడం ఇష్టంలేక నేనే అప్పుడప్పుడు మా ఊరు వెళ్ళి వస్తుంటాను.

చిన్నప్పట్నుంచీ పెరిగిన మా ఊరన్నా, మా ఇల్లన్నా పెరట్లోని నేరేడు చెట్టన్నా నా కెంతో ఇష్టం... వాటిని ఆర్నెల్లకోసారి చూడకపోతే ఏదో బాధ కలుగుతుంటుంది. ఆ ఇంటిని చూసినప్పుడల్లా మా అమ్మ నాన్న లిద్దరు గుర్తుకువస్తుంటారు. అందుకే మా చుట్టాలందరూ ఇళ్ళు పొలాల్ని అమ్మేసినా నేను మాత్రం ఆ పని చెయ్యలేదు.

ఈ మధ్యనే నలభైలోంచి ఏభైలోకి ప్రవేశించాను. అప్పట్నుంచీ మా ఊరిమీద మమకారం ఇంకా ఎక్కువైపోయింది. అందుకే నెలకోసారి మా ఊరెళ్ళి ఇల్లుని శుభ్రం చేసి, ఆ నేరేడు చెట్టు కింద మంచంవేసి పడుకుంటే నా కెంతో హాయిగా ఉంటోంది.

మా కుటుంబంలోని మూడు తరాల్ని చూసిన మా నేరేడు చెట్టుని చూస్తే నాకెన్నో జ్ఞాపకాలు.

దాన్ని నాటిన మా తాతగారు, దానితో పాటు పెరిగిన

నాన్నగారు ఇద్దరూ చనిపోయినా అది చలించకుండా అలాగే ఉండటం నాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంటుంది.

దాని కళ్ళముందే పుట్టిన నేను అప్పుడే ఏభై పడిలోకి ప్రవేశించి వృద్ధాప్యఛాయలు ప్రారంభమయ్యే దశలో ఉంటే అది మాత్రం ఇంకా యవ్వనఛాయతో పచ్చగా పశుపక్ష్యాదుల్తో కళకళలాడుతూ ఉడటం వృక్షాలకు దేవుడిచ్చిన వరం అనుకోవచ్చు.

ఒకసారి ఇదే విషయాన్ని మా మాస్టారు ఆచార్యులుగారితో అంటే ఆయన నవ్వుతూ "వాటికి మనలాగ ఆసూయా, ద్వేషాలుండవు. ఏదో సంపాదించాలన్న ఆశ తన పిల్లలకీ ఏం చెయ్యాలన్న తపన వాటికుండవు. వాటికి తెలిసిందల్లా పదిమందికీ తమసంపదని పంచటమే.

మనలా మన కోసం కాక లోకం కోసం పశుపక్ష్యాదుల కోసం బతకడం వల్లే... వాటికి వృద్ధాప్యం రాదు.

తాము ఎండలో మాడుతున్నా మనకి నీడనిస్తూ పక్షులకు పళ్ళు, ఆవాసం ఇస్తూ స్వార్థం, రాగద్వేషాలు లేకుండా ఇతరుల కోసం బతకాలన్న.. జీవనవేదాన్ని అన్యాపదేశంగా ఆ చెట్లు చెబుతాయి." అనీ ఆ చెట్టు యవ్వనం వెనక రహస్యాన్ని విప్పిచెప్పారు.

ఇలా ఆలోచిస్తూ ఉండగానే మా ఇల్లు వచ్చేసింది. ఆలోచనల్లోంచి బయట పడ్డాను.

♦♦♦

నేను ఇంటికి వెళ్ళిన తరువాత మా రైతు రాజయ్య వచ్చి తాళం తీసాడు. వాకు టీ పెట్టి ఇచ్చాడు. "ఎలా ఉంది వ్యవసాయం?" అని వాడినడిగాను... "ఈ పాలి బాగుంది బాబూ! సెరువులు నిండాయి. పంటలు బాగున్నాయి." అన్నాడు.

నేను లోపలికెళ్ళి స్నానం చేయబోతున్న సమయంలో వాడు నా దగ్గరకొచ్చీ " బాబూ! తమరీయింటినీ, పొలాన్ని అమ్మేత్తున్నారనీ యిన్నాను." అన్నాడు మెల్లగా... వాడి మాటలు నాకు మొదట అర్థం కాలేదు.. ఆ తరువాత అర్థం అయి " ఎవరు చెప్పారు?" అని అడిగాను.

"ఊల్లో అందరూ అనుకుంటూ ఉంటే యిన్నాను." అన్నాడు.

వాడికేం సమాధానం చెప్పాలో అర్థం కాక మౌనం వహించడంతో వాడు వెళ్ళిపోయాడు.

స్నానపానాదుల తరువాత మా తమ్ముడి కొడుకింటికి భోజనానికి వెళ్ళాను. వాడు ఆ ఊళ్ళో టీచరు. వాడి భార్య భాను నన్ను ఆప్యాయంగా పలకరించి భోజనం వడ్డించింది. భోజనం చేస్తూ వాడినడిగాను.

"ఏరా విస్తూ... మనిల్లుని అమ్ముతాననీ ఈ ఊళ్ళో అనుకుంటున్నారట? నేనైతే ఎక్కడా అనలేదు.. మరీ మాటలెలా వచ్చాయి?"

"మన సర్పంచ్ కొడుకు, మన శేఖరం క్లాస్‌మేట్సట.. మన శేఖరమే ఆ ఇల్లు అమ్మేస్తామనీ వాడితో అన్నాడట. అతనే మొన్ననే చదువు పూర్తి చేసుకొనీ ఈ ఊళ్ళో కోళ్ళఫారం పెడతాడట. ఇప్పుడు మనిల్లు అమ్మితే ఆ ఇల్లు చెట్లు కొట్టేసి అక్కడే కోళ్ళఫారం పెడతాననీ అతనే అంటున్నాడు. అందుకే పాతిక లక్షలిచ్చి కొంటాడా మరి నీకు ఇష్టమేనా?" అని అడిగాను.

నేనైతే ఎవ్వరితో అనలేదు.. నేను అమ్మను కూడా. అమ్మే ఉద్దేశ్యం కూడా లేదు..." అని చెప్పాను..

ఆ ఇల్లు అమ్మకం అన్నమాటే నాకు మింగుడు పడటంలేదు. ఆ ఆలోచన్నే నేను భరించలేకపోతున్నాను.

ఇంక నాకు అక్కడ ఒక్క క్షణం కూడా ఉండబుద్ధే కాలేదు. అక్కడ రెండు రోజులుందామనీ వచ్చానుకానీ ఈ వార్త తెలిసీ మనసు బాగులేక ఆ సాయంత్రమే ఇంటికి బయలుదేరాను.

♦♦♦

ఆ మర్నాడు నేను కాలేజీకి వెళుతున్నప్పుడు శేఖరం వచ్చి "15 లక్షలు ఫీజు కట్టాలి.. డబ్బు కావాలి" అని అడిగాడు.

"ఇప్పుడు అమెరికాలో చదువేమిట్రా? అక్కడ ఉన్నవాళ్ళనే ఇక్కడికి పంపించేస్తున్నారు.. ఇన్ని లక్షలు పోసి అక్కడ చదివితే ఉద్యోగం వస్తుందన్న గేరంటీ ఏమైనా ఉందా? రానురాను అమెరికా పరిస్థితులు మారిపోతున్నాయి. అక్కడ వారికే ఉద్యోగాలు దొరకటంలేదు" అన్నాను కోపంగా

"ఇక్కడ మాత్రం ఉద్యోగాలెక్కడ వస్తున్నాయి చెప్పండి? నాతో చదివిన.. వారంతా అమెరికా, బ్రిటన్, ఆస్ట్రేలియా వెళ్ళిపోతున్నారు. ఒక ఇరవైలక్షలు ఖర్చుపెడితే నా లైఫ్ సెటిల్ అయిపోతుంది" అన్నాడు శేఖరం.

"మా మేనేజర్ కొడుకు నీతో బాటే ఇంజనీరింగ్ చదివాడు. అతను రైల్వేలో సెలక్ట్ అయ్యాడు. కష్టపడి చదివినవాళ్ళకి ఇక్కడ బోలెడు అవకాశాలున్నాయి. నీలాంటి వాళ్ళు లక్షలు డొనేషన్లు కట్టి చదువులు పూర్తిచేసి ఉద్యోగాల

కోసం ఆకాశానికి నిచ్చెనలు వేస్తున్నారు. అమెరికా ఉద్యోగాలన్నవి దూరపు కొండలు నునుపు. అయినా అంత డబ్బు నా దగ్గర ఎక్కడుంది చెప్పు? మొన్ననే అక్క పెళ్ళి చేసాను. నా పీయఫ్ అంతా ... దానికి ఖర్చు పెట్టాను" అన్నాను.

మన ఊళ్ళోని ఇంటిని ఇరవై లక్షలకి కొంటాననీ నా స్నేహితుడడిగాడు. ఇప్పుడా ఇంటి వల్ల మనకేమిటి ఉపయోగం చెప్పండి. అది అమ్మేస్తే నా చదువు పూర్తవుతుంది నేనుగాని అమెరికాలో సెటిలైతే మనకు డబ్బు ఇబ్బంది ఉండదు" అన్నాడు శేఖరం ఆవేశంగా

వాడి మాటలు నాకు కోపాన్ని తెప్పించాయి.

"ఆ ఇంటిని గురించి నీకేం తెలుసు? ఆ ఇంటితో నాకెంతో అనుబంధం ఉందిరా.. నేనక్కడే పుట్టాను. నువ్వు కూడా అందులోనే పుట్టావ్.. మీదే ఊరనీ అడిగితే ఆ ఇల్లు ఉంది కాబట్టే మాదా ఊరనీ గర్వంగా చెప్పుకుంటున్నాం. ఆ ఇల్లు అమ్మి డబ్బిస్తే నువ్వు ఈ వృద్ధాప్యంలో మమ్మల్ని వదలి అమెరికాలో స్థిరపడిపోతావ్? మేం ఏ అయ్యేది నీ కక్కర్లేదు.. ఆ అవసరం కూడా నీకు లేదు. తల్లిదండ్రుల్ని వృద్ధాప్యంలో ఆదుకుందామనీ ఈ తరం వారెవ్వరూ ఆలోచించటంలేదు.. మీ కన్నా పక్షులు నయం.. ఏదేమైనా నేను ఆ ఇంటిని ఎట్టి పరిస్థితుల్లోనూ అమ్మను. ఇల్లు అమ్మితే వాడు దాన్ని కూల్చి, చెట్లను నరికేసి ఇటుకలు తయారుచేస్తాడు అక్కడ... నేను దానికి ఒప్పుకోను. మాతాత ఇల్లు కట్టించి ఆ నేరేడు చెట్టుని నాటింది మనుషులు, పక్షులతో ఆ ఇల్లు కళకళలాడాలనీ.. అంతగా నీకు చదువుకోవాలంటే కష్టపడి సంపాదించుకొనీ వెళ్ళు... అప్పుడు నిన్ను అడిగిన వాళ్ళెవ్వరూ ఉండరు..." అనీ నేను కోపంగా చెప్పేసరికి వాడు కూడా ఆవేశంతో " మీ సలహాలేవీ నాకక్కర్లేదు" అంటూ వెళ్ళిపోయాడు.

♦♦♦

నెలరోజులు గడిచాయి. శేఖరం నాతో మాట్లాడటం లేదు.

ఒకరోజు నేను కాలేజీలో పాఠం చెబుతుండగా వాడు వచ్చాడు. వాడిని చూసి నేను వరండాలోకి వచ్చాను.

"నాకు హైదరాబాద్‌లో ఉద్యోగం వచ్చింది. ఈ రాత్రే వెళ్ళాలి." అన్నాడు.

వాడి మాటలు నాకు ఆశ్చర్యం కలిగించాయి.

"నువ్వు స్టాఫ్ రూమ్‌లో కూర్చో.. క్లాస్ అయిపోగానే వస్తాను" అంటూ వాడిని పంపించేసి క్లాసు పూర్తైన తరువాత స్టాఫ్ రూమ్‌కి వెళ్ళాను.

స్టాఫ్ రూమ్ ఖాళీగా ఉంది. శేఖరం ఒక్కడే ఉన్నాడు. "అమెరికాలో చదవాలి.. పదిహేను లక్షలు కావాలన్నావ్.. ఇప్పుడేమైంది? నేను డబ్బు సంపాదించుకొనీ చదువుకోమన్నాను కానీ చదువుకోవద్దనలేదు... నా మీద కోపంతో నీకిష్టమైన అమెరికా చదువెందుకు మానుకోవడం?...." నా మాటలకు వాడు సమాధానం చెప్పకుండా మౌనం దాల్చేడు.

"వారం రోజుల క్రితం విస్సన్నయ్యకి ఫోన్ చేసి మన మూడెకరాల పొలాన్ని అమ్మెయ్యమనీ చెప్పాను. రేపువాడు డబ్బులు పట్టుకొనీ వస్తున్నాడు. వాటితో ఫీజు కట్టి అమెరికా వెళ్ళి చదువుకో.. నెల రోజుల నుంచీ నేను కూడా ఆలోచిస్తున్నాను. నీ ఇష్టాన్ని కాదనడం మంచిది కాదనిపించింది. ఇప్పుడాపొలం వల్ల మనకేం పెద్దగా ఉపయోగంలేదు" అన్నాను వాడితో..

"మీరు వెంటనే విస్సన్నయ్యకి ఫోన్‌చేసి పొలాన్నమ్మొద్దనీ చెప్పండి... నేను అమెరికా వెళ్ళకూడదనీ నిర్ణయించుకున్నాను. మీ మీద కోపంతో కాదు.. ఇక్కడే ఉద్యోగం చేస్తూ మీతోనే ఉంటాను. మిమ్మల్ని వదలిపెట్టి ఎక్కడికీ వెళ్ళను" ఆ మాటలు చెబుతుంటే వాడి పెదవులు వణకటాన్ని గమనించాను.

ఏం చెప్పాలో నాకు తోచటంలేదు. కొద్దిక్షణాలు మా మధ్య మౌనం.

"నా స్నేహితుడు రవి ఐదేళ్ళక్రితం అమెరికాలో చదివి అక్కడే స్థిరపడ్డాడు. అక్కడమ్మాయినే పెళ్ళి చేసుకున్నాడు. ఇక్కడ వాళ్ళమ్మానాన్నలు ఒంటరిగా ఉండేవారు. సంవత్సరంక్రితం వాళ్ళకి ఒంట్లో బాగులేకపోతే ఒక వృద్ధాశ్రమంలో చేర్పించాడు. వారం క్రితం వాళ్ళ నాన్నగారు అకస్మాత్తుగా చనిపోయారు. వాడు నాలుగు రోజుల తరువాత గానీ రాలేకపోయాడు. వాడెంత డబ్బు సంపాదించినా చివరి రోజుల్లో వాడి తల్లితండ్రులిద్దరూ అనాథల్లా ఆశ్రమంలో బతకవలసి వచ్చింది. వాడు మొన్నొచ్చి "తను డబ్బనే ఎండమావుల వెంట పరిగెత్తి అమ్మానాన్నల్ని నిర్లక్ష్యం చేసాననీ బోరుమని ఏడుస్తూ చెప్పాడు. వాడిని చూసిన తరువాత నా ఆలోచనల్లో మార్పు వచ్చింది. నేను వెళ్ళిపోతే మీరూ, అమ్మా ఒంటరైపోతారన్న ఆలోచన నాకు రాకపోవడాన్ని తలుచుకుంటే బాధ వేస్తోంది.. మన ఊరన్నా, ఇల్లన్నా, పెరట్లోని నేరేడుచెట్టన్నా మీకెందుకంత మమకారమో ఇప్పుడు తెలుస్తోంది." అనీ చెబుతూ వాడు కళ్ళుతుడుచుకుంటుంటే నాకు కూడా కళ్ళు చెమర్చసాగాయి.

♦

## దిక్సూచి

- చెళ్ళపిళ్ళ శ్యామల
9949831146

అవును
యిప్పుడంతా నేనే!
బ్రహ్మాండమంతా నాదే!

గ్రహాలన్నీ యిపుడు
నా చుట్టూనే
తిరుగుతున్నాయి
నేనే అయస్కాంత శక్తిని!
అమూల్య వస్తువుని!

నేనే రాజు
నేనే మంత్రి
నా మాటే శాసనం

ఐదేళ్ళుగా నేను
ఒట్టిబండరాయినే
నేడు శిల్పాన్ని
నేతలు కాబోయే చేతులు
మొక్కే
దేవుణ్ణి!

ఏ గుర్తింపు కార్డూ
అక్కర్లేకుండానే
నా కిపుడు
ఎంతో గుర్తింపు వచ్చింది!



నా ఎండిన పేగులు
నిమురుతూ.......
నా చుట్టూ.....
ఎన్నో చేతులు

నా ఆకలికి
ఒక్కసారిగా
విందు భోజనాల
ఆహ్వానాలు

ఎడారి నేలన
వడగండ్ల వాన
కురిసినట్లు
ఏనాడూ పిలుపుకి
నోచుకోని నా ముఖానికి
ఎన్నెన్నో పలకరింపులు

పథకాల పతకాలు
నా మెళ్ళో వేస్తూ....
వరాల ముత్యాలు
నా ముంగిట్లో పోస్తూ...
నా చుట్టూ
తిరుగుతున్న
దీపం పురుగులు

నా అడుగుల కింద
చేతులు పెడుతూ
నా అవసరాలకు
సాయం పడుతూ
నన్ను తమ గూట్లోకి
లాక్కోవాలనుకుంటూ
నా చుట్టూ అల్లుకుంటున్న
సాలెగూళ్ళు!

వీటన్నిటినీ దాటుకుంటూ
నిర్భయంగా
నడచిపోతున్నాను
ప్రలోభాల పరదాల వెనుక
దాగిందేమిటో నాకు తెలుసు!

ఏ గట్టుకెళితే
తీరం చేరగలనో నాకు తెలుసు
గెలుపుకు అస్త్రం
నా వద్దే ఉంది

నా చూపుడు వేలే
నాకు దిక్సూచి! ◆

---

## కన్నీటి కొలిమి

- కళ్యాణదుర్గం స్వర్ణలత
98486 26114

బాహాటంగా కనిపిస్తున్న బంధాలు కరిగిపోతుంటే
కారణాలను కన్నీటితో కడిగావు
గొంతు విప్పాల్సిన ప్రతిసారి
మౌనాల దారాలను పేనుతు
మెరుస్తున్న ప్రశ్నల కొడవలికి ఎర్ర రంగును అద్దావు
మనిషి ముసుగు వేసుకున్న డబ్బు పెదాలపై ఇన్స్టంట్ గా
పూసే కాగితం పూల రంగుల కోసం
మళ్ళీ మళ్ళీ మోసపోయావ్
బంధాలను బిగించే పనిలో నీవు బిరుసెక్కు తావు అనుకున్నా



కానీ...
కొలిమిలో మరిగే కన్నీళ్ళతో
విశ్వాసాల వేడితో జీవితాన్ని వెలిగించ లేక
చీకటి కి ఊపిరిని వేలాడేసావ్
నీ చివరి నెత్తుటి బొట్టు అశ్రువుల చలమను చూసి
కన్నీరు పెట్టుకుంది ◆



# సంస్కారము పెంచిన సాహస సంస్కరణము

ప్రియమైన ముని మనవడా,

నాయనా ఉమ్మయ్యా,

ఉమా మహేశ్వరరావువైన నిన్ను ముద్దుగా అలా పిలిచితిని. అన్యథా తలంచుకుము. మా అంతర్జాలంలో నీ లేఖా రూప వ్యాసం చూసితిని. నామీద కోపము చేత నా మనవడిని కాను, బెంగుళూరు నాగరత్నమ్మ మునిమనవడిని అని రాసితివి. అయినా అబ్బాయీ..ఒక్క నీవన్నదేమీ. తెలుగు గడ్డపైన పుట్టిన ప్రతివాడూ నా మనవడో మునిమనవడో కాకతప్పదంతే. మీ తాతమ్మ నాగరత్నమ్మ ఏదో విషయంలో నాపై వివాదపడినంత మాత్రాన నీవు నాకు కాకుండా పోయెదెవా? పోనిత్తునా? నాకునూ ఒకప్పుడు ముక్కోపి అని పేరుండెడిది గాని చచ్చిపోయిన పిమ్మట బాగా తగ్గినది. నేను పోయి వందేళ్లయిందని అందరూ సభలూ సంరంభాలు చేస్తూ పొగిడేస్తున్నారంటే చెప్పొద్దూ కొంచెం విసుగెత్తి వినోదం కోరుకుంటుంటే నీ రాత కనిపించింది. తెగ సంతోషించితిని. నూట ఇరవై పుస్తకాలు, వందల వందల వ్యాసాలు రాసిన ఈ తాతయ్య భోషాణములో నుంచి ఎవరో కొత్తగా అచ్చేసిన పాత పుస్తకమొకటి చదివి ఉడికిపోతివా నాయనా. 'వివేక వర్ధని' వ్యాసములూ ఒకటి అరా చదివి మరీ గుగ్గిలమై పోయావు. నీకు తెలుసుగా.. నేను హాస్యముగా ప్రహసనాలు, అధిక్షేప కావ్యాలు రాసినవాడిని గనక వున్నమాట చెప్పవలెనన్నచో ఇదియంతయు చాలా హాస్యముగా నున్నది.

ఏ మాటకామాటే గాని ఉమ్మయ్యా, నా తల పాగా, మీసాలూ ఒక్కటి వదలిపెట్టకుండా ఎంత బాగా వర్ణించావయ్యా, పక్కనే సమాధిలో వున్న మీ తాతమ్మ రాజ్యలక్ష్మికి చూపిస్తే ఎంత ముచ్చట పడిందో. నన్ను తల్చుకుంటే గర్వపడేవాడినని రాశావే...నాకెంత గర్వం రావాలిక. సంఘమునకు ఏదో చేసితినను అభిమానముచేత నన్ను బతికున్నప్పుడే కీర్తించెడి వారు. ప్రకాశం పంతులు తమ్ముడు నాపై కక్షతో వ్యాజ్యం వేస్తే నాకు వ్యతిరేకంగా తీర్పు చెప్పిన న్యాయమూర్తి గారు కూడా నేను దేవుడిలా తయారైనాను గనక ఏమీ అనడానికి లేదని వ్యాఖ్యానించి వుండిరి. ఇప్పటికి కూడా నన్ను అనడానికి లేదని రాసితివి గాని వాస్తవమునకు గతము నుండియు కొద్ది మంది తిట్టిపోయుచునే యుండిరి. దిగవల్లి వెంకట శివరావు గ్రంథమును దానికి అక్కిరాజు రమాపతి రావు సమాధానముతో పాటు పలువురి ఖండనలను నీవు చూచి యుండలేదా నాయనా? నీవు అదియును చదివి వున్నచో మరి నాలుగు ఎక్కువ రాసి యుందువే పాపమని నిట్టూర్చితిని. తాతలు ముత్తాతలం అయ్యాక అంతేనయ్యా.. భీష్ముడు చూడు తనను చంపడానికి తనే ఉపాయం చెప్పాడు. అర్జునుడు శిఖండిని తెచ్చిపెట్టుకున్నాడు. నా మీద కూడా అలాంటి శిఖండి దాడులు చాలా జరిగాయి గాని శిఖానలము వలె భస్మీపటలం చేయుచుంటిని.

అన్యముల కేమి గాని ఇప్పుడు నీ లేఖలో చూసినదానికి

చెప్పుదును. ముద్దుపళని రాసిన 'రాధికా సాంత్వనము'ను నేను తీవ్రముగా దూషించిన మాట యథార్థము. ఆమె వేశ్య గనకనే అట్లు పచ్చి శృంగార వర్ణన రాయగలిగినదని కూడా చెప్పి యుంటిని. అది తప్పిదమే, గాని ఆనాటి నా అవగాహన అంతియే యుండెను. నాకన్నా వందల వత్సరముల ముందే మూఢ నమ్మకములపై పోరాడిన వేమనను కూడా నేను గౌరవించకపోవుట నీవు మరిచితివి. అయిననూ కవుల చరిత్ర రాయుటకు నేను విశేష శ్రమ చేసిన మాట సత్యదూరము కాదు. నా రచనలన్నిటిలోకి అదియే ఉత్తమమైనదనీ, అలాంటి చరిత్ర రచనకు మొదటిదని మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు మెచ్చుకొనిరి.

జీవితమంతయూ మహిళల కోసమే తపించిన నన్ను పురుష పక్షపాతిగా నిందించుట సుంతయు ధర్మము కాదు. తండ్రిని చిన్నప్పుడే కోల్పోయినందు వల్ల అమ్మ కష్టము చేత బతికిన నేను స్త్రీలను నిరంతరము గౌరవించెడి వాడను. వేశ్యావృత్తి పట్ల నా కోపము ఆ అభాగ్యురాళ్లపైన గాక వారిని అసభ్య కార్యములకు ఉపయోగించు కునెడి పెద్ద మనుషులపైన ఎక్కుపెట్టి యుంటిని. నీకు తెలియదు గాని నాటి పెళ్లిళ్లు, పేరంటము లకు వీరిని రప్పించి ఎంత హీనముగా హేయముగా వారితో నాడించు కుండిరో క్రీడించు చుండిరో! ఒక్క హిందూ దేశమున మాత్రమే వేశ్యావృత్తికి ఒక కులమును ఏర్పర్చినారని నేను రాసి యుంటిని. వారినట్లు తామే సృష్టించిన ఆటబొమ్మల వలె చేసి ఆ వ్యామోహముతో భార్యాబిడ్డల పట్ల బాధ్యతలు కూడా విస్మరించి విచ్చలవిడిగా విశృంఖల విహారము చేసెడి వారు. ఈ భోగ కాంతలనట్లు ప్రదర్శించుట గర్వ కారణముగా భావించెడివారు. ఈ కారణముచే ఇంటిలో ఇల్లాళ్లు బయిటనా కాంతలు కూడా బలి అగుచుండెడి వారు. నా మిత్రుడైన రఘుపతి వెంకటరత్నం నాయుడు అచ్చముగా వేశ్యా విముక్తికే జీవితము అంకితం చేసెను. వేశ్యావృత్తినే గాక, వారిని వ్యక్తిగతముగా నసహ్యించుకొనెనను విమర్శ నాపై యున్న మాట నిజమే. దానిని నేను కాదనలేదు. నాకు కోపము అధికము గనక ఆ రసిక రాజులు మనుచు ఊరేగెడి వారిపై వుండవలసిన కోపము కొంత ఈ కాంతల పైనను చూపుట పొరబాటని ఒప్పుకుందును. మానవుల అవగాహన అనుభవము మీద మారును. ప్రహసనములలో సామాన్య పాత్రలను, భాషను ప్రయోగించిన నేను వ్యవహారిక భాషా వాదమును అంగీకరించుటకు మరికొంత కాలము పట్టుట అందుకు మరొక ఉదాహరణము.

ఇంతకునూ నేను పందొమ్మిదవ శతాబ్దపు మనిషినని మునిమనవడివైన నీవు మరిచి పోరాదు. వేశ్యావృత్తిపై పోరాడే సందర్భమునందు కొన్నిసార్లు నేను వారి పట్ల ఉపయోగించిన భాష, ప్రవర్తించిన తీరు సరిగా వుండెడివి కావు. ముద్దుపళని పుస్తకం నేను ఈసడించినను నాగరత్నమ్మ ప్రచురించుట ముదావహము. నేనట్లు రాయుటయే బాగుగా లేదని చెప్పుచు నీవు మరలా అదంతయూ పున:ప్రస్తావించుట సంచలనమునకు గాక సమాజమునకు ఎట్లు ఉపయోగకరము? సనాతన బ్రాహ్మణాచారము లపై నిప్పులు కక్కుచు నేను రాసిన 'హాస్య సంజీవిని' చదివి యుంటివా? అందొక్కొక్క చాందసమును ఎట్లు చీల్చి చెండాడితినో ఎరుగుదువా నాయనా? ఆ ప్రహసనములలో పలుచోట్ల వేశ్యలును గృహకాంతలును కూడా పురుషులను మీవలె మేము చేసిన నెట్టులుండునని ఆక్షేపించుచుండిరి. మీరు ఇప్పటికి చెప్పుకొను రచయిత చలం కంటే దశాబ్దముల పూర్వమే నేను స్త్రీల నోట నట్టి సాహస భాషణములు చేయించి యుంటిని. నాటి పురుషులు నాకై వేటాడుచుండ నీవంటి మనవలు నిరంతరము కంటికి రెప్ప వలె కాపాడుచుండిరి.

కావున నీ లేఖ మొత్తము చూసిన పిదప నీకు దేశకాలములు, చరిత్ర పరిస్థితులు పట్టవని గోచరమైనది. నీ కాలము లెక్కలోని ఒక తప్పిదమునాధారము చేసుకుని నన్ను బ్రాహ్మణ పురుష జనోద్ధారకుడు అనుట తగునా? ఒక్క రాజమహేంద్ర వరముననే గాక దేశమందెక్కడెక్కడి నుంచో బాల వితంతువులు, బాధిత యువతులు మా గృహమున ఆశ్రయము పొందిరని, వారిని నా ధర్మపత్ని రాజ్యలక్ష్మి తల్లివలె ఆదరించి ప్రోత్సహించెడిదని మరచితివా. సంగీత నృత్యాది కళలకు సంసార స్త్రీలను దూరము చేయుట సరికాదని చెప్పుటకు నేను అశ్లీల శృంగార నృత్యములు అలవాటు చేసిన తీరును వర్ణించితిని తప్ప స్త్రీల పట్ల నాకెన్నడునూ అగౌరవము లేదు. నా కన్నా మిన్నగా నా కాలమున వారిని గౌరవించిన వారు లేరని కూడా విశ్వాసముతో ప్రకటించుచున్నాను. స్త్రీల అజ్ఞానము, పరస్పర కలహములు వంటి వాటిని గురించి కూడా నేను చెప్పినదానిని ఏదో వ్యాసములో చూసి పాక్షికముగా రాసి యుంటివే గాని దానికి మూలకారకులెవరో చెప్పిన సంగతి మరచితివి.

'స్వప్రయోజనపరత్వము చేత దూరాలోచన మట్టుపడిన వారు తమ తరుణీమణులను విద్యా విహీనురాండ్రనుగా జేయుట వలన వారి నాశ్రయించియున్న మౌఢ్యభూతావేశమే గాని సహజ కోమలమైన స్త్రీ స్వభావము కాదు' అని నేను ఆత్మకథలో రాసియుంటిని. స్త్రీల సహజ స్వభావానికి భిన్నమైన పురుషాధిక్యత ప్రపంచ అంతర్గతీ కరణ అది.

ఆధునికుడవైన నీకు 'అంతర్గతీకరణ' గురించి తెలిసి వుండునని ఆశించుచు న్నాను. జీవిత మంతయూ అనువాద పదములు సృష్టించు టకు నేను చేసిన కృషి నీకు తెలియును గనక 'ఇంటర్నలైజేషన్'కు పర్యాయముగా వాడితినని చెప్పుచు న్నాను. వేశ్యలైనను గృహ కాంతలైనను ఈ పురుష పెత్తనముల నుండి బయిట పడవలెనన్న చదువు, కళలు, వృత్తి విద్యలు తెలుసుకొనవలయు ననియే నేను, నా భార్య పరితపించితిమి. అందకు పలు సంస్థలు స్థాపించితిమి. వాటిలో దళిత బాలికలు, వేశ్యా వృత్తి నుంచి బయిటపడిన వారు కూడా చేరుచుండిరి. ఇప్పటికిని రాజమహేంద్ర వరమున వాటిని నీవు దర్శించవచ్చును. దక్షిణ భారత దేశములో ఆ నాడు స్త్రీ విద్యకు అంతగా కృషి చేసిన వారు లేరని నన్ను వంగదేశపు ఈశ్వర చంద్ర విద్యాసాగరునితో పోల్చి ఆ బిరుదును ఇవ్వబూనగా వినయముతో నొప్పుకుంటినే గాని ఆకర్షణము చేత కాదు. యువకులు నాతో నడవడము వల్లనూ వదాన్యులైన వారి తోడ్పాటు వల్లనూ కొన్ని పనులు చేయగలిగితిని గాని నేను సామాన్యుడను మాత్రమేనని దినమునకు సహస్ర పర్యాయములు చెప్పుచునే యుంటిని.

మునిమనవడా, నేను రాసిన పుస్తకాల పుటలు తిప్పేకొద్దీ పొరలు తొలగుచున్నవని నుడివితివి. నీకు ఆ కాలము గురించి, అందున నా ఎదురీత గురించి వాస్తవ విషయములు చెప్పిన పొరలు తొలగుటయే గాక పశ్చాత్తాపములో కుంగి పోయెదవు. బతికియుండగా నన్ను విమర్శించిన నాళం కృష్ణారావు వంటి శిష్యులు నేను పోయిన పిమ్మట ఆరేళ్లకు ఎంతో బాధపడుచూ మాట్లాడిరి. నాయనా..కొటికలపూడి సీతమ్మ వంటి నాటి పుత్రికలు నాపై రాసినవైనను చదువుము చాలు. 'సత్యరాజా పూర్వదేశ యాత్రలు'లో ఆడమళ యాలము పేర స్త్రీలకు సర్వాధికారములున్న దేశమును చిత్రించిన నన్ను అపార్థము చేసుకొనుచుంటివి.

నా 'రాజశేఖర చరిత్ర' తొలి నవల అవునా కాదా అనునది మీ వంటి తదుపరి చరిత్రకారులు తప్పక నిర్ణయించవచ్చును. ఇప్పటికే దానిపై చాలా చర్చ జరిగియున్నది. జరగనిమ్ము. 'ది వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' గురించి చెప్పియే యుంటిని కదా, అందు మూఢనమ్మకములపై పోరాటమే గదా రాసినది. 'వివేక వర్ధని' 1875 అక్టోబరు సంచికలో నేను ఆంగ్ల విద్య మా కాలపు చాందసాలను తొలగించుటకెట్లు ఉపకరించెనో స్వయముగా రాసి యుంటిని. దానిపై నీవునూ పరిశోధన చేసి కొత్తగా చెప్పుట బాగున్నది. మా తరములోకి వచ్చి చూసిన గాని నీకు ఆమాటల వివరము అర్థము కాదు. బ్రిటిష్ వారు ఇందుకు సహకరించిన మాట, పాశ్చాత్య సాహిత్యము మా అవగాహన పెంచిన మాట నిజము. అందుకు అభ్యంతర మేముండును? నేను జరిపించిన మొదటి పునర్వివాహము కలెక్టరు, పోలీసు అధికారి వచ్చి భద్రత కల్పించని యెడల సాధ్యమై వుండెడిది కాదు.

నేను స్వాతంత్ర్య పోరాటమున పాల్గొనలేదని చాలా సార్లు విమర్శలు వినియున్నాను. నేను పుట్టునాటికి ప్రథమ భారత స్వాతంత్ర్య సమరమే జరిగి యుండలేదు. 1887 లోనే 'వివేక వర్ధని'లో బ్రిటిష్ పాలకుల పద్ధతుల పైన, మనవారికి ఉద్యోగములు ఈయకపోవుటపైన చాలా విమర్శనములు రాసియుంటిని..నేను భారత జాతీయ మహాసభ (కాంగ్రెసు) గురించియు రాసి యున్నాను. నా జీవితపు చివరి ఘట్టము వరకు కాంగ్రెసు వారు బ్రిటిష్ రాజు పట్ల విధేయులుగానే యుండిరి. గాంధీ మహాత్ముడు నేను మరణించు నాటికి ప్రఖ్యాతిలోకి రాలేదు. నా ప్రియశిష్యుడైన నాళం కృష్ణారావు నేను తొలిసారిగా కట్టించిన పురమందిరములో ఖుదీరాం బోసు చిత్రమును యుంచినప్పుడు వలదని అభ్యంతరము పెట్టిన మాట నిజము. మారిన పరిస్థితులలో యువత నన్ను ధిక్కరించిన మాటనూ నిజము. ఆపై నేను వారికి అన్నియు అప్పగించి చెన్నపట్టణము వెళితినే గాని ఎట్టి యాటంకము కలిగించలేదు. సంఘ సంస్కరణ ఉద్యమము తర్వాత స్వాతంత్ర్య పోరాటము మొదలైనది.

ఇంకనూ చాలా రాయవచ్చును గాని నాయనా నీ నేపథ్యము నాకు తెలియును. నీవు ఒక దినపత్రిక యందు రచయితవగుట చాలా సంతోషదాయకము. కావున వృత్తి చేతనూ నీవు నా వారసుడివే. ఎందువల్లనన తొలుత తెలుగు పత్రికలు ప్రారంభించి రచయితలను ప్రోత్స హించిన వారిలో నొక్కడనై యుంటిని. పరి శోధనాత్మక పాత్రికేయత కూడా చేసి యుంటిని. అట్టి ఈ మృత వృద్ధుడిపై ఇంత కినుక

# రామతీర్థ ఇకలేరు!



ప్రముఖ సాహిత్య విమర్శకుడు, అనువాదకుడు, కవి రామతీర్థ మే 30న కన్నుమూశారు. ఆయన అసలు పేరు యాదలూరు సుందర రాంబాబు. కానీ ఆ పేరు పెద్దగా ఎవరికీ తెలియదు. రామతీర్థగా ఆయన సాహిత్యరంగంలో ప్రసిద్ధులయ్యారు. ఆయన నెల్లూరు జిల్లా అలగానిపాడులో 1960లో జన్మించారు. ఉద్యోగరీత్యా విశాఖలో నివాసం ఏర్పరుచుకున్నారు. విశాఖపట్నంలో మొజాయిక్ సాహిత్య సంస్థను స్థాపించి నిత్యం సాహిత్య కార్యక్రమాలు నిర్వహించేవారు. ఆయన తెల్లమిరియం కవితా సంపుటి వెలువరించారు. సఫ్దార్ హష్మి రాసిన బాలగేయాలను తెలుగులో రామతీర్థ అనువదించిన పుస్తకాన్ని ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురించింది. పలువురు తెలుగు రచయితల రచనలను ఆంగ్లంలోకి అనువదించారు. తెలుగు, ఇంగ్లీషు భాషలలో సాహిత్య అంశాలతో కూడిన వ్యాసాలను నిరంతరం పత్రికలకు రాస్తూ ఉండేవారు. వివిధ సాహిత్య అంశాలపై నిర్మోహమాటంగా విమర్శ రాయడంలో రామతీర్థ వెనకాడేవారు కాదు. సాహిత్యం ద్వారా ప్రగతిశీల భావాల ప్రచారానికి తన సమయమంతా వెచ్చించి కృషిచేసిన రామతీర్థ మృతి తెలుగు సాహిత్య రంగానికి తీరని లోటు. కందుకూరి వీరేశలింగం శతవర్ధంతి సంవత్సరం ప్రారంభ కార్యక్రమాన్ని రామతీర్థ గత సంవత్సరం మే27న విశాఖలో నిర్వహించారు. అంతేకాకుండా విశాఖపట్నంలో వీరేశలింగం శతవర్ధంతి ముగింపు సభలు జరపడానికి సన్నహాలు చేస్తున్న క్రమంలో ఆయన కన్నుమూశారు. సామాజిక నిబద్ధతతో రచనలు చేసిన కందుకూరి, గురజాడ, శ్రీశ్రీ తదితరుల సాహిత్యంపై నిరంతరం సదస్సులు, వర్ధంతి, జయంతులు మొజాయిక్ సంస్థ తరపున జరుపుతుండేవారు. నిరంతర సాహిత్య శ్రామికుడు రామతీర్థ అర్ధాంతర మృతికి సాహితీస్రవంతి, సాహిత్య ప్రస్థానం ప్రగాఢ నివాళి అర్పిస్తున్నది. ◆

యేల తండ్రీ..మీ పత్రిక వార్షికోత్సవ సమయమున మీ యజమాని రాధాకృష్ణుల వారిని కీర్తించుచు ఆ పత్రిక పున:ప్రారంభమే ఒక అద్భుతమని మీ యజమాని దమ్ము గురించి మరీ మరీ కీర్తించితివే. దాదాపు నూటయాభై ఏళ్ల కిందటనే అనేక అద్భుత పత్రికలు, పుస్తకములు వెలువరించి అవినీతిపై చాందసాలపై పోరాడిన నాబోటి వాడికెంత దమ్ము కావలెనో ఊహించలేవా? ఈ రంగములో, సంఘములో వారికంటే ఎంతెంతో పాతవాడినైన నా పాత్ర ఏమిటో వాస్తవికముగా చూడలేక పోయితివే! నా సంస్కరణమున సంస్కారమున్నదీ లేనిదీ ఈనాటి మీవంటి వారి సంస్కారములోనే చూచుకుందును. నేను ఆంధ్ర దేశమున పుట్టుట అదృష్టమని మీ తొలి వ్యవస్థాపక సంపాదకుడైన నార్ల వారు 1948ననే రాసియుండిరి. అయిననూ నాలో పెక్కు లోపములున్నవని ఆత్మకథ యందే చెప్పుకుంటిని. మనుషులెవరినందైనను నవి యుండును. చివరగా నొక్క మాట. నా ఆత్మకథలో తుది విన్నపము నందున్నదే మరల నుడివెదను. మనను మనము సంస్కరించుకొనని యెడల స్వాతంత్ర్యము వచ్చినను నిష్ఫలమని నేనను చుంటిని. మేము ఆ కాలముననే యజ్ఞోపవీత మును విసర్జించి సహపంక్తి భోజనము వంటివి చేసితిమి. ఇన్ని సంవత్సరముల తర్వాతయునూ దేశమున మూఢనమ్మకములు, మతతత్వములు విజృంభించుచున్నవి. స్వేచ్ఛ హరించబడుచున్నది. మేము ఎదురించిన కపట స్వాములు పాలకులగు చున్నారు. కుల భేదములు పెరుగుచున్నవి. అటులే మహిళలు అమానుషమైన మహావమాన ములకు గురియగుచున్నారు. కొత్త ముసుగులతో వారిని బలి తీసుకొనుచున్నారు. ఈ ముత్తాత తప్పులు ఎంచుట కన్ననూ మీ కాలమున సాగుతున్న దుర్మార్గములు, దుష్కృత్యములపై పోరాడుట ఎక్కువ ఉపయోగమని నా మనవి. అందుకు నా ఆశీస్సులు నీకుందును. ఈ లేఖార్థములు మీ పత్రికకు పంపి ప్రచురించుటకు సమయము చాలనందున మొదటి నుంచియు నా రచనలు ముద్రించుచున్న 'ప్రజాశక్తి' వారికి ఇచ్చి ప్రచురింపజేసితిని.

**మీ ముత్తాత కందుకూరి వీరేశలింగము**

**- తెలకపల్లి రవి**



2015లో విశాఖపట్నంలో జరిగిన వైజాగ్ ఫెస్ట్‌లో
చిత్రకళా ప్రదర్శనలో తెలకపల్లిరవితో రామతీర్థ

# స్నేహ సాహితీ సాగర తీర్థుడు రామతీర్థ

- తెలకపల్లిరవి

నిరంతర ఉత్సాహం నిశిత విమర్శనం, నిర్మాణాత్మక భాగస్వామ్యం, నిబద్ధత నిండిన నిపుణత ఇవన్నీ కలిస్తే కలబోస్తే రామతీర్థ కేరాఫ్ సాహిత్య విశాఖ. ఆయన హఠాన్మరణం సాహితీ మిత్రులందరినీ కలతపెట్టిన విషాదం. నిరంతర స్నేహశీలిగాక్రియాశీలిగా సంచరించే రామతీర్థ కందుకూరి వీరేశలింగం శత వర్ధంతి సభల సన్నాహాలలోనే కన్నుమూయడం యాదృచ్ఛికమేమీ కాదు. ఆయన సంస్థ పేరు మొజాయిక్ గాని ఆయన పూర్తిగా ప్రొజాయిక్. ఏదో ఒక విమర్శ విశ్లేషణ విస్మయం వివరణ లేకుండా ఒక్క సారైనా రామతీర్థ మాట్లాడ్డం నేనెరుగను. ఒకటిన్నర దశాబ్దం పైబడిన మా సాహితీ సాన్నిహిత్యంలో రామతీర్థ ఎన్ని కార్యక్రమాల్లో పాల్గొన్నారో మరెన్నిటికి రప్పించారో ఎన్నిరాశారో మరెన్ని రాయించారో చెప్పడం కష్టం. విశాఖ సాగర కెరటాల్లాగే ఆయన ఆలోచనా తరంగాలు కూడా అవిరామంగా ఎగిసిపడుతూనే వుండేవి.

2000 ప్రథమార్ధంలో తెలుగు సాహిత్యలోకంలో విశాల పునస్సమీకరణ కోసం సాహితీ స్రవంతి సాహిత్యశాలలు జన కవనాలు కార్యశాలలు నిర్వహిస్తున్న దశ అది. రామతీర్థ గురించి మొదట ఇతరుల ద్వారా విని మాట్లాడాలనుకునేంతలో ఆయనే ఫోన్ చేశారు. ఏదో కార్యక్రమానికి కూడా రప్పించారు. అప్పుడప్పుడే జగద్ధాత్రి ఆయన ఎల్‌ఆర్ స్వామి వంటి వారు మొజాయిక్ సంస్థ స్థాపిస్తున్నారు. విశాఖ ద్వారకా నగర్‌లో పౌర గ్రంధాలయం వారం వారం సభలకు నిలయమై పోయింది. అక్కడ అప్పట్లో ఎంఎల్‌సిగా వున్న ఎంవిఎస్‌శర్మ కూడా హాజరవుతుండేవారు. చందుసుబ్బారావు వంటి స్థానిక విద్వాంసులు సరేసరి. చాలాసార్లు హైదరాబాద్ విజయవాడ తదితర చోట్ల నుంచీ రప్పించేవారు. చాలా సార్లు పిలిచే వారు. రెండు మూడేళ్లకు వెళ్లేవాణ్ని. ఈ లోగా విశాఖలోని స్రవంతి కార్యకర్తలతో ఆయన సంబంధాలు కలిగివుండేవారు. వారి అవగాహనకు వుండే పరిమితులు వాస్తవ సమస్యలు చెబుతూనే కలుపుకొని పోవడానికి ప్రయత్నిస్తుండేవారు. వారూ ఆయనను ఆహ్వానించే వారు. 2009లో శ్రీశ్రీ శతజయంతి మా మధ్య దృఢమైన సేతువు కట్టింది. చాలా సభలకు మాతోపాటు వస్తుండేవారు. పాబ్లో నెరూడా నుంచి సాహిత్యంపై మార్క్స భావాల వరకూ చెప్పగలిగే వారు, శ్రీశ్రీ సాహిత్యానికి పాశ్చాత్య దేశాలలో అధునిక ప్రయోగాలకు మధ్య సంబంధం శక్తివంతంగా వివరించేవారు. అప్పుడే నాకు రామతీర్థ బాగా గుర్తుండిపోయారు. ఆయనకు ఇంగ్లీషు తెలుగు సంస్కృతం హిందీ వంటి సాహిత్యాలతో మంచి పరిచయం వుంది. చరిత్ర చదువుకున్నారు. అన్వయించగలరు. ఉన్నత విద్యావంతునిగా ప్రజా సంబంధాలు పాటించడంలోనూ ప్రజ్ఞావంతులైనారు. ఆధునిక మేనేజిమెంటు సాంకేతిక ప్రక్రియలు ఆకళింపు చేసుకున్నారు. శ్రీశ్రీ పైన ఒక పవర్ పాయింట్ కోసం శ్రమపడిన తీరు బాగా నచ్చింది. అయితే వనరుల కొరత వారిద్దరే చేయవలసి రావడం ఇబ్బంది కరమైంది. స్వతహాగా ముక్కు సూటిదనం, పరిపూర్ణత తపన వుండే రామతీర్థ ఒక పట్టాన సంతృప్తి చెందరు కూడా. ఈ కారణంగా చాలా పనులు మీద వేసుకునే వారు.

చాలా మంది సాహిత్య కారుల్లో లేనిది ఆయనలో చూసింది ఉద్యమ కారులను గౌరవించడం. తన ఫోన్లకు వెంటనే

స్పందించకపోయినా సూచనలు స్వీకరించకపోయినా చెబుతూనే వుండేవారు. ఎలాగో మాలాటివారికి ఎక్కిస్తే మార్పు వస్తుందని ఆయన ఆశ అని నాకు అర్థమైంది. మొదట్లో నియో క్లాసిస్టు అనిపించిన రామతీర్థకు మార్క్సిస్టు అవగాహన చారిత్రిక స్పృహ వున్నాయని కొద్ది కాలంలోనే అర్థమైంది. ఉత్తరాంధ్రలో జరిగే సభల్లో గాని లేక వివిధ పత్రికల సాహిత్య శీర్షికల్లో గాని వచ్చే పొరబాటు భావాలు డొల్ల కల్ల సూత్రీకరణలు ఆదున అసలు భరించలేకపోయేవారు. గురజాడ ఆధునిక భావాలను ఆంగ్లేయ ప్రేరితంగా చిత్రించే అఘాయిత్యంపై ఎంతగా ఆగ్రహించేవారో చెప్పలేను. అలాటివి చూడగానే ఫోన్ చేసి వాటిపై విరుచుకుపడేవారు. వాటిపై రాయాలనేవారు. అయితే సాహిత్యంలోనూ చారిత్రిక పరిణామంలోనూ లోతైన అవగాహన లేకపోతే ఆ అంశాలు గ్రహించడమే చాలా కష్టం. కనుక వాటిపై మరీ ఎక్కువ శ్రమ పడటం పాఠకులను శ్రమ పెట్టడం ఎందుకని చెబితే ఆయనకు తృప్తి వుండేది కాదు.

తమిళ మళయాల కన్నడ భాషల వలె ఆధునిక తెలుగు సాహిత్యం గురించి బయిట ప్రపంచం మాట అటుంచి దేశంలో ఇతర రాష్ట్రాల వారికే తెలియదని మనకు తెలుసు. ఇంగ్లీషు భాషపై మంచి పట్టున్న రామతీర్థ ఆ బాధ్యత తనపై వేసుకోవాలనుకున్నారు. కొంత చేశారు కూడా. అయితే ఆయనకు సమయం వనరులు సరిపోలేదు. ప్రోత్సాహం కూడా తగినంత రాలేదు. పైగా స్థానిక కార్యకలాపాలు సభలూ ప్రసంగాలూ వుండనే వుండేవి. తను కోరుకున్నంతగా ఆ పని చేయలేకపోయారు గాని చేసేందేమీ తక్కువ కాదు. పైగా తామే మొదటి సారి చేశామంటూ తెలుగు క్లాసిక్స్‌ను అరకొరగా అనువదిస్తే ఈ మిత్రుడు అసలు భరించలేకపోయేవారు. అలాటి వాటిని చీల్చి చెండాడేవారు. ఇంగ్లీషులో రాయాలని సూచించిన నన్ను ఎవరు వేసుకుంటారని ఎదురు ప్రశ్న వేశారు. అప్పట్లో హన్స్ ఇండియా సంపాదకుడుగా వున్న మిత్రుడు కె.రామచంద్రమూర్తికి తనను పరిచయం చేస్తే ఎప్పటికప్పుడు రాస్తూ వచ్చారు. తర్వాత కాలంలో సాక్షిలో వాటిని కొనసాగించారు.

ఇంతటి బహుముఖ జ్ఞానం నిశిత పరిశీలన గల రామతీర్థ పిల్లలతో కూడా నాటకాలు వేయించేంత సరళ హృదయుడు. ప్రతిదానికి ఆనందించేవారు. పండితులతో ప్రభుత్వ ప్రతినిధులతో మాలాటి వారితో ఏక కాలంలో సంబంధాలు నెరుపుతూ ఎక్కడ ఏది ఎంత సాధ్యమైతే అంత కృషి చేసేవారు. పూర్వ కుటుంబాల గురించి నాకు తెలియదు గాని రామతీర్థ జగద్ధాత్రి సహజీవనం సాహిత్య లోకంలో సత్ఫలితాలే ఇచ్చింది. శ్రీకాకుళం విజయనగరం పట్టణాలలో గురజాడ జయంతి సభ నా పుస్తకాల ఆవిష్కరణ తర్వాత మేము వచ్చేప్పుడు ఆంధ్ర ప్రదేశ్‌లో ద్రవ్య పెట్టుబడికి ఒక కేంద్రంగా వున్న విశాఖ పట్టణం భూమికగా ఇంగ్లీషులో నవల రాయాలని గట్టిగా కోరాను. చాలాసేపు దానిరూపురేఖల గురించి మాట్లాడాము. ఆయనకు రాజకీయాంశాలపై మంచి అవగాహన వుంది. అయినా సరే మరో ప్రత్యేక తరహా కథాంశంతో నవల రాస్తానన్నారు. మొదలు పెట్టారో లేదో జగతమ్మకే తెలియాలి. ఈ విచార సమయంలో ఆమెకు కుటుంబ సభ్యులకు ప్రగాఢ సంతాప సానుభూతులు చెప్పడం తప్ప చేయగలిగింది లేదు. అయితే సాహిత్య అకాడమీ సభ్యురాలుగా వున్న ఆమె తన సాహిత్య కృషిని కొనసాగిస్తుందనే భావిస్తున్నాను.

దేశంలో పెరిగిపోతున్న మతతత్వం, భావ ప్రకటనా స్వేచ్ఛపై దాడి రామతీర్థ తీవ్రంగా ఖండించేవారు. దేశ దేశాల ఉదాహరణలతో తూర్పార పట్టేవారు. మేము కలుసుకున్న చివరి సభ ఏప్రిల్ 29న శ్రీశ్రీ జయంతి శ్రామిక జనకవనం. ఉత్తరాంధ్రలో చాలా మంది సాహిత్య ప్రముఖులు అక్కడకు విచ్చేశారు. సభలో ఆయన ప్రసంగం ప్రవాహ సదృశంగా సాగింది. ప్రత్యక్షంగా కలుసుకోవడంఅదే చివరి సారి అవుతుందని అనుకోలేదు. తర్వాత ఈ మధ్య వీరేశలింగంపై ఒక మిత్రుడు లేవనెత్తిన దుమారం ఆయనను చాలా కలతపెట్టింది. తనేదో రాయాలనుకుంటుండగా ప్రజాశక్తిలో కందుకూరి లేఖ రూపంలో నా వ్యాసం రాగానే చూసి ఎంతో సంతోషించారు. మెసేజ్‌లు పెట్టి ఆ పైన ఫోన్ కూడా చేశారు. తనూ రాజ్యలక్ష్మ్మ రాసినట్టు లేఖ రాశారు. ప్రజాశక్తిలో ప్రచురితమైన ఆ రచనే బహుశా ఆయన ఆఖరి ముద్రిత రచనేమో మరి. ఆ కందుకూరి శత వర్ధంతి సభ ఆంధ్ర యూనివర్సిటీలో కలసి నిర్వహించే సన్నాహాలలోనే ఆయన కన్నుమూశారు. జయప్రదంగా ముగిసిన ఈ శతవర్ధంతి సంస్మరణ సభలు రామతీర్థకు అంకితమవుతాయి. రామతీర్థ తరహాలో క్రియాశీలత అధ్యయన తత్పరత అన్వయ సామర్థ్యం పెంచుకోవడం ఈ దశలో ఎంతైనా అవసరం. ఆయనకివే జోహార్లు. ◆



# మనల్ని వీడిన శ్రీ శ్రీ గురించి వీడని జ్ఞాపకాలు

- చేకూరి రామారావు

శ్రీశ్రీ మన మధ్య నుంచి వెళ్లిపోయి అప్పుడే నాలుగేళ్ళు అయింది. అయినా ఆయన జ్ఞాపకాలు మన్ని అంటిపెట్టుకొనే ఉన్నాయి. శ్రీ శ్రీ ప్రస్తావన లేకుండా ఏ సాహిత్య చర్చా జరగటానికి వీల్లేని పరిస్థితి ఈనాటి తెలుగు సాహిత్యంలో ఉంది. అప్పుడప్పుడు చేరాతలను పరామర్శించే మా రాయిస్టు (మేధావి) మిత్రుడు వెనిగండ్ల వెంకటరత్నం అదోరకంగా నవ్వుతూ అడిగాడు."శ్రీశ్రీ ప్రస్తావన లేకుండా చేరాతలు రాయలేరా?" అని (మేధావులే రాయిస్టులవుతారో! రాయిస్టులంతా మేధావులో ! నాకు తెలీదుకాని రాయిస్టులంతా మేధావులనుకుంటారని చిన్నప్పటి నుంచీ నేను అనుకుంటుండే వాణ్ణి), చేరాతలులో శ్రీశ్రీ ప్రస్తావన అధికంగా ఉన్నట్టు పైన పేర్కొన్న మా రాయిస్టు మేధావి మిత్రుడు వేలెత్తి చూపెట్టే వరకు నాకు తోచలేదు. పైగా ఆయన హేతువాది కూడా. అకారణంగా ఆ మాట అని ఉండడు కదా! అర్థశతాబ్ది పాటు తెలుగు సాహిత్యాన్ని ('నడిపించిన' అని అనదల్చుకోలేదు) మరపించిన మహాకవిని అంత త్వరగా మర్చిపోయే కృతఘ్నుజాతి కాదు ఇది.

1950వ దశాబ్దిలో సాహిత్యలోకంలో కళ్లు తెరిచిన సాహిత్యకులకు, మిగతా వాళ్లకన్నా శ్రీశ్రీ మీద అభిమానం ఆరాధన ఎక్కువ. శ్రీశ్రీని సంబోధిస్తూ వచ్చిన కవితలు (కె.వి.ఆర్. ఆరుద్ర, చందన్, చేరా మొ)ఈ దశాబ్దిలోనే వచ్చినై. హరి మాటల్లో 'శ్రీశ్రీ పిచ్చి' వీళ్లకి మెండు.

ఆంధ్రదేశ చరిత్రలో 1955లో జరిగిన ఉప ఎన్నికలు చాలా ప్రముఖమైన సంఘటన! రాష్ట్ర రాజకీయాల్లో మార్పుకోసం అభ్యుదయ శక్తులు తమ బలాన్ని పరీక్షించుకున్నాయి. ప్రమాదాన్ని పసికట్టిన ప్రతికూల శక్తులు తమలో తమకున్న భేదాలను తాత్కాలికంగా విస్మరించి, ఒకటిగా పోల్చి అభ్యుదయ శక్తులను ఎన్నికల్లో ఓడించగలిగాయి. ఆనాటి అభ్యుద రచయితల సంఘం వేదికమీద చేసిన అధ్యక్షోపన్యాసంలో శ్రీశ్రీ 'ఫౌల్‌చేసి, గోల్ చేసి గెల్చిన ప్రతీశక్తులు వట్టవగ్గాలు లేకుండా విజృంభిస్తున్నాయి' అని వర్ణించారు.

ఆనాటి రాజకీయాల ప్రభావం సాహిత్య లోకం మీద ఎంత స్పష్టంగా పడిందంటే రచయితల్లో కూడా స్పష్టమైన విభజన ఏర్పడింది. శ్రీశ్రీ కమ్యూనిస్టులను సమర్థిస్తూ వాళ్ల వేదిక మీద ఉపన్యాసాలిచ్చాడు.

ఆ సందర్భంలో ఒక రచయిత పేరుతో ఒకాయన ఆంధ్రపత్రికలో రాసిన సంపాదక లేఖ కొంత సంచలనాన్ని సృష్టించింది. రష్యాను, కమ్యూనిస్టులను కలిపి నిందించటం ఆ ఉత్తరం లక్ష్యం. శ్రీశ్రీ దానికి సమాధానం రాస్తూ ఒక రచయిత మాస్కో యూనివర్శిటీని గురించి ఇచ్చిన తప్పుడు సమాచారాన్ని సవరించాడు. అందులో 'విశాఖపట్నంలో బాంబులు పడితే ఢిల్లీ దాకా పరుగెత్తిన మనం...' అంటూ శ్రీశ్రీ ఒక వాక్యం రాశారు. ఇంకేం దేశం భక్తులకవకాశం దొరికింది. మళ్లీ ఒకసారి శ్రీశ్రీని రష్యాభక్తుడు, దేశద్రోహి అంటూ 'దేశభక్తులు గొంతు చించుకున్నారు. ఈయన మహాకవి ఎట్లా అయ్యాడు? రష్యా! నా రష్యా అనగానే మహాకవి అవుతాడా? అని ఆనాటి పత్రికల్లో వీళ్ళు సందు దొరికింది

కదా అని శ్రీశ్రీ మీద దాడి చేశారు. శ్రీశ్రీ మానసిక ఆరోగ్యం కూడా దెబ్బతినేంతగా వాళ్లు శ్రీశ్రీని గాయపరిచారంటే ఆ దాడి ఎంత తీవ్రమయిందో అర్థం చేసుకోవచ్చు. ఎన్నికలు రెండు మూడు వారాల్లో ప్రారంభం అవుతాయనగా నార్లవెంకటేశ్వరరావు గారి ప్రోద్బలంతో ప్రజాస్వామ్య రచయితల లక్ష్య ప్రకటన అంటూ ఒకటి ఆంధ్రప్రభలో వచ్చింది. మర్యాద అయిన మాటల్లో కమ్యూనిస్టు వ్యతిరేక లక్ష్య ప్రకటన అది. అందులో ఆనాడు అభ్యుదయ కవులుగా పేరు తెచ్చుకున్న వారి సంతకాలు కూడా ఉన్నాయి. ఈ ప్రకటనకు సమాధానంగా నార్ల చిరంజీవి, కొడవటిగంటి కుటుంబరావు గార్లు రాసిన సుదీర్ఘ బహిరంగ లేఖలు అప్పుడు చదివిన వాళ్లు ఇప్పటికీ మరిచిపోలేరు. 1950వ దశాబ్దపు సాహిత్య చరిత్రలో (రాజకీయ చరిత్రలో కూడా) ఈ లేఖలు పూర్తిగా ముద్రించదగినవి. ఆనాటి శ్రీశ్రీకి సంబంధించిన కొన్ని విశేషాలను హరి తన 'జ్ఞాపకాల'లో 1987 జనవరి మధ్య భాగం ఆదివారం ఆంధ్రజ్యోతిలో ప్రకటించారు.

ఎన్నికలు అయిపోయినై. అభ్యుదయశక్తుల ఓటమి ఊహకు అందనంతగా జరిగింది. దాని విశ్లేషణలు రాజకీయ పార్టీల వారు చేసుకున్నారనుకోండి, కాని శ్రీశ్రీ అభిమానులు మాత్రం శ్రీశ్రీకి కలిగిన గాయాన్ని మర్చిపోలేదు.

శ్రీశ్రీకి ట్రిబ్యూట్‌గా ఆనాటి నిజాం కళాశాల తెలుగు పత్రికను శ్రీశ్రీ ముఖచిత్రంతో 1957లో కొందరు మిత్రులం కలిసి వెలువరించాం. ఆనాడు ఒక కళాశాల పత్రికకు శ్రీశ్రీ ముఖచిత్రం వేయించటమంటే ఒక ఉద్యమం నిర్వహించినంత పని! ఈ ప్రయత్నం చాలా మంది దృష్టిని ఆకర్షించింది. ఆనాటి 'అభ్యుదయ' మాస పత్రికలో కె.వి. రమణారెడ్డి గారు సమీక్షించారు కూడా! అందులో శ్రీశ్రీ దేశ భక్తుడని నిరూపిస్తూ నేను రాసిన చిన్న వ్యాసం ఒకటి నేరుగా శ్రీశ్రీకి పంపితే ఆయన ఒక కార్డుముక్క మీద 'దేశభక్తీ, విదేశ భక్తీ అనే డిబేటింగు పాయింట్లకు ఇది అదునుకాదు' అని నన్ను మెత్తగానూ సూటిగానూ మందలిస్తూ రాశారు. ఆ వాక్యమే దేశ భక్తిని గురించి నా ఆలోచనలను మార్చింది. పొగడ్తలను చిరు నవ్వులతో స్వీకరించకుండా పొగిడిన వాళ్లను మందలించటం శ్రీశ్రీకి ఒక అలవాటు. శ్రీశ్రీని గురించి ఇట్లాంటి అనుభవాలు ఇంకా గాఢంగా ఉన్నవారు చాలా మంది ఉన్నారు. వారు వారి వారి అనుభవాలను వెల్లడిస్తే శ్రీశ్రీ సాహిత్య జీవిత చరిత్ర రచనకు ఉపయోగిస్తాము. శ్రీశ్రీ స్పెషలిస్టులుగా పేరు తెచ్చుకొన్న కె.వి.ఆర్ రారా.లు సన్నిహితులుగా మెలిగిన చలసాని ప్రసాదు వంటి వారు ఈ ప్రయత్నం చెయ్యొచ్చు. (ఆరుద్రకు శ్రీశ్రీ మీద ప్రెజుడిస్ ఇంకా పోయినట్టు లేదు.). శ్రీశ్రీ సాహిత్య జీవిత చరిత్రను రాసే వారు వేసుకోవాల్సిన ప్రశ్నలు కూడా కొన్ని ఉన్నాయి. వాటికి నిష్పాక్షికమైన దురభిమాన రహితమైన సమాధానాలు కావాలి. అభిమానం ఉండొచ్చు. ముదిరితే ఆరాధన అవుతుంది. అది సత్యాన్వేషణకు ఆటంకం. ఇట్లాంటి ప్రశ్నలను కొన్నిటిని ప్రస్తావిస్తాను.

1930 వరకు తెలుగు సాహిత్యం నన్ను నడిపించి ఆ తరువాత నేను దాన్ని నడిపించాను అని శ్రీశ్రీ అన్నదాన్ని పట్టుకొని శ్రీశ్రీని యుగకర్త అనొచ్చునా? శ్రీశ్రీ యుగవాణిని బలంగా నినదించిన మాట నిజమే. కాని యుగకర్త అంటే మహాపురుషులు యుగాలు నిర్మిస్తారన్న ధోరణిని అంగీకరించినట్టు కాదా! ఆధునిక కవిత్వానికి జనకుడు ఎవరు అని ఈ మధ్య కాలంలో కొందరు చర్చించారు. శ్రీశ్రీ అభిమానులు శ్రీశ్రీ అని మరి కొందరు గురజాడ అని వాదించుకున్నారు. జాతిపిత, భారత మాత, తెలుగు తల్లి వంటి వాటిని కల్పించుకొని జాతి చరిత్రను గాని, సాహిత్య చరిత్రను చూడటం నాన్సెన్సు, న్యూసెన్సు కదా?

శ్రీశ్రీ వైరుధ్యాల పుట్ట. ఆశ్చర్యకరమైన అమాయకత్వమూ ఉంది. దాచుకోలేని పారదర్శకమైన (ట్రాన్స్‌పరెంటు) డిప్లొమెసీ ఉంది. కమ్యూనిస్టు సిద్ధాంతాల మీద విశ్వాసమూ ఉంది. నెహ్రూ, ఇందిరాగాంధీలను సోషలిస్టులనే తెలివితక్కువ తనమూ ఉంది. ఒక పక్క సోషలిస్టు విలువలను పొగుడుతూనే తన సెక్సు విజయాలను చాటుకునే ఫ్యూడల్ తత్వమూ ఉంది. సమాజంలో ఏ దుర్లక్షణాల్ని జయించ గలిగాడు? వేటికి లొంగిపోయాడు? ఈ రెంటినీ ఆబ్జెక్టివ్‌గా వివరించాలి. లోపాలు పేర్కొన్నంత మాత్రాన శ్రీశ్రీ సాధించింది ఎక్కడికీ పోదు. ఆఖరుగా శ్రీశ్రీ ఎవరివాడు అనే పిచ్చి ప్రశ్న ఒకటి ఉంది. నా జాతి జనులు పాడుకొనే గీతంగా మోగాలని అన్న శ్రీశ్రీ అందరివాడు అని కొందరు అంటే 'నా శాశ్వత చిరునామా 'విరసం' అన్నాడు శ్రీశ్రీ అని మరికొందరు చూపిస్తున్నారు. శ్రీశ్రీ విరసం సభ్యుడు కావటానికి, జాతికంతటికి కావాల్సిన కవి కావటానికీ వైరుధ్యం ఎక్కడుంది?

శ్రీశ్రీ సంపూర్ణ మానవుడు, లోపాలూ గుణాలూ సమపాళ్లలో ఉన్నవాడు, కష్టాలూ, సుఖాలూ ఒకేలాగా అనుభవించిన వాడు. కవిగా శాశ్వతుడు.

శ్రీశ్రీ అద్వితీయుడు

***(జూన్ 15న శ్రీశ్రీ వర్ధంతి)*** ◆



# కందుకూరిపై విమర్శ-పరామర్శ

ప్రొ॥ వెలమల సిమ్మన్న
9440641617

"కొత్తగా పూనుకొని ఒక పనిచేయడం కష్టం. చేసినదానికి వంకలు పెట్టి దానిలో తప్పులు పట్టడం సులభమే"

– కందుకూరి

వీరేశలింగం రచనలపైన, ఆయన వ్యక్తిత్వంపైన, ఆయన బ్రతికి వున్నప్పుడు, చనిపోయిన తర్వాత, ఎన్నో విమర్శలు వచ్చాయి. ఇందులో మంచి విమర్శలు వున్నాయి. కువిమర్శలు వున్నాయి. కొందరు కావాలని కందుకూరిపై లేనిపోని అభియోగాలు మోపారు. ఆ విమర్శలు ఏవీ స్థిరంగా నిలబడలేదు. ఆ విమర్శల్లో నిజాయితీ లేదు. ఆయన ఏది రాసినా, ఏది చేసినా, ఏమి మాటలాడినా, అందులో నిబద్ధత వుంటుంది. అందువల్ల వీరేశలింగంపై వచ్చిన విమర్శలన్నీ పటాపంచలయ్యాయి. ఈ అభియోగాన్నీ ఒక వర్గం వారు పనికట్టుకొని కావాలని చేశారు. అంచేతనే ఆ విమర్శలు నిలబడలేదు. ఆ విమర్శకులు తెలుగు సాహితీరంగంలో కువిమర్శకులుగా మిగిలిపోయారు.

కందుకూరి ఆధునికుడు కాదు. కొన్ని ప్రక్రియలకు నేనే మొదటి వాడిని అని చెప్పుకున్నాడు. ఆంధ్ర కవుల చరిత్ర రచనా విధానం బాగులేదు. కవుల చరిత్రలో వేమనగూర్చి రాయలేదు. ఆయన రచనలు సర్వసాధారణమైనవి. అందులో సృజనాత్మకతలేదు. ఆయన రచనల్లో ముఖ్యంగా ప్రహసనాల్లో అసభ్య శృంగారం, అసహ్యపుహాస్యం, చోటుచేసుకున్నాయి. కందుకూరి దేశభక్తుడుకాడు. జాతీయవాది కాదు. స్వాతంత్ర్యోద్యమంలో ఎక్కువగా పాల్గోలేదు. వీరేశలింగం కుల సంఘ సంస్కర్తే కాని, మొత్తం సమాజానికి సంఘ సంస్కర్తకాదు. ఆయన భాష, శైలి, విషయాల్లో కూడా విమర్శలు వచ్చాయి. పై విమర్శల్లో దేనిలోనూ పసలేదు. అందుకే ఆ విమర్శలకు సాహితీరంగంలో విలువలేకుండా పోయింది.

ప్రారంభంలో తీవ్రంగా వీరేశలింగంపై విమర్శలు చేసినవారు నాళంకృష్ణారావు, టంగుటూరి శ్రీరాములు (టంగుటూరి ప్రకాశం పంతులు సోదరుడు) గార్లు. నాళం కృష్ణారావు వీరేశలింగం చనిపోయిన తర్వాత తన తప్పును గుర్తించి "అనుతాపం" ప్రకటించారు. తర్వాత శ్రీరాములు తన అభియోగాన్ని ఉపసంహరించుకున్నారు. కావాలని విమర్శలుచేస్తే ఇలాగే వుంటుంది. నిజం ఎప్పుడూ నిలకడగానే

తెలుస్తుంది.

కందుకూరి ఆధునికుడు కాడు, అనేది ఒక విమర్శ. సాహిత్యం, సమాజ సంస్కరణలతో పాటు, ఇతర అనేక విషయాల్లోనూ ఆయన "దూరదృష్టి" మనకు కన్పిస్తుంది. విమర్శకులకు ఎందుకు కనబడలేదో నాకు అర్థం కావడంలేదు. గ్రంథాలయాలు నెలకొల్పారు. పురపాలక కార్యక్రమాల్లో పాల్గొన్నారు. పురమందిరం పేరుమీద "టౌన్ హాల్" కట్టించారు. స్త్రీ విద్యకోసం, స్త్రీ స్వేచ్ఛకోసం, స్త్రీ అభివృద్ధిని కాంక్షించారు కందుకూరి. ఇవన్నీ ఆయన ఆధునిక దృష్టికి ప్రబల తార్కాణం. అందుకే నార్లవారు -

"వీరేశలింగం దక్షిణ భారతంలో ప్రథమ ఆధునికుడు. శత్రుభీకరుడు, అనేక వివాదరంగాలలో విజయుడుగ, స్వతంత్ర భావాలకు మూలస్తంభంగ, సాహస కార్యాచరణుడుగ, ప్రగతి శీలుడుగ, మహా రచయితగ, విద్యావేత్తగ, సంఘ సంస్కర్తగ, వీరేశలింగం మహామనీషి" అని అన్నారు.

తెలుగు సాహిత్యంలో కందుకూరే అత్యంత మొదటి ఆధునికుడు. ఆ విషయం, విమర్శకులుగా మీరు తెలుసుకోపోతే ఎలా? ఆయన రచనల్ని అధ్యయనం చేస్తే ఈవిషయం తేటతెల్లమవుతుంది. మీ యంతట మీరే, నేనే ఆధునికుడనని గొప్పలు చెప్పుకోకండి. అది అంత మంచిపని కాదు. కందుకూరిని విమర్శించే ముందు, ఆయన రచనల్ని వివేచన చేయండి. ఆ తర్వాత విమర్శించండి. అప్పుడు కందుకూరి ఆధునికుడా? కాడా? అనేది మీకు తెలుస్తుంది. ఏదో ఒకటి రాసి, పెద్దవాళ్ళను విమర్శిస్తే, నేను కూడా పెద్దవాడను అవుతాను అని అనుకోవడం అవివేకం అవుతుంది.

"తన సంఘంతో పోరాడి, సాహిత్యంలో జీవించి, సంస్కరణం సంఘంలోనూ, సాహిత్యంలోనూ సాధించిన కందుకూరి వీరేశలింగం పంతులు సాహిత్యంలో ఆధునికత సంతరించాడు. ఆధునిక సాహిత్యం కందుకూరితో ఉషోదయమయింది. ఆధునిక సాహిత్యం వస్తు ఇతివృత్తం పాత్ర, భాషా దృష్టితో పరిశీలించే నూత్న విధానానికి ఆద్యసాహిత్యం కందుకూరి అందించాడు. సమాజం వేగంగా పరిణామం చెందుతున్న కాలంలో కందుకూరి సాహిత్యం చేపట్టాడు. ఈ సాహిత్యం ఆ సమాజ పరిణామం వేగవంతం కావించింది. సమకాలీన సమాజ జీవితం సాహిత్యం వస్తువు, ఇతివృత్తం కావటమన్నది కందుకూరి కాలంలో స్పష్టంగా ప్రారంభమయింది. ఈ నూత్న లక్షణం ఆధునికతా గుణంగా విమర్శకులు గుర్తించారు". అని విఖ్యాత విమర్శకులు కొలకలూరి ఇనాక్ తేల్చిచెప్పారు. ఇంకా మీరు కందుకూరి ఆధునికుడు కాడంటే, అసలు మీరు విమర్శకులే కారు.

ఆధునిక తెలుగు ప్రక్రియల్లో కొన్నింటిని నేనే మొదటగా రాశాను, అనే దానిపై విమర్శవుంది. కందుకూరి "స్వీయ చరిత్రలో తొలినాటకం, తొలి ప్రహసనం, తొలి వచన ప్రబంధం, తొలికవుల చరిత్ర, తొలి శాస్త్రీయ గ్రంథాల్ని రాసినట్లు పేర్కొన్నారు. పైన చెప్పిన వాటిలో ఒక్క ప్రహసనానికి మాత్రమే కందుకూరి ఆద్యులు. తక్కినవాటికి కాదు. అంతకుముందే తక్కిన ప్రక్రియలకు రచయితలు వున్నారు. నవల విషయంలో కందుకూరి కంటే ముందు ఒక నవల వుంది. ఆ నవలపేరు "శ్రీరంగరాజు చరిత్ర". రచయిత పేరు గోపాలకృష్ణమచెట్టి. అలాగే కందుకూరి కంటే ముందు ఆదిభట్ల నారాయణ దాసు రాసిన ఆత్మ కథ "నా యెఱుక" వుంది. ఈ రెండు ప్రక్రియల్లోనూ వీరేశలింగం మొదటి వారు కాదు. తక్కిన ప్రక్రియల్లో భిన్నాభిప్రాయాలు చోటుచేసుకున్నాయి. అయితే ఇక్కడ ఒక విషయాన్ని వున్నది వున్నట్లు మనం చెప్పుకోవాలి. ఆ ప్రక్రియలకు ప్రాముఖ్యాన్ని, ప్రాచుర్యాన్ని కలిగించింది మాత్రం వీరేశలింగం అని చెప్పక తప్పదు. ఈ విషయంలో అందరిదీ ఒకే మాట.

"ఆంధ్ర కవుల చరిత్ర"లో, నిరూపణకు ఇచ్చినంత ప్రాధాన్యం కవితా కళను, ఆవిష్కరించడానికి ఇవ్వలేదు. అంతేకాక కవి కాలాదుల్లో చాలా తప్పులు వున్నాయి. అనేది ఒక బలమైన విమర్శ, కందుకూరి కవులచరిత్రపై అనేక విమర్శలు చోటు చేసుకున్నాయి "పరిశోధన" అనేది ఎప్పటికప్పుడు మారుతుంది. పరిశోధన లక్షణం అది. 'ఆంధ్రకవుల చరిత్ర'కు కూడా అది వర్తిస్తుంది. ఈ విషయాన్ని విమర్శకులు మరిచిపోకూడదు. కనీస అవగాహన లేకుండా, అజ్ఞానంతో విమర్శించకూడదు. విమర్శించడానికి కూడా కొన్ని నియమాలు, పరిమితులు, పద్ధతులు వుంటాయి. ఆ విషయాలు అన్నీ మీకు తెలియవా? నా ఇష్టం వచ్చినట్లు మాటలాడుతాను, నా ఇష్టం వచ్చినట్లు విమర్శిస్తాను అంటే, సాహిత్యంలో మీరు, విమర్శకులుగా నిలబడలేరు. పద్ధతి మార్చుకోండి. రచనలు రాసేవాడికంటే విమర్శకుడు గొప్పవాడు అనే విషయం మీ మనసునుండి తొలగించండి. చక్కగా ఆలోచించండి. మంచిగా విశ్లేషించండి. ఉత్తమ విమర్శకులు అవుతారు.

'ఆంధ్ర కవుల చరిత్ర' చాలా సంవత్సరాలు ప్రామాణిక గ్రంథంగా వుంది. ఇప్పటికే సాహిత్య చరిత్ర కారులు అందరికీ

ఈ గ్రంథమే పరమ మార్గదర్శి. ఈ గ్రంథం చదవకుండా ఎవ్వరూ తెలుగులో సాహిత్య చరిత్రలు రాయలేదు. రాయలేరు కూడా. ఇది సత్యం. ఇందులో వాదోపవాదాలకు, చర్చలకు తావులేదు. అందరిదీ ఒకే మాట.

ఈ గ్రంథంలో పరిశోధన దండిగా వుంది. ప్రారంభ పరిశోధన కాబట్టి, కొన్ని లోపాలు జరగవచ్చు. జరుగుతాయి కూడా. అసలు విషయం ఏమంటే, మీరు తెలుసుకోవలసింది, పరిశోధన అనేది రోజురోజుకు మారుతుంది. పరిశోధనలో మార్పులు జరగడం సహజం, తనకు దొరికిన ఆధారాలతో, ఆయా కాలం నాటి కవుల చరిత్రను పరమ శాస్త్రీయంగా కందుకూరి రాశారు. అలాగే ఆయా కవుల రచనలోని ముఖ్యమైన, ప్రత్యేకమైన విశేషాల్ని వివరించారు. ఆయా కవుల కావ్యంలో ఈ పద్యం లేదు. ఆ పద్యం రాస్తే బాగున్ను, అనే విమర్శలు కూడా వున్నాయి. మీకు నచ్చిన పద్యం రచయిత రాయాలనుకోవడం మీ అజ్ఞానాకి పరాకాష్ఠ. అర్థంపర్థంలేని విమర్శలు, కువిమర్శ కిందకు వస్తాయి. అంటే మీరు నూటికి నూరుపాళ్ళు కువిమర్శకులు అన్నమాట.

ఒక కావ్యంలోని అన్ని అంశాల్ని ఎవరూ విశ్లేషించలేరు. అది సాధ్యపడదుకూడా. కవుల చరిత్ర ఒక కవికి సంబంధించింది కాదు. ముందుగా విమర్శకులు ఆ విషయాన్ని గమనించాలి. కావాలని రంధ్రాన్వేషణ చేస్తే 'తెలుగు సాహిత్య విమర్శ' ప్రక్కతోవ పడుతుంది. కందుకూరి రాసింది కవుల చరిత్ర. కవి చరిత్ర కాదు. అదైనా మొదటిగా వివరంగా రాశాడు. రాసినంతవరకు కావ్యాల్ని గూర్చి, అందులోని ముఖ్యమైన అంశాల్ని గూర్చి, కావ్య గొప్పతనం గూర్చి, ఇతర ముఖ్యమైన విషయాల్ని గూర్చి, తాను పరిశోధించి, దొరికిన సమాచారం మేరకు, మనకు అందజేశారు. ప్రాచీన కావ్యాల్లోని మంచి చెడ్డల్ని కందుకూరి విశ్లేషించారు. ప్రాచీన కావ్యాల్లోని శృంగారాన్ని చీల్చి చండాడారు.

ఆ కాలంలో విషయాన్ని సేకరించడమే కష్టం. ఇప్పుడువున్న వనరులు అప్పుడు లేవు. సేకరించిన విషయాన్ని ఒక పద్ధతి ప్రకారం రాయడం మరీ కష్టం. రాసే వాడికి తెలుస్తుంది ఆ బాధ ఎమిటో. అలాంటి పరిశోధనా విషయాన్ని తీసుకొని రాయడం, మాటలు చెప్పినంత సులభంకాదు. ఆరోగ్యం బాగులేకపోయినా రాయగలిగాడు. మరో వ్యక్తి అయితే ఎప్పుడో మధ్యలోనే ఆగిపోయేది. పరమ మొండివాడు కాబట్టి అనుకున్న పని సాధించాడు. విజయం పొందాడు. సహృదయ పాఠకుల ప్రశంసల్ని అందుకున్నాడు. కందుకూరి పరిశోధన సామాన్యమైంది కాదు. మాటలతో, రాతలతో చెప్పలేం. ఒక సంస్థ చేయవలసిన పనిని ఒక వ్యక్తి చేశాడు. అందుకే వీరేశలింగం వ్యక్తికాదు శక్తి.

"ఆంధ్ర కవుల చరిత్ర"లో ప్రజాకవి వేమనకు స్థానం కల్పించలేదని ఒక బలమైన విమర్శ వుంది. కందుకూరి ఒక ప్రణాళికను ఏర్పాటుచేసుకున్నారు. ఆ రచనా ప్రణాళికకు అనుగుణంగా గ్రంథ రచన చేశారు. ప్రాచీన సనాతన సంప్రదాయ సాహిత్యంలో అంటే 800 వందల సంవత్సరాల్లో ప్రజాకవి ఒక్కడే వున్నాడు. అతనే వేమన. ఈ విషయంలో మరో మాటలేదు. ముక్తకంఠంతో సాహితీవేత్తలందరిదీ ఒకే మాట. "ఆంధ్ర కవుల చరిత్ర"లో వేమన లేకపోవడం లోటే. ఈ గ్రంథంలో వేమన చోటు చేసుకుంటే బాగుండేది. కందుకూరి కావాలని తన గ్రంథంలో వేమన ప్రస్తావన తేలేదని ఒక వాదన. ఈ వాదనలో నిజంలేదు. తన రచనా ప్రణాళిక ప్రకారం కందుకూరి కవుల చరిత్ర రాశారు. ఈ విషయాన్ని విమర్శకులు జాగ్రత్తగా వివేచన చేయాలి.

కందుకూరి రచనలపై విమర్శ వుంది. అది ఏమంటే ఆయన రచనలు సర్వ సాధారణమైనవి. అంతే కాదు, మేల్తరమైన సృజనాత్మకరచనలు కావనేది ఒక విమర్శ. ఇది అవగాహనలేని విమర్శ. ఆ కాలంలో సమాజం అస్థవ్యస్తంగా వుంది. అప్పటికి తెలుగు సాహిత్యం పూర్తిగా పతనావస్థలోవుంది. సమాజానికి ప్రయోజనం లేని రచనలు ఎన్నో వచ్చాయి. కందుకూరి సమాజాన్ని గూర్చి ఆలోచించడమే కాక, నూతన ప్రక్రియలకు ఆద్యుడు అయ్యారు. తెలుగు సాహిత్యాన్ని కొత్త పంథావైపు నడిపించారు. ఆయన మార్గం ఎంతో మందికి ఆదర్శమైంది. ఈ విషయాన్ని ఏ విమర్శకుడు కాదనలేడు. ప్రారంభ రచనలు కాబట్టి కొన్ని లోపాలు వుండవచ్చు. అలా అని వీరేశలింగం రచనల్ని కొట్టిపారేయడానికి వీలులేదు. ఆయన రచనలు సృజనాత్మకమైనవి కావు అనడం సమంజసంగా లేదు. కందుకూరి నూటికి నూరుపాళ్ళు సృజనాత్మక రచయిత. అందుకే కందుకూరి రచనలపై పరిశోధనచేసిన అక్కిరాజు రమాపతి రావుగారు "వీరేశలింగం రచనల్లో సర్వసాధారణంగా ఆయన తాదాత్మ్యం కనబడుతుంది. ఆయన వ్యక్తిత్వముద్ర ప్రస్ఫుటంగా చోటుచేసుకుంటుంది" అన్నారు.

వీరేశలింగం వేగం, ఆవేశం, ఉద్రేకంతో రచనలు

చేయడంవల్ల, ఆయనలో కొన్ని లోపాలు చోటుచేసుకున్నాయి. ఈ విషయాలన్నీ మనందరికీ తెలిసిందే. మనం ఒక విషయాన్ని ఎప్పుడూ మరచిపోకూడదు. కందుకూరిలోని ఆ ఉద్రేకవే ఆయనను వీరసంఘసంస్కర్తగా చేసింది. సమాజానికాయన చేసిన సేవ, ఇంతా అంతా కాదు. మనసమాజంకోసం వీరేశలింగం కలాన్ని కత్తిగా వాడారు.

కందుకూరి సాహిత్య మాధ్యమాన్ని సమాచారానికి మాత్రమే ఉపయోగించుకున్నారు. వారి దృష్టి ఎప్పుడూ సంఘసంస్కరణే కాని, సాహిత్య సంస్కరణకాదు. వీరేశలింగం సామాజిక జీవితానికి ఇచ్చిన ప్రాముఖ్యం, సాహిత్య జీవితానికి ఇవ్వలేదు. అంచేతనే కందుకూరి సంఘంలో సాహితీవేత్తకన్నా, సుప్రసిద్ధ సంఘ సంస్కరణగానే ఎక్కువ ప్రాధాన్యత సంతరించుకున్నారు. రాసినది తిరిగి చూడకుండా, అలాగే ముద్రణకు ఇవ్వడం వల్ల కందుకూరి రచనల్లో సాహిత్యపు విలువలు తక్కువగానే వున్నాయి. అంతమాత్రంచేత వీరేశలింగం సృజనాత్మక రచయిత కాదనడం భావ్యంకాదు.

కందుకూరి రచనలో ముఖ్యంగా ప్రహసనాల్లో అసభ్య శృంగారం, అసహ్యపు హాస్యం చోటుచేసుకుంది అనేది ఒక విమర్శ. ప్రధానంగా ప్రహసనాల్లో అక్కడక్కడ అసభ్యశృంగారం, మితిమీరిన హాస్యం చోటుచేసుకుంది. అందుకే గురజాడతో సహా ఎంతోమంది విమర్శించారు. కావాలనే కందుకూరి అలా రాశారు. రచనలో ఆ తీవ్రత వుంటే కాని, సమాజంలో కొంత మందిలో మార్పు రాదని కందుకూరి భావన. అందువల్లే ఆయన అవసరమైనప్పుడు, సందర్భాన్ని బట్టి, విషయాన్ని బట్టి, భాషా తీవ్రతను పెంచుకుంటూ రాశారు. కొంతమందికి వీరేశలింగం ఇచ్చిన 'డోస్' అవసరం. అన్ని రోగాలకీ ఒకే మందు పనికిరాదు. ఒక్కొక్క రోగానికి ఒక్కొక్క మందు ఇవ్వాలి. ఈ విషయం డాక్టర్ గారికి మాత్రమే తెలుస్తుంది. అందరికీ తెలియదు. రోగి ఆరోగ్యం బాగుపడాలంటే 'డోస్' పెంచుకుంటూ రావలసిందే. కందుకూరి ఆ పనే చేశారు. విజయం సాధించారు.

వీరేశలింగంపై ప్రధాన విమర్శ ఆయన దేశభక్తుడు కాదు. జాతీయవాది కాదు. స్వాతంత్ర్యమహా సంగ్రామంలో ఎక్కువగా పాల్గొలేదు అనేది ఒక విమర్శ. స్వాతంత్ర్యోద్యమంలో కందుకూరి పాల్గొలేదని అపవాదం ఒకటి వుంది. ఈ వాదనలో నిజంలేదు. అవగాహన లేనివారు చెప్పిన కువిమర్శ ఇది. ఈ రోజుకీ కూడా మన సమాజంలో మేధావులు, అవినీతి పోవాలనీ, స్త్రీలు విద్య పొందాలనీ, జాతి, మత, కుల, వైషమ్యాలు పోవాలనీ, ఉద్యోగుల్లో లంచగొండుతనం పోవాలనీ, రాజకీయ నాయకుల స్వార్థచింతన పోవాలనీ,.. ఇలా ఎన్నో గ్రంథాలు రాశారు. రాస్తూవున్నారు. ఉపన్యాసాలు ఇచ్చారు. ఇస్తూ వున్నారుకూడా. అందుకే ఆ రోజుల్లో వీరేశలింగం ముందు సంఘం బాగుపడితే, ఆ తర్వాత స్వాతంత్ర్యం వస్తే మంచిదనే అభిప్రాయపడ్డారు. స్వాతంత్ర్యం వద్దు అని వీరేశలింగం ఎక్కడా అనలేదు. మీరు పెడఅర్థాలు తీయకండి. వక్రబుద్ధితో ఆలోచించకండి. కందుకూరి చెప్పిన దానిలో నూటికి నూరుపాళ్ళు నిజం వుంది. విమర్శకులు చేసిన దానిలోనే పసలేదు. మీదుమిక్కిలి వాళ్ళ వాదన సమాజాన్ని తప్పుత్రోవ పట్టించునట్లు వుంది.

కందుకూరి "అఖిల భారతీయ కాంగ్రెసు" తొలిసభ్యులలో ఒకరు. రాజమండ్రిలో కాంగ్రెసు పార్టీ ఉద్దేశాలను లక్ష్యాన్ని గూర్చి కందుకూరి ప్రత్యేకంగా ఉపన్యాసం ఇచ్చారు. మద్రాస్‌లో 1887లో "అఖిలభారత జాతీయ కాంగ్రెస్" మూడో సభ జరిగింది. ఆ సభలో కందుకూరి పాల్గొన్నారు. రాజమండ్రిలో దేశీయ మహాసభ (నేషనల్ కాంగ్రెస్)లో పౌరుల్ని ఉద్దేశించి మంచి ఉపన్యాసం ఇచ్చారు. దేశాభిమానం గూర్చి , దేశ భాషలగూర్చి, దేశాభివృద్ధి సాధనం గూర్చి వ్యాసాలు కూడా రాశారు వీరేశలింగంగారు. దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం రావాలని కోరుకుంటూ ఉత్తేజం పొంది, మద్రాసు కాంగ్రెసుసభ తీర్మానాల్ని తెలుగు భాషలోనికి అనువదించారు కందుకూరి. ఈ విషయాన్ని గూర్చి చెపుతూ ఆచార్య ఎన్.జి. రంగాగారు "కాంగ్రెస్‌సిన్స్ 1917" అనే శీర్షికతో 1985 మే 6 తే॥నాటి "నేషనల్ హెరాల్డ్" ఆంగ్ల పత్రికలో ఒక వ్యాసం కూడా రాశారు. పై విషయాలవల్ల తేలిన సారాంశం ఏమంటే వీరేశలింగం రాజకీయ స్వాతంత్ర్యానికి వ్యతిరేకులు కారు.

'స్వీయచరిత్ర'లో వీరేశలింగం తన గూర్చితాను –

"నేనెప్పుడు ధనవంతుడను గాను, బలవంతుడను గాను, అధికారవంతుడను గాను, అధిక విద్యావంతుడను గాను, ఇట్లు మహాకార్య విజయనిర్వహణలకు గావలసిన వానిలో దేనిని గలవాడను గాక పోయినను, దేశాభిమాన మొక్కటి మాత్రము కొంచెము గల వాడనగుటచేత, తత్ప్రేరణము వలన శక్యాశక్య విచారము చేయక, దేశసంస్కరణోద్యమములలో నీడుగుపెట్టసాహసించితిని" అని

అన్నారు.

కందుకూరికి దేశాభిమానం లేదనడం, ఆయన దేశభక్తుడు కాదనడం, కావాలని కొంతమంది గిట్టని వాళ్ళు పనికట్టుకొని చేసిన పని. కందుకూరి మీదృష్టిలో దేశభక్తుడు కాదంటే, మీరు కువిమర్శ జాబితాలోకి వస్తారు. ఆయన వ్యక్తి స్వాతంత్ర్యాన్ని, సంఘం స్వాతంత్ర్యాన్ని, రాజకీయ స్వాతంత్ర్యాన్ని, మనసారా కోరుకున్నారు. ఆయన హేతుబద్ధంగా, శాస్త్రీయంగా ఆలోచించారు. కొందరికి అది నచ్చలేదు. ఇతరుల కోసం భావాలు మార్చుకున్న వ్యక్తి వీరేశలింగం కాదు. తనకంటూ దృఢమైన అభిప్రాయాలు కల మహానుభావుడు. కందుకూరి రాజకీయ స్వాతంత్ర్యం కోరుకున్నారు. దానికన్నా ముందు సమాజంలో కొన్ని సంస్కరణలు జరగాలని కోరుకున్నారు. అవి సాంఘిక, మత, ఆర్థిక, విద్యా విధానాల్లో సంస్కరణలు కావాలని మనసారా కాంక్షించారు. ఈ సంస్కరణలు అన్నీ జరిగినప్పుడే, రాజకీయ స్వాతంత్ర్యం వస్తే సమాజం ఇంకా బాగుంటుందని కందుకూరి అభిప్రాయపడ్డారు.

సంఘసంస్కరణ లేని స్వాతంత్ర్యం నిష్ప్రయోజనం అని కందుకూరి వారి ప్రగాఢ విశ్వాసం. అందుకే "సాంఘిక సంస్కారములందు మన వారికి మాటలలో గల శూరత్వము కార్యములలో నింకను నేనభిలాషించినంత కనబడుటలేదు. మన సంఘస్థితి బాగుపడిన గాని ప్రభుత్వము వారనుగ్రహించు స్వాతంత్ర్య ఫలములను మనము నిర్విచారముగా ననుభవింపజాలము" అని "స్వీయచరిత్ర"లో కందుకూరి రాశారు.

పరిపూర్ణ స్వాతంత్ర్యానికి సంబంధించి వీరేశలింగం అభిప్రాయాల్ని తెలుసుకుందాం.

"దేశమును మంచిదశకు తీసికొనివచ్చి లోకములో ప్రఖ్యాతికెక్కాదు దేశములలో నొక దానిని చేయవలెనన్నచో మొట్టమొదట సామాన్య జనుల యొక్క స్థితిని బాగుచేయుటకు ప్రయత్నపడవలయును.

జన సామాన్యమునందు విద్యాభివృద్ధి కలిగిననే కాని యెప్పుడును నీ దేశమును మంచి దశయందున్నదని చెప్పవలను గాదు.

దేశాభిమానమనగా దేశమునందలి దురాచారాములను తొలగించి, సదాచారములను ప్రతిష్టాపించి, దేశమునకు క్షేమము కలిగించుటయే కాని, యుక్తాయుక్త వివేచనలేక తోటి యాచారముల నెల్లునంధ ప్రాయముగా బలపరచు చుండుట కానేరదు.

జాతిమత ద్వేషముల మూలగతిగి పెరుగుచున్న దురాచార వృక్షమును మూలచ్ఛేదము చేయుటకయి ప్రయత్నించక రాజ్యాంగ విషయకములయిన స్వాతంత్ర్యములను పొందుటకయి, లక్ష ప్రయత్నములు చేసినను వాని వలన సంపూర్ణమైన ఐకమత్యమును నిష్పాక్షిక దృష్టియుగలుగ నేరవు.

క్రూరములయిన కులాచారములకు దాసులమయి, మన యింట నుండి స్త్రీల కష్టములను నివారింపలేని వారము రాజ్యాంగ స్వాతంత్ర్యములను పొంది, వారి యొక్క కష్టముల నెట్లు నివారింప గలుగుదుము?.

మతవైషమ్యమును వహించి, ఐకమత్యమును త్యజించి, యొందూరులను ద్వేషించుచు, తగవులాడు చుండెడి వారము. రాచరికపు సంబంధములయిన స్వాతంత్ర్యమును పొందినప్పుడు జాతిమత వైషమ్యములు విడిచి యెట్లు సర్వజనక్షేమమునకయి ఐకమత్యముతో పాటు పడగలము.

మనదేశము యొక్క ప్రస్తుత పరిస్థితిని బట్టి, యట్టి పరిపూర్ణ స్వాతంత్ర్యము మనకు క్షేమకరమయినదియు గాదు. మన వారందరు నట్టి పరిపూర్ణ స్వాతంత్ర్యమును పొందుట కర్హులైయునుండలేదు". అని వీరేశలింగం నొక్కి వక్కాణించారు.

కందుకూరి రాజకీయాభిప్రాయాలు ఇలా వున్నాయి.

"రాజకీయాలను నేను ప్రతిఘటిస్తున్నట్లు మీరందరూ భావిస్తున్నారు. మత, సాంఘిక, రంగాలలో వలెనే రాజకీయరంగంలోను నేను స్వేచ్ఛను కాంక్షిస్తున్నాను. మన మతాన్ని, మన సాంఘిక పరిస్థితుల్ని సంస్కరించుకోనంతవరకు, రాజకీయ స్వాతంత్ర్య ఫలితాలను మనం అనుభవించలేము. సంఘ సేవకులుగానే మనం గొప్ప దేశసేవలను చేయవచ్చు", అని అన్నారు.

వీరేశలింగంకు దేశంమీద, దేశభక్తిమీద, స్వాతంత్ర్యంమీద, రాజకీయాలమీద, రాజకీయ స్వాతంత్ర్యం మీద, దృఢమైన దృక్పథాలు వున్నాయి. ఇతరుల మెప్పుకోసం అందరిలా, ఆయన తన సిద్ధాంతాలు మార్చుకొన్న వ్యక్తి కాదు. కందుకూరికే దేశభక్తి లేదని చెప్పటం కువిమర్శ క్రిందకు వస్తుంది. మాకే దేశభక్తి వుంది. ఇతరులకు ఎవ్వరికీ దేశభక్తి లేదు. వాళ్ళంతా దేశద్రోహులు అని మీరు అనుకుంటే, అది మీ అజ్ఞానానికి పరాకాష్ఠ. ఇతరులకు భజనలు, భజంత్రీలు

కొట్టే రకంకాదు వీరేశలింగం. ఎవరు ఎన్ని ఆటంకాలు కలుగు చేసిన తనలక్ష్యంకోసం, జీవితాన్ని త్యాగంచేసిన మహనీయుడు. అటువంటి గొప్ప వ్యక్తిని పట్టుకొని దేశభక్తుడుకాదు అనడం సమంజసంగా లేదు. ఒక్క మాటలో చెప్పాలంటే కందుకూరి దేశోద్ధారకుడు.

వీరేశలింగంకి దేశభక్తి దండిగావుంది. అంతేకాదు దేశభాషల్ని కూడా ప్రేమించిన భాషాభిమాని ఆయన.

"దేశ భాషలు వృద్ధి పొందినంగాని దేశము యొక్క స్థితి యున్నెటికిని బాగు పడనేరదు. రాజకీయ భాషయెంత యభివృద్ధి గాంచినను, అది యెన్నటికిని దేశభాష కాజాలదు" అని నొక్కి వక్కాణించారు.

ఆధునిక తెలుగు సాహిత్యంలో, సమాజం కోసం ఏ సాహిత్యవేత్త చేయనంత నిస్వార్థంగా, నిబద్ధతో, నిరంతరం కష్టపడితే, వీరేశలింగం మీద 'కులం'ముద్ర వేశారు కొందరు కువిమర్శకులు ఆయన రచనల్నీ ఎక్కువగా బ్రాహ్మణకులానికి సంబంధించిన ఇతివృత్తం తీసికొని రాశారని ఒక అభిప్రాయోగం. అందుకే కొంతమంది విమర్శకులు కందుకూరి బ్రాహ్మణకుల సంస్కర్త అవుతాడు కానీ, మొత్తం సమాజానికి సంబంధించిన సంఘసంస్కర్తకాడు, కాజాలడని ఒక బలమైన విమర్శవుంది.

ఇది విచారించదగ్గ విషయం. ఈ విమర్శలో పసలేదు. నిజాయితీ కూడా లేదు. ఈ విమర్శలో స్వార్థంకన్పిస్తుంది. కావాలని కొంతమంది చేసిన విమర్శ ఇది. దీన్ని తీవ్రాతితీవ్రంగా ఖండిస్తున్నా. ఆధునిక తెలుగు సాహిత్యంలో తన రచనద్వారా కుల నిర్మూలనకోసం పాటుపడిన మహనీయుడు, ఆదర్శమూర్తి, కందుకూరి. అటువంటి మహోన్నతవ్యక్తిని పట్టుకొని కావాలని "కులవాది" అని ముద్రవేయడం సమంజసంగా లేదు. మీ వాదనను సభ్య సమాజం కూడా ఒప్పుకోదు. మీ కులతత్వాన్ని, మీ మతతత్వాన్ని, మీ ప్రాంతీయ తత్వాన్ని, మీ వర్గ తత్వాన్ని, మీ సంకుచితతత్వాన్ని, మీ కలుషిత బుద్ధిని, కావాలని కందుకూరిపై రుద్ది, ఆపాదించండం, మంచిదికాదు. మీరు చేసే విమర్శవల్ల తెలుగు సాహిత్యానికీ, తెలుగు విమర్శకీ చాలా అపకారం చేసినవారు అవుతారు.

కందుకూరి, తన రచనల్లో ఎక్కువగా బ్రాహ్మణ కులంలోని ఆచారాల పేరుమీద, సనాతన సంప్రదాయాల పేరుమీద, మూఢనమ్మకాలమీద, దురాచారాలమీద, ఛాందస భావాలమీద, చీల్చి చండాడారు. తెలుగు సాహిత్యంలో బ్రాహ్మణ కులవ్యవస్థలోని కుళ్ళును గూర్చి వీరేశలింగం రాసినట్లు ఇంతవరకు తెలుగు రచయితలు ఎవ్వరూ రాయలేదు. ఆయన రచనలన్నీ ఎక్కువగా ఈ కోవలోనే నడిచాయి. ఉదాహరణకు బ్రాహ్మవివాహం (నాటకం) కన్యాశుల్కం (ప్రహసనం). ఈ విషయాలు మీకు తెలియదా? కావాలని విమర్శిస్తున్నారా? అసలు మీరు కందుకూరి సమగ్ర రచనల్ని అధ్యయనం చేశారా? ఏమిచదవకుండా మీరు విమర్శకులుగా సాహిత్యంలో ఎలా చలామణి అవుతున్నారు? ఇప్పటికైన మించిపోయినది ఏమీలేదు, వీరేశలింగం రచనల్ని వివేచన చేయండి. జ్ఞానోదయం పొందండి. మీ పద్ధతిని మార్చుకోండి. మంచి ఆలోచనతో ముందుకు వెళ్ళండి. ఉత్తమ విమర్శకులుగా రాణిస్తారు.

వీరేశలింగం రచనల్లో ముఖ్యంగా వితంతు పునర్వివాహం, బాల్య వివాహాల ఖండన, స్త్రీ విద్యావశ్యకత, స్త్రీజనోద్ధరణ, వేశ్యావృత్తి నిరసన, కుల నిర్మూలన, అవినీతి పట్ల వ్యతిరేకత, దురాచారాలపైన, మూఢవిశ్వాసాలపైన, ఛాందసభావాలపైన తిరగబడడం, సనాతన, సంప్రదాయాల కరుడుగట్టిన భావాలపైన పోరాడడం... ఇలా అనేక అంశాలు చాలా స్పష్టంగా కన్పిస్తాయి. పై విషయాలమీద కందుకూరి రాసిన రచనల్ని మీరు చదవలేదా? మీకు కనబడలేదా? పై అంశాలన్నీ ఒక్క బ్రాహ్మణ కులానికి సంబంధించిన వేనా? మీరు కనీస అవగాహన లేకుండా విమర్శలు చేస్తున్నారు. పోనీ మీరు అనుకున్నట్లే బ్రాహ్మణ కులానికి సంబంధించిన వస్తువు తీసుకొని రచనలు రాస్తే తప్పు ఏమిటి? బ్రాహ్మణులు ఈ సంఘంలోని మనుషులు కారా? వాళ్ళకు సమస్యలు వుండవా? వాళ్ళ సమస్యల్ని ఇతివృత్తం చేసుకొని రచనలు చేయకూడదా? వాళ్ళ గూర్చి రాయకూడదా? బ్రాహ్మణ కుల ఇతివృత్తంగా తీసుకుంటే కందుకూరి "కులవాది" అవుతాడా? అలా అనుకుంటే, మీ దృష్టిలో "గబ్బిలం" రచయిత గుర్రం జాషువా కూడా "కులవాది" రచయిత అవుతాడా? మీ వితండవాదాన్ని విడిచిపెట్టండి. మీ అజ్ఞానాన్ని బయటపెట్టకండి, నవ్వులపాలు అవుతారు.

ఆ కాలంలో సమాజం ఎన్నో సమస్యలతో కలుషితమై, ప్రజలు బాధపడుతూ వుంటే కందుకూరి అందరిలా చూసి వుండలేక కలాన్ని ఆయుధంగా ఉపయోగించి, సమాజంలోని

తప్పుల్ని తూర్పారపట్టారు. తన రచనలచే సమాజాన్ని జాగృతి చేసి, నూతన చైతన్యాన్ని కలిగించిన గొప్పసంఘసంస్కర్త వీరేశలింగం.

కందుకూరి సమాజంలోని ప్రధాన సమస్యల్ని ఇతివృత్తంగా తీసుకొని రచనలు చేశారు. అందరు రచయితలు అలాగే చేస్తారు. స్వార్థంతో కావాలని విమర్శలు చేయకండి. మీ దృష్టిలోనే ఏదో తెలియని లోపం వుంది. ముందు దాన్ని డాక్టర్ దగ్గరకు వెళ్ళి బాగుచేయించుకోయండి. నూటికి నూరుపాళ్ళు సమాజానికి సంబంధించి, ఆలోచించిన వ్యక్తి వీరేశలింగం. కందుకూరి అందరివాడు. అన్ని వర్గాల ప్రజలకు చెందినవాడు. ఒక్కమాటలో చెప్పాలంటే కందుకూరి ప్రజల మనిషి. ముందుగా మీరు ఆయన రచనల్ని అధ్యయనం చేయండి. మీ జీవితంలో ఎప్పుడైనా కందుకూరి రచనలన్నీ చదివారా? కనీసం జీవితంలో అన్ని రచనలు ఎప్పుడైనా చూశారా? మీరు చేసే విమర్శనుబట్టి చేస్తే, మీరు కందుకూరి అన్ని రచనలు చదవలేదు. అంతేకాదు అన్ని రచనలు చూడలేదు అనిపిస్తుంది. గాలి కబురులు చెప్పకండి. తెలుగుసాహిత్య విమర్శకు ద్రోహం చేయకండి. మీ విమర్శవల్ల మీ డొల్లతనం బయటపడుతుంది. సాహిత్య విలువల్ని కాపాడండి. కాపాడకపోయినా పరవాలేదు చెడగొట్టకండి. తెలియకపోతే బుద్ధిగా తెలియదని చెప్పండి. నాకే అంతా తెలుసు, ఎదుటి వారికి ఏమీ తెలియదు అని అనుకోవడం మీ అజ్ఞానానికి పరాకాష్ఠ అవుతుంది. ఎవరో ఏదో చెత్త ప్రోగు చేసి రాస్తే, దాన్ని మరో కోణంలో చెప్పాలనే తపనతో, చెడుగా అన్వయించి చెప్పడం నూటికి నూరుపాళ్ళు పొరపాటే. ఇలాంటి పనులు ఉత్తమ విమర్శకులు చేయరు. శ్రద్ధగా అధ్యయనం చేసి, విమర్శచేస్తే అందరికీ మంచిది.

సాహితీమూర్తి కందుకూరిని విమర్శించిన వాళ్ళకు నా సమాధానం ఒక్కటే. సామాజిక దృక్పథంతో కందుకూరి రచనల్ని అధ్యయనం చేయండి. అసలు ఇంతకీ మీకు సామాజిక దృక్పథం అంటే ఏమిటో తెలుసా? వీరేశలింగం ఏమిరాశాడో? ఎందుకు రాశాడో? ఎవరికోసం రాశాడో? ముందుగా అర్థం చేసుకోయండి. అప్పుడు విమర్శించండి. అంతవరకు మూసుకొని కూర్చోయండి ఒక మూల.

వీరేశలింగం భాషా శైలిపై కూడా విమర్శలు చోటుచేసుకున్నాయి. కందుకూరి అందరిలాగే కరుడు గట్టిన గ్రాంథికవాదే. కాలక్రమంలో వ్యవహారిక భాషలోకి వచ్చారు. సనాతన సంప్రదాయవాదే. ఆయన సాహితీ సృష్టి శతకాలతో ప్రారంభమై చివరకు వ్యాకరణాలతో ముగిసింది. కందుకూరి కావాలని మకార, రకార ప్రాసలతో రెండు శతకాలు రాశారు. తన పాండిత్యాన్ని తోటి విద్యార్థులకు చూపించాలనే కోరికతోనే ఈ శతకాలు రాశారు. మరోలక్ష్యం ఏమీలేదని కందుకూరే చెప్పుకున్నారు.

కందుకూరి ప్రారంభంలో తీవ్రమైన గ్రాంథికవాది. మొదట్లో సంప్రదాయ రచనా శైలిలోనే రచనలు చేశారు. కఠినమైన గ్రాంథిక భాషనే ఆయన వాడారు. అందుకే గురజాడ వారు "వీరేశలింగం శైలి కృతక గ్రాంథికశైలి" అంటూ "ప్రహసనాదులలో వాడిన భాషలో వ్యావహారిక శైలి మృగ్యమని" తీవ్రంగానే విమర్శించారు. కందుకూరి సాహిత్య రీతుల్లోనూ, భాషా విధానంలోనూ మార్పులు చోటు చేసుకున్నాయి. ఆయన కాలానుగుణంగా తన శైలిని మార్చుకున్నారు. క్రమంగా సరళగ్రాంథిక భాష వాడారు. గురజాడ, గిడుగులు నడుపుతున్న వ్యవహారిక భాషావాదంవైపు మొదట్లో మొగ్గు చూపలేదు. కాలానుగుణంగా, సమాజం మారుతుంది. సాహిత్యం మారుతుంది, భాష మారుతుందని లేటుగా అయినా కందుకూరి తెలుసుకున్నారు. కందుకూరిలో వచ్చిన ఈ పరిణామం హర్షించదగ్గది, ఆహ్వానించదగ్గది. తనలోని లోపాల్ని గుర్తించి కందుకూరి ఎప్పటికప్పుడు మార్చుకుంటూ ముందుకు నడిచారు. అసలు విషయం ఏమంటే, కందుకూరి ముందుగా తనను తాను సంస్కరించుకున్నాడు. ఆ తర్వాత సంఘాన్ని సంస్కరించిన మహానుభావుడు. అందుకే కందుకూరి ఆధునిక తెలుగు రచయితల అందరికన్నా గొప్పవాడు అయ్యాడు. నవయుగ వైతాళికుడుగా పేరుప్రఖ్యాతలు గడించారు.

1916లో కొవ్వూరులో దాని చుట్టు ప్రక్కల ఊరుల్లో గిడుగువారు వ్యవహారిక భాషగూర్చి ఎన్నో సభలు నిర్వహించి ఉపన్యాసాలు ఇచ్చారు. గిడుగు వ్యవహారిక భాషావాదాన్ని, దాని ప్రయోజనాన్ని, దాని లక్ష్యాన్ని కందుకూరి తెలుసుకున్నారు. తన అభిప్రాయాల్ని పూర్తిగా మార్చుకున్నారు. గ్రాంథిక భాషా వాదాన్ని విడిచిపెట్టి ప్రజల భాష అయిన వ్యావహారిక భాషా వాదానికి జై కొట్టారు. అంతేకాదు, "వ్యవహారికాంధ్ర భాషా ప్రవర్తన సమాజం"ను స్థాపించారు. దానికి అధ్యక్షులు కందుకూరివారే. కార్యదర్శులుగా జయంతి గంగన్న, గిడుగు రామమూర్తి గార్లు ఎన్నిక అయ్యారు. కాలానికి

తగినట్లు సులభంగా, సరళంగా అందరికీ అర్థమైనట్లు వ్యాకరణం రాయాలని కందుకూరి భావించారు.

"ఆయన భాషలో తెచ్చిన ఈ మార్పు భాషాతత్వ జ్ఞానం వల్ల వచ్చినది కాదు. ప్రజలకూ, సాహిత్యానికీ వుండవలసిన సాన్నిహిత్యాన్ని పురస్కరించుకొని వచ్చినది. ప్రజలకు సాన్నిహితంకావటం అభ్యుదయానికి మార్గమని ఇదే రుజువు చేస్తుంది" అని కొడవటిగంటి కుటుంబరావుగారు అన్నారు. భాషకూ సమాజానికీ విడదీయరాని దగ్గర సంబంధం వుంటుంది. వీరేశలింగం వల్ల అది మరో మారు రుజువు అయింది.

భాషాశైలి విషయంలో వీరేశలింగంలో పెనుమార్పులు చోటుచేసుకున్నాయి. "సంధి", "విగ్రహం", గ్రంథాల రచన తర్వాత భాషవల్ల ప్రయోజనం ఏమిటి? అని తనకు తానే ప్రశ్నించుకున్నారు కందుకూరి. దాని ఫలితంగా ఆయనలో మార్పు వచ్చింది. ఆ మార్పుకు అనుగుణంగానే వీరేశలింగం రచనలు చేశారు. ఆచరణలోకి అడుగుపెట్టారు. అందుకే కందుకూరి ఇలా అన్నారు. "గ్రంథములను సాధారణముగా సలక్షణమయిన సులభశైలిని రచింప వలెనయే నా అభిప్రాయమయినను, విషయానుగుణముగా తత్తదుచితరీతిని గ్రామ్య భాషయందు సహితము గ్రంథములను వ్రాయవచ్చుననికూడా నా అభిప్రాయము" అని నొక్కి వక్కాణించారు.

మనిషి మార్పును కోరుకున్నాడంటే అభ్యుదయాన్ని కోరుకున్నట్లే. అభ్యుదయ మంటే సమాజాభ్యుదయం అన్నమాట. ఈ విషయంలో అందరి రచయితల కంటే ముందు వున్నాడు కందుకూరి. శతకాలతో రచనలు ప్రారంభించిన వీరేశలింగం, వ్యాకరణ రచనవరకు నడిచారు. తన రచనా పరిణామంలో కందుకూరి చాలా మార్పుల్ని ఆహ్వానించారు. నిత్య చైతన్యశీలి వీరేశలింగం. ప్రతీ రచయిత వీరేశలింగంను ఆదర్శంగా తీసుకొని, ముందుకు నడవాలి. మహా మహోపాధ్యాయ వేదం వేంకటరాయశాస్త్రి గారిలా అడ్డంగా వాదించకూడదు. అంతా నాఇష్టం. అంతా నాకే తెలుసు. మీకు ఏమీ తెలియదు అని అనకూడదు. అలాంటే సంఘంలో వీలుపడదు. మనందరమూ సంఘంలో బ్రతకుతున్నాం. సంఘానికి అనుగుణంగానే వుండాలి. లేకపోతే ఒంటరిగా బ్రతకవలసి వస్తుంది. అది భరింపరాని శిక్ష. శిక్షలన్నీంటికన్నా పెద్ద శిక్ష అదే. అందుకే అందరమూ తప్పనిసరిగా సమాజంలో భాగమై వుంటున్నాం. ఏ ఒక్కవ్యక్తి విడిగా వుండడు. వుండలేదు కూడా. సమాజం నిరంతరం మారుతున్నప్పుడు సాహిత్యం కూడా మారుతుంది. సాహిత్యం మారుతున్నప్పుడు భాషలో కూడా అనేక మార్పులు చోటు చేసుకుంటాయి. ఇలా మారడం సమాజధర్మం. ఈ విషయాన్ని తెలుసుకున్న మహనీయుడు వీరేశలింగం. అందుకే తన జీవితకాలంలో అన్ని మార్పుల్ని ఆహ్వానించారు. ఈ బుద్ధి గ్రాంథిక భాషావాదులకు లేకపోవడం వారి అజ్ఞానానికి పరాకాష్ఠ.

*"నిబద్ధత, నిమగ్నత, నిబిడత అనే త్రిగుణాత్మకంగా సాగించే విమర్శనంలో, కందుకూరి సంస్కరణ సాహిత్యం విశిష్టంగా నిలుస్తుంది. కందుకూరిది స్త్రీ విమోచనోద్యమం. ఈ సంస్కరణ ఉద్యమంలో స్త్రీ - ప్రముఖాంగం. ఈ విషయంకోసం తన కాలం, ధనం, శక్తి. సాహిత్యం, వినియోగించాడు. అందుకోసం ఆరాటంతో పోరాడాడు. తన ఉద్యమం పట్ల పూర్తి నిబద్ధత ఉంది. కందుకూరి నిబద్ధ రచయిత. నిబద్ధ సంస్కర్త. స్త్రీ అభ్యుదయం కాంక్షించిన రచయిత, బాల్యవివాహాలు వద్దన్నాడు. స్త్రీ విధవా వివాహం కావాలన్నాడు. బాలికా పాఠశాలలు కోరాడు. స్త్రీ విద్య సంభావించాడు, సంఘుతిరస్కారం ఎదుర్కొన్నాడు. వెలివేసినా చలించలేదు. తానున్న సమాజం తనను తిరస్కరించినా వెనకడుగు వేయలేదు. స్త్రీ సమస్య, పురుష సమస్యగా గుర్తించాడు. తల్లి వైధవ్యం భరించలేని కందుకూరి, తల్లులు కాదగ్గ చాలామందికి వైధవ్యం నుంచి పునర్వివాహం ద్వారా విముక్తి కలిగించాడు. ఈ సమస్యల్లో తలమునకలయ్యాడు. కందుకూరి సాహిత్యం సృష్టించటంతోపాటు, సంఘంలో ఆ సమస్య చుట్టూ తలమునకలై సంచరించాడు. సమస్యలో మునిగిపోయాడు. సంఘంలో సమస్యలో జీవించి, సాహిత్యంలో తన సృష్టితో జీవించిన కందుకూరి, తన సంస్కరణ లక్ష్యంలో నిమగ్నుడయ్యాడు. కందుకూరి నిమగ్న రచయిత. సంస్కర్త, ఈ త్రిగుణాత్మక విమర్శనంలో కందుకూరి సంస్కరణ సాహిత్యం ద్విగుణాత్మకం".*

**- కొలకలూరి ఇనాక్**

◆

# నిన్ను నీవు గుర్తించడమే వెన్నెల ...

- డాక్టర్ కత్తి పద్మారావు
9849741695

సూర్యుడు తన కిరణాలతో
భూమి పొరల్లోకి వెళుతున్నాడు
సూర్యుడు తన్ను తాను విస్తరించుకొనే కొలది
మనిషికి ఓ జీవన సంక్షోభం
అవును! అతడు తన్ను తాను తెలిసికోలేక పోతున్నాడు
విధ్వంసకునిగా మారాడు, అతడికి రాత్రిళ్ళు నిద్రలేదు
ఉన్నది పోతుందని ఆరాటం, లేనిది కావాలనే ఆశ
అతడు, పుత్ర వ్యామోహితుడు
కొడుకుని చూసుకొని మురిసిపోతాడు
కొడుకుకి అవినీతి పాఠాలు చెబుతాడు
కొడుకుకి హిపోక్రసి నేర్పుతాడు
అతన్ని ప్రశ్నించిన వారి గొంతు నొక్కుతాడు
వేల లాటీలను రోజూ ఝళిపిస్తాడు
అతనీ జీవితం ప్రతినాయకునిగా ప్రారంభమైంది
అతనెప్పటికీ నాయకుడు కాలేక పోతున్నాడు
నిజమే! ఉదయకాలం అల్పాహారం లేక
ఆ పిల్లవాడు సొడబడుతున్నాడు
లక్షల ఎకరాల్లో పండిన పంట
టన్నులు టన్నులు ఏమౌతుందో తెలియదు?
నీతికి, అవినీతికి మధ్యగీత చెడిపి వేశారు
విద్య వ్యాపార కుహరంగా మారింది
పిల్లలను చెట్లు చేమల నుండి దూరంచేసి
కోళ్ళఫారాల్లో కోళ్ళలా పెంచుతున్నారు
పేరా రాయడం రాకుండ వేలు ఖర్చు పెడుతున్నారు
ఇప్పుడు చదువు ఒక హోదా! జ్ఞానం కాదు!
చదువు ఒక ఫ్యాషన్ షో
తన పని తాను చేసుకోవడం రాదు
తన శరీరం గూర్చి తనకు తెలియదు
ఎదుటి వాళ్ళకు ఎలా కనపడాలనే ఆరాటం
రోజూ వస్తువులు కొనే వ్యసనం
నిన్నటిది రోత, ఈ రోజు మీద మోజు
మోజుతోనే జీవితం 'గతం' అవుతుంది
సృజనం లేదు, వీక్షణం లేదు
పునర్వీక్షణ లేదు, అన్వేషణ లేదు
పాతవస్తువుల్లో నైపుణ్యాన్ని చూడకుండానే
కొత్త వస్తువు తన మీద దూకుతుంది
ప్రతి వస్తువుకి ఒక నిర్మాణం వుంటుంది సుమా!
వస్తువు నుండి అనుభూతి రాదు
ఒక హాస్టల్ పిల్లవాడికి ఒక చాక్లెట్ ఇచ్చిచూడు
వాడు తింటున్నపుడు ఒక అనుభూతి వస్తుంది



ఒక తల్లిలేని పిల్లకు జడవేసి చూడు
నీకు ఒక ఫీల్ వస్తుంది
ఒక గుడ్డివానికి చెయ్యి అందించి
నడిపించు ఒక స్ఫూర్తి వస్తుంది
నీవు చేసే సేవలో నీ కొచ్చే అనుభూతి వస్తువు నుండి రాదు
ప్రపంచం నీ ముందు మార్కెట్టును పరిచింది
నిన్ను నీవు చూసుకొనే అద్దాన్ని
అది నీకివ్వలేక పోయింది, నీ కోసం నీకు 'స్పేస్' లేదు
ఒక గాఢత లేదు, ఒక పునర్వీక్షణ లేదు, ఒక వివేవచన లేదు
నీలో ఎంతో భావసముచ్ఛయం వుంది సుమా!
దాన్ని తవ్వితీసి ప్రపంచానికి నీవే అందించు
నీవు కొన్ని మాటల మధ్య బ్రతుకుతున్నావు
మాటలు రోజూ మారుతున్నాయి
మార్కెట్ ప్రచారం చేస్తున్న మాటల్లో
పసలేదు, రుచిలేదు అందులో వంచన వుంది
ఆ మాటలు నిన్ను ఉత్తేజ పరుస్తున్నాయి
నీ శరీరాన్ని కదిలించడానికి కూడా
వాళ్ళు యంత్రాలే కనిపెట్టారు
నిన్ను సూర్యుణ్ణి చూడనివ్వడం లేదు
నిన్ను వెలుతరనే చీకటికిలోకి నెట్టారు
నీవు పబ్బులో రాతంత్రా వెలుతురులో ఎగిరావు
అందుకే పగలు నీవు చీకటిని కోరుకొంటున్నావు
శ్రమ జీవిని చూడు ఆమె పత్తి తీసింది, వరి నాటేసింది
మట్టి మోసింది రాత్రి నిదురించింది
ఆమె పగటి వెలుగును చూడగలుగుతుంది
అవును! ప్రకృతే ఓ సంపద నీకు నీవే ఒక భావజాలగనివి
ప్రకృతిని గుర్తించు, నిన్న నీవు కూడా గుర్తించు
అప్పుడు నీవు ఆకాశమంత ఎదుగుతావు
నీకు నీవు కొంత టైముంచుకో
నీవు నీ దగ్గరున్న వస్తువులన్నింటి కన్న ఉన్నతమైనదానివి
వస్తు వ్యామోహం వ్యసనపు ఊబి
నీ గుణాలకు రూపం ఇవ్వు, నీ ప్రతిభలకు వన్నెనివ్వు
ఆ చెట్టు రోజు పూలు పూస్తుంది, పరిమళాలు
వెదజల్లుతుంది
రెండు సూర్య కిరణాలు రెండు చుక్కల నీటితో
అది సజీవంగా వుంది ప్రపంచ విజేతలంతా
తమను తాము గుర్తించిన వారే
నీ విజయ గమనాన్ని నిర్దేశించు
నిన్ను నీవు గుర్తించడమే వెన్నెల ◆

# కుక్క కాటుకు 'చెక్కు' దెబ్బ

- యం.ప్రగతి
9440798008



దీర్ఘాలోచనలో మునిగిపోయి కారు హారన్ శబ్దం కూడా వినిపించుకోలేదు నరహరి. కారులోంచి దిగిన కూతురు హరిణి లాన్లో ఒంటరిగా కూచున్న తండ్రి దగ్గరికొచ్చి, "డాడీ..." అంటూ గట్టిగా అరవడంతో ఉలిక్కి పడ్డాడు. "ఏంటి అంత సీరియస్ గా ఆలోచిస్తున్నావు?" అంటూ నరహరిని కుదిపేసింది హరిణి. "ఏం లేదమ్మా, నువ్విప్పుడేనా రావడం? వెళ్లి స్నానం చేసిరా, ఫ్రెష్ అయ్యాక మాట్లాడుకుందాం."

"అసలు దేని గురించో ఒక్క ముక్కలో చెప్పు ముందు. తర్వాత కావాలంటే తీరిగ్గా మాట్లాడుకుందాం." చదువంతా ఫారిన్ లో వెలగబెట్టిన హరిణికి వివరాలు వినేంత ఓపిక లేదు.

"అదేరా, మన కాలేజీల పరిస్థితి...నానాటికీ దిగజారిపోతోంది"

అంతే కదా! నరే నేను స్నానం చేసొచ్చాక మాట్లాడుకుందాం." లోపలికెళ్ళింది హరిణి. కూతురి చురుకుదనానికి సంబరపడి పోయాడు నరహరి. అందుకే కదా అమెరికాలో ఎంబీయే చదివిన కూతుర్ని సమస్య పరిష్కారం కోసం ఇండియాకు పిలిపించాడు.

ఉభయ తెలుగు రాష్ట్రాల్లో ప్రఖ్యాతి నొంది, మారుమూల ప్రాంతాలకు సైతం విస్తరించిన కార్పోరేట్ విద్యాసంస్థల అధిపతి నరహరి. ఒక రకంగా చెప్పాలంటే ప్రభుత్వానికి సమాంతరంగా ఒక వ్యవస్థనే నడిపిన వ్యక్తి, ప్రభుత్వాన్ని కనుసైగలతో శాసించిన శక్తి. అన్ని ర్యాంకులూ తమవేనని, అంతటా తామేనని టీవీలలో, పేపర్లలో ఢంకా బజాయించి మరీ ప్రచారం చేసుకునే వ్యక్తి, తన ఒక్కగానొక్క కూతుర్ని మాత్రం చిన్నప్పట్నుంచీ విదేశాల్లో ఎందుకు చదివించాడో కూతురితో సహా ఎవరూ అడగరు. తానూ చెప్పడు. ఏకచ్ఛత్రాధిపత్యంగా విద్యారంగాన్ని ఏలి ప్రభుత్వ విద్యాసంస్థలను శిథిలావస్థలోకి నెట్టిన వ్యక్తికి ఇటీవల ఎదురుదెబ్బలు తగులుతున్నాయి. ఓవైపు తన కార్పోరేట్ సామ్రాజ్యంలో ఊపిరి పీల్చుకోవడం చేతకాని పిల్ల వెధవలు వరసబెట్టి జీవితాలు ముగించుకుంటూ తమను అభాసుపాలు చేస్తుంటే, మరోవైపు తాము చంపగా మిగిలిపోయి కొన ఊపిరితో ఉన్నాయనుకున్న ప్రభుత్వ స్కూళ్ళు, కాలేజీలు మళ్ళీ స్మార్టు క్లాసులూ, డిజిటల్ క్లాసు రూములూ అంటూ కొత్తగా ఊపిరి పోసుకుంటున్నాయి. దానికి తోడు గవర్నమెంటు టీచర్లు, లెక్చరర్లు పంతం పట్టి ఇంటింటికీ తిరిగి "మా అర్హతలు చూడండి, మా బళ్ళూ, కాలేజీల్లో వసతులు చూడండి." అంటూ పిల్లలను అయస్కాంతం లాగా ఆకర్షిస్తున్నారు. ఈ ప్రచారంతో కాస్త చదువుకున్న, విచక్షణ కలిగిన తల్లిదండ్రులు తమ పిల్లలను ప్రభుత్వ విద్యా సంస్థల్లోకి మళ్ళిస్తున్నారు. దీంతో మిగిలిన వారిలో కూడా కదలిక మొదలైంది. ఇప్పటికిప్పుడు తమ విద్యాసంస్థలు మూతపడే ప్రమాదం లేకున్నా, క్రమంగా విద్యార్థులు సంఖ్య తగ్గుతోంది. భవిష్యత్తులో ఏం జరుగుతుందో

ఎవరూ చెప్పలేరు. తన అనుభవానికి తోడు, కూతురి ఈ తరం ఆలోచనలు మరింత ఉపయోగపడతాయని పిలిపించాడు నరహరి.

"ఇప్పుడు చెప్పు డాడీ." స్నానం చేసొచ్చి, టిఫిన్ చేస్తూ అడిగింది హరిణి. "అదేనమ్మా మన కాలేజీల్లో విద్యార్థులు సంఖ్య క్రమంగా తగ్గిపోతోంది. ఓ వైపు ఒత్తిడి తట్టుకోలేక పిల్లలు ఆత్మహత్యలు చేసుకుంటున్నారని కార్పోరేట్ జైళ్లని, చదువుల కార్ఖానాలని మనస్తత్వ శాస్త్రవేత్తలు, విద్యావేత్తలు చానళ్లలో చావగొడుతున్నారు. మరోపక్క సర్కారు టీచర్లు మీ పిల్లల భవిష్యత్తు తప్ప మాకింకో ధ్యాస లేదని తల్లిదండ్రులను నమ్మిస్తున్నారు. టెక్నో అని, కాన్సెప్ట్ అని, ఒలింపియాడ్ అని కొత్త కొత్త పేర్లు పెట్టి, ఊరిస్తే, మొదట్లో మన మాటలు బాగానే నమ్మారు. ఇప్పుడేమో పిల్లలు ఒత్తిడికి గురై ఆత్మహత్యలు చేసుకుంటున్నారని, డిప్రెషన్ లో పడిపోతున్నారని రివర్స్ తిరిగి, ఆటలు కావాలి, ప్లే గ్రౌండ్ కావాలి అంటూ గోల పెడుతున్నారు. అదీకాక ఇప్పుడు గవర్నమెంటు స్కూళ్ళు, కాలేజీలు కార్పోరేట్ సంస్థలను తలదన్నేట్టు తయారవుతున్నాయి. కొత్తగా ఏంచేస్తే మన 'వ్యాపారం' సాఫీగా సాగుతుందా అని." ఆపాడు నరహరి.

"జనాలకు కొత్తగా, భిన్నంగా ఉండాలని తెగ ఉబలాటం డాడీ. మనం ప్రారంభించిన తొలి రోజుల్లో మిగిలిన వాళ్ళకు తమకు అంతరం ఉండాలని, స్టేటస్ కోసం మన సంస్థల్లో చేర్చారు. ఇప్పుడు ఆ ఉబలాటాన్ని కంటిన్యూ చేయాలంటే మనం టెన్త్, ఇంటర్ ఫలితాలను, ఎంసెట్ ర్యాంకులనూ నమ్ముకోకూడదు. కాస్త కొత్తగా ఆలోచించాలి." హరిణి చెప్పుకుంటూ పోతోంది. "అందుకే కదా, ఐ.ఐ.టి., జే.ఇ.ఇ. ఇంకా ఏవుంటే అన్నిటికీ కోచింగిస్తున్నాం. కాన్సెప్టు, టెక్నో, ఇంటిగ్రేటెడ్, ఇంటెన్సివ్ ఇలా విభజించి, పాలించాం." "నిజమే డాడీ. ఇప్పుడది కూడా పాతబడిపోయింది. ఇంటికి నలుగురు ఇంజనీర్లయి, వాళ్ళకు ఉద్యోగాలు రాకపోయె, డాక్టర్ కోర్సు సీటు అంత తేలిగ్గా రాదు, వచ్చినా ఖర్చు, పైగా పీజీ అన్నీ కలిపి పదేళ్ళ పైనవుతుందని ఎవరూ ధైర్యం చేయడం లేదు. అందుకే ఇంకా కొత్తగా ఆలోచించాలి." అంటూ కాస్త ఆగి అందుకుంది. "ఇప్పుడు మధ్యతరగతి పేరెంట్స్ దృష్టి సివిల్స్ వైపు ఎక్కువ ఉంటోంది. ఆ వైపు నుంచి ఆలోచిద్దాం. మనం చంపి పాతరేసిన హిస్టరీ, సివిక్స్ సబ్జెక్టులను మళ్ళీ తెచ్చిపెడదాం. అప్పట్లో ఇంటర్లో, ఎంసెట్లో టాప్ ర్యాంకులు వచ్చిన వాళ్ళను కొనేశాం కదా, ఇప్పుడు అలాగే ఎవరన్నా సివిల్స్ టాపర్స్ పడతారేమో చూడు. ప్రచారం చేసుకుందాం. అన్నట్లు ఈసారి యుపిఎస్సీ టాపర్ అతనెవరో తెలుగు వాడనుకుంటా కదా!" నరహరికి ధైర్యం వచ్చేసింది. "అవును అతని పేరు సుధాంశు. కానీ అతను ఇంటర్ ఏదో గవర్నమెంటు కాలేజీలో చదివానని చెప్పిన గుర్తు." "జనాలకు అంత జ్ఞాపకశక్తి ఉండదులే డాడీ. ముందు అతన్ని కాంటాక్ట్ చేయమని చెప్పు." "అదికాదమ్మా ఆ స్థాయిలో ఉన్నవారు అమ్ముడుపోతారా అని." ఇంకా సందేహం నరహరికి. "డబ్బుంటే ఎవరికి చేదు డాడీ. 5 కోట్లు కాదంటే 10 కోట్లు బేరం పెట్టండి. ఎందుకు లొంగడో చూద్దాం."

♦♦♦

"గుడ్ న్యూస్ హరిణీ. ఆ సుధాంశు మన ఆఫర్ కు ఒప్పుకున్నాడు. మొదట అంత తేలిగ్గా లొంగలేదు. 10 కోట్లు అనే సరికి కళ్ళు బైర్లు కమ్మినట్టున్నాయి. ఒప్పేసుకున్నాడని ఎ.ఓ. చెప్పాడు." "ఒప్పుకోక చస్తాడా? ఎంత ఐయ్యేఎస్ అయినా సంపాదించుకోవడానికి ఇంకా టైం పడుతుంది కదా!" హరిణి ప్రతి మాటలో అహంకారం. "అయితే అతను రెండు కండిషన్స్ పెట్టడమ్మా. చెక్ ముందే ఇవ్వాలట. రెండోది విజయవాడలో మన కాలేజీలో పిల్లలతో మాట్లాడే అవకాశం ఇప్పించాలట. పిల్లలను ఇన్స్పైర్ చేస్తూ మాట్లాడతాడట." నరహరి విషయం చెప్పాడు. "పబ్లిసిటీ పిచ్చి బాగానే ఉన్నట్టుంది గురుడికి. మంచిదేలే మనం కూడా వ్యక్తిత్వ వికాసం, కెరీర్ డెవలప్మెంట్ క్లాసులు పెడుతున్నామని ఫోజు కొట్టొచ్చు." హరిణి ఆనందపడింది.

♦♦♦

మల్లికార్జునకు ఆరోజు రాత్రి నిద్రపట్టలేదు. సివిల్స్ టాపర్ గా నిలిచిన తన కొడుకు సుధాంశు తనకు సంతోషాన్ని కలిగించిన కొన్ని రోజులు గడవకనే ఓ కార్పోరేట్ సంస్థకు అమ్ముడుపోవడం నచ్చలేదు. ఏడేళ్ళ క్రిందటి సంఘటనలు అంతటి చీకటి సంద్రంలోనూ అలల్లా అతని ముందు కదిలాయి.

♦♦♦

టెంత్ అయ్యాక సుధాను ఇంటర్లో ఎక్కడ చేర్చాలా అన్న ప్రశ్న ఎదురయింది. ఇక్కడే చేరుద్దామంటే బంధుమిత్రులంతా "అంత మంచి మార్కులు తెచ్చుకున్న వాడి భవిష్యత్తు చెడగొడతావా? విజయవాడలో మంచి కాలేజీలో చేర్చు,

ఖచ్చితంగా ఐ.ఐ.టి. కొడతాడు." అంటూ రెచ్చగొట్టారు. సుధా కూడా తన స్నేహితులంతా అక్కడే చేరుతున్నారని, తాను కూడా అక్కడే చేరతానని పట్టుబట్టటంతో, గత్యంతరం లేక విజయవాడ నవహరి కాలేజీలో చేర్చాడు. తిండి గురించి, వసతి గురించి చిన్నా చితకా ఫిర్యాదులున్నా మెల్లగా అడ్జస్టయి పోయాడు. మార్కులు కూడా బాగానే తెచ్చుకుంటున్నాడు. అయితే అప్పుడప్పుడు ఒత్తిడికి లోనవుతున్నాడు. అంతకుముందు తను ఆటలాడేవాడు, ఇతరత్రా పుస్తకాలు చదివేవాడు. ఇప్పుడవేవీ లేకపోవడంతో ఉక్కిరిబిక్కిరవుతున్నాడు. తల్లీ, తండ్రీ ఫోన్ల లోనే ధైర్యం చెబుతూ ప్రోత్సహిస్తున్నారు. చాలా మంది పిల్లలు వత్తిడి తట్టుకోలేక ఇళ్ళకెళ్ళి పోయారు. కొందరు తెలివిగల పిల్లలు కూడా చదువులో వెనుకబడ్డారు. కొందరు తల్లిదండ్రుల బలవంతం మీద విధిలేక అక్కడే ఉండిపోయారు. అలా ఉన్న వారిలో సుదా రూమ్మేట్ వరుణ్ కూడా ఒకడు. కాలేజీలో చేరిన కొద్ది రోజులకే ఇద్దరూ మంచి స్నేహితులయ్యారు. ఒకే బ్యాచ్ లో చేరినప్పటికీ ఒత్తిడిని తట్టుకోలేక వరుణ్ చదువులో వెనుకబడ్డాడు. దాంతో అతన్ని దిగువ బ్యాచ్ లోకి మార్చేశారు. ఫలితంగా అతను మరింత కుంగిపోయాడు. సుధాతో కూడా సరిగ్గా మాట్లాడలేక మూడీగా ఉండిపోయేవాడు. "ఇంటికి తీసుకెళ్ళ"మని తల్లిదండ్రులతో మొరపెట్టుకున్నా ఉపయోగం లేకపోయింది. ఒకరోజు సుధా తన క్లాసు ముగించుకుని వచ్చేసరికి, హాస్టల్ గదిలో వరుణ్ ఉరేసుకున్న దృశ్యం కంటబడింది. సుధా ఒక్కసారిగా గట్టిగా అరచి, స్పృహ తప్పిపడిపోయాడు. కాలేజీలో గందరగోళాల మధ్య తల్లిదండ్రులు తమ పిల్లలను ఇళ్ళకు తీసుకెళ్ళారు. విద్యార్థి సంఘాలు, ఇతరులు ఎంత గొడవ చేసినా ఏ ఒక్కరూ శిక్షింపబడలేదు. కొద్దిరోజులకే కాలేజీకి రమ్మని సుధాకు పిలుపొచ్చింది. సుధా వణికిపోతున్నాడు కాలేజీకి వెళ్ళడానికి. చివరికి రూమ్ మార్పించి, హాస్టల్లో వదిలిపెట్టి వచ్చాడు మల్లికార్జున. కానీ సుధా ఆ సంఘటనను అంత తేలిగ్గా మర్చిపోలేకపోయాడు. ఎంతసేపూ ఆ రూమ్ వైపే చూస్తూ నిలబడేవాడు. చదువులో వెనుకబడ్డాడు. అంతకుముందు ర్యాంకు తెస్తాడనుకున్న సుధా అసలు పాసవుతాడో లేదోనని లెక్చరర్లకు అనుమానం వచ్చేది. పరీక్షలు రెండు నెలలున్నాయనగా వచ్చి కొడుకును చూసిన మల్లికార్జున కన్నీరయిపోయాడు. టైఫాయిడ్ వచ్చినా, భయంతో బిగదీసుకుపోయినా తనకు తెలియబరచని మేనేజ్మెంట్ మీద పిచ్చికోపం వచ్చి రగిలిపోయాడు. "మీరసలు మనుషులేనా?" అంటూ ప్రిన్సిపాల్ మీద, వార్డెన్ మీద చెలరేగిపోయాడు. వాళు ్ళ బలంతో, బలగంతో రెచ్చిపోయారు. "అయినా ఇంత చేతకాని దద్దమ్మ, పిరికి వెధవ మాకొద్దు, తీసుకెళ్ళండి." అంటూ టీసీ ఇచ్చి పంపించారు. వాళ్ళతో పోరాటం చేయాలని ఉన్నా, తన కొడుకు భవిష్యత్తు ముఖ్యమని, దగ్గర్లోని ప్రభుత్వ జూనియర్ కాలేజీలో చేర్చి, కంటికి రెప్పలా కాపాడుకున్నారు. అధ్యాపకులు, తల్లిదండ్రులు నైతికంగా అండగా నిలబడటంతో ర్యాంకు రాకపోయినా మంచి మార్కులతో పాసయ్యాడు సుధా. ఆపైన అధ్యాపకుల ప్రోత్సాహంతో డిగ్రీ నుంచే సివిల్స్ గురిపెట్టి సాధించాడు.

♦♦♦

"ఇదంతా మరచిపోయడా సుధా? ఎలా వాళ్ళ ఆఫర్ను ఒప్పుకున్నాడు?" మళ్ళీమళ్ళీ ఇదే ప్రశ్న వేధిస్తోందతన్ని. సుధాంశు విజయవాడ రమ్మంటే "నేను రాను" అని ఖచ్చితంగా చెప్పాడు. సుధాంశు కూడా బలవంతం చేయలేదు.

♦♦♦

రైల్వే స్టేషనుకు కారు పంపారు సుధాంశు కోసం. వచ్చేదారి లోనే తనున్న హాస్టల్. "ఒక్క నిముషం ఇక్కడాగుదాం." అంటూ హాస్టల్ లోకెళ్ళి కింది నుంచే తను, వరుణ్ ఉన్న గది వైపు చూశాడు. "ఎవరూ లేర్సార్, అందరూ ఫంక్షన్ కు వెళ్లారు." వాచ్ మాన్ అంటున్నాడు. "పర్లేదులే" చెమ్మగిల్లిన కళ్ళు కళ్ళద్దాల చాటున దాచేసి, కారులో కూర్చున్నాడు.

కాలేజీలో తనకోసం ఘనమైన ఏర్పాట్లు చూసి, నవ్వుకున్నాడు సుధాంశు. అతనితో పాటు కారు దిగిన వ్యక్తిని ప్రశ్నార్థకంగా చూశారు హరిణి, ప్రిన్సిపాల్, ఇతర సిబ్బంది. "ఈయన మా మేనమామ రఘురాం." పరిచయం చేశాడు వాళ్ళకు. లైవ్ ఇవ్వమని చానల్స్ వాళ్ళను పిలుచుకొచ్చారు. పరిచయాలయ్యాక సభ మొదలయింది. ప్రిన్సిపాల్ సుధాంశు తమ పూర్వ విద్యార్థని గొప్పగా పరిచయం చేశాడు. కాబోయే ఎం.డి. హరిణి మాట్లాడుతూ హిస్టరీ తో సహా కొత్త కాంబినేషన్లు ప్రారంభిస్తామని, సివిల్స్ కు కోచింగ్ ఇస్తామని చెబుతోంది. తదుపరి మైక్ తీసుకున్న సుధాంశు పిల్లల్నుద్దేశించి మాట్లాడటం మొదలుపెట్టాడు. "మిమ్మల్ని చూస్తుంటే ఏడేళ్ళ క్రితం నన్ను నేను చూసుకుంటున్నట్టుంది. ఆ మూల క్లాసులో

## కవిత

# అందరూ వెళ్ళిపోతారు కాని...



- డా॥ రావి రంగారావు
9247581825

అందరూ వెళ్ళిపోతారు, కాకపోతే
రకరకాలవాళ్ళు రకరకాలుగా వెళ్ళిపోతారు...

వర్షం కురిసి వెలిసి ఆరిపోయాక
రహదారులమీదికి వెళ్ళే గండు చీమల్లా కొందరు
వెళ్ళిపోతారు...
పంచదార వాసన పట్టి తిష్ఠ వేసుక్కూర్చుని మెక్కుతుంటే
గమనించినవాళ్ళు డబ్బాను దులపటం మొదలుపెడితే
పరుగు లంకించుకున్న ఎఱ్ఱ చీమల్లా కొందరు
వెళ్ళిపోతారు...
స్నానాల గదుల్లో ఏ రుచులకోసం దూరిపోతాయో కాని
వేడి నీళ్ళు నిప్పుల్లా నెత్తిన పడుతుంటే
మాడిపోతూ చెల్లాచెదురుతున్న నల్ల చీమల్లా కొందరు
వెళ్ళిపోతారు...

శోభనం గదిలో భర్త సన్నిధిలోకి పాల గ్లాసుతో
తహతహతో వెళ్ళిపోతున్న నవ వధువులా కొందరు
వెళ్ళిపోతారు...

శత్రు సైనికులతో పోరాడడానికి నిరంతర ఆయుధధారులై
దేశం సరిహద్దుల్లోకి వెళ్తున్న సైనికుడిలా కొందరు
వెళ్ళిపోతారు...

కొందరు పనులు చేస్తూ
ఇక పని లేదని తెలిసి వెళ్ళిపోతారు...
కొందరు తగినంత పని లేకపోతే సృష్టించుకొని
పనులన్నీ అయ్యాకే నిదానంగా వెళ్ళిపోతారు...
కొందరు పని చేయమంటే చాలు
తిరస్కారంతో అలిగి వెళ్ళిపోతారు...

కొందరు పువ్వుల్లా కాసేపుండి వెళ్ళిపోతారు
కొందరు రవ్వల్లా వెంటనే వెళ్ళిపోతారు...
కొందరు చంద్రుడిలా ఎప్పుడు పడితే అప్పుడు
వెళ్ళిపోతారు...
సాయంత్రం సూర్యుడిలా వెళ్ళిపోయినా కొందరు మాత్రం
లోకం గుండెల్లో శాశ్వతంగా నిలిచిపోతారు... ◆

---

నేను చదివిన రోజులు గుర్తొస్తున్నాయి. ఇప్పుడే హాస్టల్ కెళ్ళి వస్తున్నాను. నేనున్న 310 రూమ్ కేసి చూశాను. కానీ రూమ్ లో కెళ్ళే ధైర్యం చేయలేక పోయాను." ఒక్క క్షణం ఆగాడు. ప్రిన్సిపాల్, హరిణి ముఖాలు చూసుకున్నారు. సుధాంశు కొనసాగిస్తున్నాడు. "...ఎందుకంటే ఆ గదిలో కెళ్తే నా ఫ్రెండ్ వరుణ్ గుర్తొస్తాడు. వరుణ్ శరీరం ఫ్యానుకు వేలాడిన దృశ్యం కనిపిస్తుంది." మెల్లగా కూడబలుక్కుంటూ చెబుతున్నాడు. ప్రిన్సిపాల్ కు, సిబ్బందికి మొత్తం విషయం అర్థమయిపోయింది. కానీ కంట్రోల్ చేయడం ఎలాగో తెలియలేదు. "వరుణ్ చావు తో నేను బాగా కుంగిపోయాను. చదువులో వెనుకబడ్డాను. నా పరిస్థితిని ఇక్కడెవరూ అర్థం చేసుకోకపోగా, హేళన చేశారు. మానాన్న నన్ను తీసుకెళ్ళకపోతే బహుశా నా పరిస్థితి కూడా వరుణ్ లాగా అయిపోయేదేమో! ఆ సమయంలో మా అమ్మానాన్న నన్ను గుండెల్లో పెట్టుకొని కాపాడారు. ప్రభుత్వ కళాశాలలో లెక్చరర్లు నాకెంతో ధైర్యం చెప్పారు. ఇక్కడున్న రఘురాం గారు మా మేనమామ కాదు. అప్పట్లో అక్కడ తెలుగు లెక్చరర్. సాహిత్యంతో నాకెంతో స్వాంతన కలిగేలా చేశారు. ఇప్పుడు అదే కాలేజీలో ప్రిన్సిపాల్ గా పనిచేస్తున్నారు. ఇప్పుడు చెప్పండి 'చేతగాని దద్దమ్మ' అని నన్ను బయటికి తోసేసిన ఈ కాలేజీ గొప్పదా లేక నన్ను ప్రేమగా కౌగలించుకుని మీకందరికీ సందేశం ఇచ్చే స్థాయికి ఎదిగేలా చేసిన ప్రభుత్వ కాలేజీ గొప్పదా? నాకొచ్చిన ఫస్టు ర్యాంకును వాడుకొని మసకబారుతున్న తమ కాలేజీల ప్రాభవాన్ని నిలబెట్టుకోవాలని 10 కోట్లకు నన్ను కొనుక్కోవాలనుకున్నారు. ఎన్నో ప్రభుత్వ కాలేజీల సమాధుల మీద ఈ కాలేజీలు వెలిశాయి. అందుకే ఈ 10 కోట్ల చెక్కు నేను ఈ స్థాయికి ఎదగడానికి కారణమైన మా ప్రభుత్వ కళాశాల అభివృద్ధికి ఇచ్చేస్తున్నా." చెక్ రఘురాం చేతికి ఇచ్చాడు సుధాంశు. "డాడీ... చెక్ క్యాన్సిల్ చేసేసెయ్!" మొబైల్ లో హరిణి మాటలు సుధాంశు విన్నాడు. "మీకా ఛాన్స్ లేదు మేడమ్. చెక్ ఎప్పుడో నా అకౌంట్లో పడిపోయింది. ఇది నా చెక్. చూశారా, ఎలా 'చెక్' పెట్టానో?" విద్యార్థుల చప్పట్లు, జేజేల మధ్య రఘురాంతో సహా బయటకు నడిచాడు సుధాంశు ◆







# కూలిపోయిన స్వప్నాల ఛాయల కోసం

- కేశవ్
9831314213

కొత్త చోటలో గాలి గుండెలోకి ఒంపుకొని, కొత్త కొత్తగా కనుడే ముఖాల్నితడిమి రావాలనీ, అనుభవాల్ని జేబులో వేసుకు రావాలనీ అంటూ 'కాళ్ళను తీగెలుగా సాగదీసేసి' ఒకప్పటి సోషలిస్టు వైభవాన్ని సంతరించుకున్న ఉజ్బెకిస్తాన్ పర్యటనను తనివితీరా అనుభవించి, 'వారి చిరునవ్వుల్లో తొణికిసలాడే పురాస్పర్శని ఒడిసిపట్టి దోసిలిలో ఓలలాడించి మురిసిపోతూ' మనకో అందమైన, అద్భుతమైన కమ్యూనిస్టు పూర్వ వైభవాన్ని తనివితీరా అందుకోగలిగే ట్రావేలాగ్ ని అందించారు అరణ్య కృష్ణ గారు. ప్రకృతి పిలుపుకి స్పందించి సాగర యానం చెయ్యకుండా ఉండలేని ఒక జెరాల్డ్ గౌల్డ్ (Gerald Gould) లా అరణ్య కృష్ణ ప్రకృతి ఒడిలోకి అక్షరాల కుంచె పట్టుకొని వెళ్ళిపోతాడు. ఎప్పుదూ చూడని భూమినీ, ఇళ్ళనీ ఆప్యాయంగా హత్తుకొని వస్తాడు. అనుభవాన్ని అక్షరాల్లోకి కుదించేస్తాడు. అదే ఆయన ప్రత్యేకత.

'కూలిపోయిన స్వప్నాలకో పరామర్శ 'ఉజ్బెకిస్తాన్ పర్యటన - పరిశీలన' అనే 52 పేజీల ఈ ట్రావేలాగ్ ను అందమైన అనుభవాలతో, అందమైన కాగితాల్లో డ్రీమ్స్ ఫౌండేషన్ ప్రచురించడం హర్షించదగ్గ విషయం. ఎర్ర కోటల స్వప్నాలను ఓసారి తనివితీరా చూడాలన్న కమ్యూనిస్టు స్వాప్నికులకు ఇదో ఆశాదీపిక. స్వప్నాలు నిజం కావాలి. కలకాలం నిజమై నిలవాలి. కానీ, కూలిపోయే స్వప్నాలు స్పందించే అరణ్య కృష్ణ లకు, ఆశగా ఎదురుచూసే కమ్యూనిస్టు భావజాల ప్రేమికులకు, స్వాప్నికులకు ఎంతో ఆవేదనని, విషాదాన్ని మిగులుస్తాయి. అరణ్య కృష్ణ తన ఉజ్బెకిస్తాన్ పర్యటన ట్రావేలాగ్ ని చదివితే, ఇలాంటి ఆవేదనే ఆరంభం నుండి అంతం వరకు కలిగిస్తుంది. ఒక ట్రావేలగ్ ని ఒక చరిత్రకారుడు రాస్తే, చారిత్రక అంశాలు కనిపిస్తాయి. అదే, ఒక కవి, స్వాప్నికుడు, సోషలిజం ప్రేమికుని చేతిలో ఈ ట్రావేలగ్ పడితే అందులో సున్నితమైన కవి హృదయం కనిపిస్తుంది. సోషలిజం ఆనవాళ్ళను, సువాసనలను రచయిత తాష్కెంట్, సమర్ఖండ్ నగరాల ప్రజల్లో వెదుకుతాడు. వారి సామాజిక జీవితాల్లో ఆతృతతో అన్వేషిస్తాడు. ఏ మాత్రమైనా కమ్యూనిస్టు ఛాయలు కనిపిస్తే, సంబరపడతాడు. కనిపించకుండా బిక్షాటనలో వేళ్ళునుకోబోతున్న పెట్టుబడిదారీ వ్యవస్థ దర్శనమిస్తే బాధపడతాడు. ఆ బాధను మనతో పంచుకుంటాడు.

దేహాల్నీ, భూమినీ/ తనివితీరా తడుముతూ, కౌగిలించి ముద్దాడి,/తడి ఆరకముందే, కనుమరుగైపోయిన/మరువలేని ఆ వసంతం ఎప్పటికో? ఇంకెన్నడో? అని వాపోతాడు రచయిత. సోవియట్ సోషలిస్టు పతనం సోవియట్లో భాగమైన మిగతా రిపబ్లికన్స్ మీద కూడా పడింది. సోవియట్లో తాష్కెంట్ రాజధాని గా గల మధ్య ఆసియా దేశమైన ఉజ్బెకిస్తాన్ కూడా ఒకటి. యూరప్, ఆసియా ఖండాల మిశ్రమ లక్షణాలు కలిగిన దేశం ఉజ్బెకిస్తాన్. 1991 లో స్వాతంత్ర్యం ప్రకటించుకోక ముందు సోవియట్లో భాగం. మునుపటి పరిస్థితికీ, నేటి



## కవి డా॥ ఈదూరి సుధాకర్ కన్నుమూత

సాహితీస్రవంతి నెల్లూరు జిల్లా శాఖ అధ్యక్షులు, కవి డా॥ ఈదూరి సుధాకర్ ఏప్రిల్ 28న హఠాన్మరణం చెందారు. అటు వైద్యరంగంలోనూ, ఇటు సాహిత్యరంగంలోనూ సామాన్యుల శ్రేయస్సుకోసం కృషిచేసిన ఈదూరు సుధాకర్ ఆకస్మిక మరణం అత్యంత విషాదకరం. నెల్లూరు జిల్లాలోని అల్లూరు మండలం సింగపేట డా॥ సుధాకర్ స్వగ్రామం. ప్రాథమిక విద్యాభ్యాసం సింగపేటలో, ఉన్నత విద్య అల్లూరులోని రామకృష్ణ జిల్లా పరిషత్ స్కూల్, అనంతరం వైద్య విద్యను కర్నూలు మెడికల్ కళాశాలలో పూర్తిచేశారు. నెల్లూరులోని డా॥ రామచంద్రారెడ్డి ప్రజావైద్యశాలలో శిక్షణ పొందారు. అనంతరం ప్రభుత్వ వైద్యులుగా సర్వీసులో చేరారు. డిప్యూటీ మెడికల్ హెల్త్ ఆఫీసరుగా పదవీ విరమణ చేశారు. వృత్తిరీత్యా వైద్యులుగా ఉన్నా సాహిత్యం పట్ల మక్కువతో కవిత్వం రాసేవారు. నెల్లూరులోని పలు సాహిత్య సాంస్కృతిక సంస్థలతో అనుబంధం కొనసాగించారు. సాహితీస్రవంతి నెల్లూరు జిల్లా శాఖను ప్రారంభించి తొలి అధ్యక్షుడిగా ఉన్నారు. ఇటీవలనే ఆయన శ్వేతగులాబీలు పేరుతో కవితా సంకలనం విడుదల చేశారు. డా॥ ఈదూరి సుధాకర్‌కి జోహార్లు. ◆

పరిస్థితికీ మధ్య పోలికల్నీ, అంతరాన్నీ ఈ ట్రావేలగ్ వివరిస్తుంది. సాధారణ పెట్టుబడిదారీ బూర్జువా దేశాలు కూడా మే 1 న కార్మిక దినోత్సవాన్ని జరుపుకోవడం కార్మికుల హక్కుల గురించి ఉపన్యాసాలు ఇచ్చుకోవడం సర్వ సాధారణం. సోషలిస్టు గాలుల్ని పీల్చుకుంటూ, హిట్లర్ ఫాసిజానికి ఎదురొడ్డి నిలుచున్న సోవియట్ రెడ్ సైన్యంలో భాగమైన ఉజ్బెకిస్తాన్ అదే దినం ఫౌంటెన్ దినం గా జరుపుకోవడం , కొత్త తరానికి పాత విలువలు అందించక పోవడం శోచనీయం. రచయిత ముఖ్యంగా తాష్కెంట్, నమర్ ఖండ్ ప్రాంతాల ప్రకృతిసౌందర్యాన్ని ,జీవన విధానాన్ని,రోడ్ల నిర్వహణలోక్రమ శిక్షణని , ప్రజల ఆచారాలని, అలవాట్లని చాలా చక్కగా అందించారు. ఇందులో ఏ మాత్రమైనా గత కమ్యునిస్టు వైభవం ఉంటే దాన్ని స్పృశించడంలో రచయిత వెనుకాడ లేదు. సంపద ప్రదర్శన ఎక్కడా ఏ కోశానా లేని ఉజ్బెకిస్తాన్ రచయితని అబ్బుర పరచింది. రోడ్ల మీద అత్యంత క్రమ శిక్షణ, ప్రజల రక్షణ కోసం టూ వీలర్స్ ని నిషేదించిన ప్రభుత్వం అత్యంత చవగ్గా కారు ప్రయాణాలు, ఎక్కడా పిచ్చి హోర్డింగులు లేని నగరం, ఎలాంటి హడావిడి, హంగామా లేని జీవన విధానం ప్లస్ పాయింట్లు కాగా, ఆర్థిక జీవితంలో సమానత్వాన్ని చవిచూసిన ఉజ్బెకిస్తాన్ లో అరణ్య కృష్ణ రాస్తున్నట్టు స్త్రీలు, పిల్లలు ఇప్పటికీ బిక్షాటనలో మునగడం, కరెన్సీ మారకంలో మోసాలు అలవర్చుకోవడం, ముంచుకొస్తున్న ద్రవ్యోల్బణం అత్యంత విషాదకర పరిణామాలు. అరణ్య కృష్ణ అందించిన ఈ ట్రావేలగ్ ఒక ట్రావేలగ్ మత్రమే కాదు. కమ్యునిస్టు భావజాలాన్ని నమ్ముకున్న ప్రతి ఒక్కరికీ మరువలేని వసంతం. స్వప్నాలు కూలిపోవడం బాధాకరమైనప్పటికీ ఇది తాత్కాలికం.

స్వప్నాలను కూల్చెయ్యడం పెట్టుబడిదారులకు ఒక వింతయిన వినోదం. ప్రపంచంలో ఎక్కడైనా సరే సామ్యవాద స్వప్నాలను కూల్చేసి ప్రత్యామ్నాయం మిగల్చకుండా దోపిడీ ప్రభుత్వాలను ప్రజాస్వామ్యం, ప్రపంచీకరణ ముద్దు పేర్లతో కొనసాగించడం, అసమ సమాజాన్ని చెక్కుచెదరకుండా కొనసాగనివ్వడం, సోషలిజం వసంతాన్ని వెనక్కి తోసేసి ప్రజల జీవితాల్లోకి కాలవైశాకుల్ని ఆహ్వానించడం సామ్రాజ్యవాదుల కుట్రలోభాగమే. అందుకే కూలిపోయిన స్వప్నాలు కమ్యునిస్టు స్వాప్నికులకు విషాద గాలుల్ని మిగిల్చినా సరే, ఇది తాత్కాలికం. కోల్పోయిన వసంతం కోసం ప్రజలు మరలా విప్లవ, చైతన్యం పొందుతారు. అద్భుతమైన కథనాన్ని కవితాత్మక హృదయంతో ఆద్యంతం చదివించగలిగే శైలితో అరణ్య కృష్ణ అందించిన వైనం చూస్తోంటే ఇప్పుడే తాష్కెంట్ దర్శించి నట్టుంది. కూలిన స్వప్నాలే మరలా చరిత్రను పునర్నిర్మిస్తాయి. సోషలిజానికి ప్రత్యామ్నాయం లేదు. కనుమరుగైన మరువలేని ఆ సోషలిస్టు వసంతం కోసం Waiting for Godot లా వేచిచూద్దాం. ◆






# 'మరో ప్రపంచానికి' రుధిర ప్రస్థానం

- అనిశెట్టి రజిత

ఆమె రక్త పుష్పాలు రాల్చే అగ్ని చెట్టు...

ఆమె మానవ గౌరవ పతాకాన్ని ప్రజాస్వామీకరించేందుకు ఎగిరే శాంతి కపోతాల సమూహం..

ఆమె సమతాధర్మాన్ని నిత్యం కోడై కూసే మేల్కొలుపు..

ఆమె బహుజన నారీ భేరీ...

ఆమె రుధిర ప్రస్థానం మరో ప్రపంచం ఆవిష్కరణ కోసం...

మహాకవి సినారె అన్నట్లుగా ఆమె కవిత స్వాప్నికత. దార్శనికతల కలయిక. భావస్ఫోరకంగా మనిషిని నడిపించే చైతన్యానికీ, ధర్మాగ్రహానికీ సమస్త సజీవ గుణాలకూ నెత్తుటి ప్రతీక ఆ కవిత అని డా॥ గోపి అంటే నవ్య భారతాన్ని లిఖించడానికి సూర్యుడు ప్రజ్వరిల్లుతూనే ఉంటాడని డా॥ కంచె అయిలయ్య చెప్పినట్లుగా ఉదయించే ఆ నీతి సూర్యుని కోసం భావజాలంతో కలాన్ని సంధిస్తున్న కవయిత్రితో పాటుగా మనమూ ఎదురుచూద్దాం. ఎదుర్కోను పోదాం.

కవయిత్రి చెప్పినట్లుగా 'కులం' అనే మహమ్మారిని దహించే ఒక ఆయుధమే భావవ్యక్తీకరణ, అది శక్తివంతమైన శరపరంపరల ప్రశ్నల జ్వలన! అదే రుధిర ప్రవాహంలోంచి రుధిరాక్షరాలను రగిలించే కవితా ప్రస్థానం అమానవీయ అసమానతలను దనుమాడే అస్త్ర చికిత్స, చిట్టెంగట్టిన చీకటిని చీల్చి వెలుగుల ధారలతో శుద్ధిచేసే శస్త్ర శాస్త్ర ప్రక్షాళన.

నేను కవుల కవిత్వాన్ని ముసుగు కవిత్వం, ముసుగులు లేని కవిత్వంగా విడదీసి పరిశీలిస్తాను. ఝాన్సీ కుమారి కవిత్వం ముసుగులు లేకుండా పదునుగా సూటిగా సాగేది. అగ్ని పర్వతాల నుండి అగ్ని పుష్పాలను దూసుకొచ్చేది, మహోదయాలను స్వప్నిస్తూ ఆహ్వానించేందుకు తగు సామాగ్రిని కూర్చుకునేది. ఆమె కవితా వస్తువులు భావ విస్ఫోటనాలు.

1990 నుండి 2000 సంవత్సరం వరకు ఝాన్సీ కె.వి. కుమారి రాసిన 27 కవితల పొత్తం "రుధిర ప్రస్థానం" కవితా సంపుటి. "అగ్నిపుష్పం" కవితతో ఆవేశంగా మొదలై "ఎందుకు... ఎప్పుడు..?" అన్న ఆవేదనా సంవేదనతో కూడిన ప్రశ్నలు విసిరేయడంతో ముగుస్తుంది ఈ గ్రంథం. అయితే ఆమె రుధిర ప్రస్థానం ముగిసినట్టు కాదు మహోదయపు క్రాంతి కిరణాల స్పర్శ తాకనిదే ఈ కష్టాల ప్రయాణం, ఆశయాల యాత్ర ముగుస్తుందా...?

"రుధిర ప్రస్థానం" ఏమిటో ఎందుకో అన్నది ఈ పొత్తంలోని తొలి కవిత 'అగ్నిపుష్పం' ప్రణాళికాబద్ధంగా చెప్తుంది.

"నీ చీకటికి నువ్వు సిగ్గుపడు / నీ లేమికి నువ్వు సిగ్గుపడు / నీ అవమానానికి నువ్వు సిగ్గుపడు / నీ అజ్ఞానానికి నువ్వు సిగ్గుపడు / నీ బానిసత్వానికి నువ్వు సిగ్గుపడు ... ఎర్రని నీ రుధిరం / కాంతిని, క్రాంతిని / కోల్పోయినందుకు సిగ్గుపడు".

నిన్ను నీవు అంటే నీవున్న స్థానం నీ స్థాయి, నీ బతుకు చిత్రం ఎంత హీనంగా దీనంగా ఉన్నదో నీవు గ్రహిస్తేనే కదా నీ బానినత్వం నిన్ను బాధపట్టేది... అందులోంచి బయటపడాలన్న తెగింపు తెచ్చేది... నీవు కర్మసిద్ధాంతాన్ని నెత్తికెత్తుకొని ఈ బతుకింతే అని నీరసపడి అలవాటుపడిపోతే నీవొక వాడిన, రాలిన, ఎండిన పుష్పానివే. నీవున్న స్థితికి సిగ్గుపడితే నీ నెత్తురు వేడెక్కి ఎర్రగా ఉరకలెత్తుతూ నిన్నో అగ్నిపుష్పంలా మార్చి నీ చెమట నుండి కొత్త కాంతులు విచ్చుకునేందుకు దోహదపడుతుంది. ఈ కవిత అణగారిన 'కర్మజీవుల్లోని' మానవ అంశనూ... మానవ గౌరవ ఆకాంక్షనూ కదిలిస్తుంది. భారతదేశంలో అభాగ్యజీవుల అశ్రునయనాల్లో అగ్నిపుష్పాలను పూయిస్తుంది.

"కరిగిపోతూ వెలుగులును పంచే / కదిలే కొవ్వొత్తులు / పగిలిన గుండెల్లోనుండి పరమార్థ గానాన్ని / పలికించే వెదురు పుల్లలు", ఈ కవిత... సృష్టిలో మనం అల్పంగా భావించేవెన్నో అనల్పంగా పనిచేయగలవు. శ్రీశ్రీ చెప్పిన కుక్కపిల్లా, అగ్గిపుల్లా, సబ్బుబిళ్ళా ఏమంత ఘనమైనవి కాదు, కానీ వాటి అర్హత వాటికుంటుంది. సృష్టిలో వాటి పాత్ర వాటిది. ఒక్క కుక్కనైనా చులకనగా చూడరాదు, దాని రోజు దానికొస్తుంది. అప్పుడు మన అహం అంగలారుస్తూ కూలబడిపోతుంది.

కొవ్వొత్తులది చిన్న ఉనికే కానీ కొద్దిసేపటి కోసమైనా ఆ ఉనికి చీకట్లను బెదరగొడుతూ వెలుగులనిస్తుంది. వెదురుపుల్లల గురించి ఎవరికీ పట్టదు. కానీ వాటిని చిల్లుపొడిస్తే మధురమైన గాలిపాటలు వస్తాయి. "సూర్యుణ్ణి మెడలో వేళ్ళాడేస్కుని / నిశిరాత్రిని గర్భాన ధరించి / మౌనంగా సాగిపోయే / పరిమళాలను / పారిజాతాలని భ్రమించబోకు / అవి నడిచే అగ్నిపర్వతాలే / ఏ క్షణమైన బ్రద్ధలవ్వొచ్చు / మరిగే లావా / నిన్ను దహించేయవచ్చు.

సామాన్యులు సర్వోన్నతులుగా, సర్వోన్నతులు సామాన్యులుగా మారే ప్రక్రియను పిడికిటపట్టి అరచేతిలో అగ్నికణాల సెగను భరిస్తూ చూపించే నిజాలు అగ్నిపర్వతాలు. కొండ అద్దంలో కొంచమై కనిపిస్తుంది కానీ అగ్నిపర్వతాలు ఏ అద్దంలోనూ ఇమడవు. అవి అల్పజీవుల నుండి చిన్న వస్తువులైనా పరిపక్వానికొచ్చిన సమస్య కాలాన్ని కదిలిస్తే విస్ఫోటించగలదు. ఇదే కవితా సందేశం. ఒకింత హెచ్చరిక.

"నడిరేయిలో అరుణోదయం" అయ్యేటప్పుడు సృష్టిలో అల్లకల్లోలితాలు. అద్భుతాలు జరుగుతాయి. వాటిని రమణీయంగా చెప్తుంది కవయిత్రి.

లోకంలో పట్టరానితనమే మనకు అనుభవం. అంతకంతకూ కుంచించుకుపోతున్న మనిషి, నిస్తబ్ధంలోకి కుదించబడుతున్న ఉనికి. శిధిలాలను పరుస్తూ చిగురులను మాడ్చేస్తూ రుద్రభూమిని వ్యాపింపజేస్తున్నది. ప్రపంచ కరుడుగట్టుకపోతున్నది. సారం నశిస్తూ బీళ్ళు నీళ్ళో అని అఘోరిస్తున్నాయి. శిధిలాల నడుమ మనిషి అనాకారపు శకలంలా ఎంతటి ఘోర దృశ్యం. ఏమీ శిధిల దృశ్యం !

"విరిగిన రెక్కల శకలాలను / ఏ ఎడారుల ఇసుక రేణువుల్లో వెతకను? / వెలుగు ద్వారాల కళ్ళు / ఏ చీకటిలో కూరుకుపోయాయో / "ఇంతకీ ఆత్మ? / ఏది ? ఎవరు దోచేశారు?"

ప్రకృతి చిగురుల్ని మనం చిదిమేస్తే ఆ నిర్జీవాలు మనల్ని ఆవహిస్తాయి. ఇప్పుడు కావాల్సింది ఒక అంతం. తర్వాత అనంతం, ఒక కొత్త సృష్టి. ఆ సృష్టిలో చిగురించే శిధిలాలను చూడగలిగిన అద్భుతం. అద్భుతాలన్నీ మహా విషాదంలోంచే జనిస్తాయని ఒక కవి అన్నట్లుగా అందుకు జాగరూకతతో సున్నితంగా చేయగలగాలి ఆత్మిక నిర్మాణం. 'శిధిలాలు చిగురిస్తేనే' మనిషి మనుగడ. ఏదీ శిధిలం చేయకుండడమే మనిషి కర్తవ్యం. అదే ఈ కవి భావోద్దేశం.

ప్రపంచం రంగూ రుచీ ఆస్వాదనలు కోల్పోయిన దుస్థితిలో మనం ఉదయాల్నీ మహోదయాల్నీ చూడగలమా? స్వేచ్ఛా పతాకం నిర్భయంగా నిలకడగా తలెత్తి రెపరెపలాడుతుంటే ఉదయాలన్నీ మహోదయాలు కావా... ఉదయమెంత సహజమో మహోదయం అంతే సహజం అయిన రోజున ఈ లోకం మారిపోదా... నవలోకం అవతరించదా....

మన దేశమొకటి స్వేచ్ఛ సాధించింది పరపాలన నుండి అనుకుంటే చాలదు. పౌరస్వేచ్ఛ, వ్యక్తి స్వేచ్ఛ కూడా పరిమళించాలి. స్వేచ్ఛంటే మానవగౌరవం, స్వేచ్ఛంటే కరుణ, ప్రజ్ఞ, సమతల మేలికలయిక.

అందుకోసం చేయాలి 'రుధిర ప్రస్థానం' ! అది మనిషి స్వేచ్ఛాగానాన్ని అనుసరించే జీవనయానం, గాజుబొమ్మల్లా నాజూకైన మనుషులు మానసిక సున్నితత్వాన్ని కోల్పోయారేం? కాలం విసిరే విషపు వలల్లో చిక్కి సర్వం నశింపజేసుకుంటున్నారు. వస్తువుల్ని కూడబెట్టుకుంటూ వాటితో అక్రమ సహచర్యం చేస్తూ అనుబంధాలను విస్మరిస్తున్నారు. దుఃఖాల్లో దిగబడిపోతున్నారు. సమూహంలో

ఒంటరి గొరిల్లా దారి తప్పి, గురితప్పి, తప్పిదనాల దారుల్లో తచ్చాడుతున్నారు. వారికి దుఃఖం, వేదన వ్యక్తిగతమనే తెలుసు. దుఃఖమైనా వేదనైనా సమూహాలకి సంబంధించినదే అన్న ఎరుకలేదు.

"దుఃఖమంటే బోధివృక్షం ఎలుగెత్తి ఆలపించిన / కరుణ గీతం ! దుఃఖమంటే / సిలువ కొమ్మను పూచిన / శాంతి సౌరభం" దుఃఖమంటే ఎన్నో అనుభూతుల విస్తారమైన అంశం. అందుకే అందరూ చేయాలి 'రుధిర ప్రస్థానం' తెలుసుకుని నడవాలి రుధిరంతో చెమ్మగిల్లిన భూమి మార్గాన. మనల్ని మనం మర్చిపోవడం ఒక్కోసారి అనివార్యమవుతుంది. క్రూర ప్రపంచంలో ఎన్నింటినో భరించాలి. ఎన్ని గాయాలనో సహించాలి. ఎన్ని కృత్రిక తొడుగుల్నో ధరించాలి. సహజీవనాలైనా సహచర్యలైనా ఉన్నట్టుండి తెగిపోక, ఆగిపోక తప్పదు. అనివార్యం జననం. అనివార్యం మరణం. ఏదీ తట్టుకోలేనప్పుడు ఎందుకైనా మంచిది ఎవర్నివారు మరిచి ఉండటమే మంచిది.

"కాలం అంచున" నిలబడి మన ప్రపంచాన్ని చూసుకుంటే ఎన్నో 'జీవన రహస్యాలను ఆవిష్కరిస్తూ కాలం అంచుకి చేరుకున్నాం నేస్తం' అని చెప్పాలనిపిస్తుంది. జీవన రహస్యాలను హృదయంలో, జీవన సాఫల్యతలూ, వైఫల్యాలనూ కాలం కాన్వాస్ మీద చిత్రించుకున్న సమయాన్ని "కాలం అంచున" చేరి తడుముకోవడం ఒక అనుభవం. అందరం అందుకునే 'ఆహ్వానం' మృత్యువు. "ఈ జీవితం ఓ మంచుతెరని / మృత్యువనే ఎండసోకగానే / కరిగిపోయే మబ్బుతునకని తెలుసు" మనకు. ఈ క్షణికమైన జీవితపథంలో శాంతి అనేది మరీచిక లాంటిదే అని మన అనుభవం. అశాంతి మన ఆభరణం, శాంతి అందని మధుర ఫలం.

"శిథిల స్వప్నం" వెక్కిరిస్తుంటే భయానకమైన అసమర్థ బతుకుల్ని బాగా అలంకరించుకొని లాగిస్తుంటాం. స్వయంకృతాపరాధాల్ని క్షణమైనా విమర్శకు పెట్టుకో....

"ఇక్కడ.. కవైనా కళాకారుడైనా / పదవి ఉన్నవాడైనా, కొన్నవాడైనా / ఎక్కించే నిచ్చెనలైనా, కాటేసే సర్పాలైనా / అంధత్వమే అందరి స్థిరాస్తి / అజ్ఞానమే అనంత చరాస్తి"... అంగట్లో దొరికే సరుకులకు కొదవేలేదు... అమ్ముడుబోయే బతుకులకు హద్దే లేదు.. సౌందర్య స్వప్నాలను శిథిలం చేసుకుంటూ శిథిల స్వప్నాలను ఆలింగనం చేసుకుంటూ శిథిలాల్లో గాయపడిన శిథిల స్వప్నంలా... మృత్యువుల కేళీల్లో మృత్యు స్పర్శకై ఎదురుచూస్తూ... "ఎందుకు..? ఎప్పుడు...? "ఎక్కడో తప్పిపోయిన బతుకుల చితుకుల మంటల్లో, అపశృతుల దీనాలాపనలతో, జననంలో మరణశాసనాల్ని లిఖించుకుంటూ.... గాయాల గమకాలను వల్లెవేసుకుంటూ ... గరళాన్ని మింగుతూ సజీవతలేని మరమనుషుల్లా చీకట్ల చిక్కాలను కట్టుకొని... ఎంత దుర్భరంగా మనమున్నాం !

అందుకే ఈ "రుధిర ప్రస్థానం" అందరూ ప్రక్షాళన కావాల్సిన ఒక సంఘర్షణాపథం. ఝాన్సీ కె.వి. కుమారి కలం కార్చిన రక్తకన్నీటి చుక్కల అక్షర జ్వలనం.

♦♦♦

ఝాన్సీ కె.వి. కుమారి కృష్ణా జిల్లా ఉయ్యూరులో 2 అక్టోబర్ 1954లో కలతోటి సుందరరత్న దీనమ్మ - యెహోనుగార్లకు జన్మించారు. 3 శాస్త్ర విభాగాల్లో యం.ఏ పట్టాలు పొందారు. ఎన్నో డిప్లొమాలు చేసారు. ఆకాశవాణిలో కార్యనిర్వహణాధికారిగా పనిచేసారు. జర్నలిస్టుగా కాలమిస్ట్‌గా పత్రికా రచనలు చేసారు. కథ, కవిత, నాటిక, వ్యాసం, గేయం, అనువాదం, నవల మొదలగు అన్ని ప్రక్రియల్లో సాహిత్యసేద్యం చేసారు. వారి ప్రచురిత రచనలు : 'నిశ్శబ్ద రాగం', కవితా సంపుటి (1988), 'రుధిర ప్రస్థానం', కవితా సంపుటి (2008) 'వినిపించని రాగాలు', కథా సంపుటి (2001), 'అక్షర బిందువులు', నానీల సంపుటి (2007) 'నాతి చరామి', నాటకాల సంపుటి (2008), 'కాల నిర్ణేత అడుగుజాడలను స్పృశిస్తూ' యాత్రా కథనం (2008), 'విశ్వశాంతి - క్రీస్తుకాంతి,' కవితా సంకలనం (2008), 'అంతరంగం' - కాలమ్ వ్యాసాలు (2012).

వీరి "వినిపించని రాగాలు" కథా సంపుటి "అన్‌సున్ రాగ్" గా హిందీలోకి అనువదించబడి ప్రచురించబడింది. వీరి రచనలు ఎన్నో ఆంగ్లంలోకీ, హిందీలోకి అనువదించబడ్డాయి. వీరు ఆడియో క్యాసెట్లు కూడా తీసారు. వివిధ సందర్భాలలో పదుల సంఖ్యల్లో పత్ర సమర్పణలు చేసారు. అముద్రిత రచనలు ఎన్నో ఉన్నాయి. ఆకాశవాణి ద్వారా సంగీత రూపకాలు డాక్యుమెంటరీ డ్రామాలు రచించి, నిర్వహించారు. వివిధ సంస్థల్లో బాధ్యతలు నిర్వహించారు. ఇజ్రాయేల్, పాలస్తీనా, కౌలాలంపూర్, మలేషియా, సియోల్, దక్షిణ కొరియా, ఇంగ్లాండు, అమెరికా దేశాల్లో పర్యటించారు. ఎన్నో సాహిత్య సన్మాన పురస్కారాలు అందుకున్నారు.

కులరహిత సమాజం కోసం, మనిషిలో మానవత్వాన్ని జాగృతం చేయడం కోసం నిర్మోహమాటంగా కవితాసేద్యం చేస్తున్న సోదరి ఝాన్సీకి శుభాభినందనలు ! ♦

- పి.ఎల్.ఎన్. మంగరత్నం
9701426788



# ప్రయత్నిస్తే గెలుపేదో రాదా !

అవి ప్రమోషను కోసం ఎదురు చూస్తున్న రోజులు.

చూస్తుండగానే.. నెలరోజులు గడిచిపోయాయి..

ఈరోజు, రేపూ అన్నట్లుగానే ఉన్నా, ఫైలు ఇంకా ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసరు దగ్గరే ఉందనో ! మధ్యలో ఆఫీసరు శెలవులో ఉండడం వలన కలెక్టర్ గారికి ఇంకా.. చేరలేదనో అప్పుడప్పుడూ తెలుస్తున్న విషయాలు.

అంతా అనిశ్చితి.

ఏది ఎప్పుడు, ఏది జరగాలో అప్పుడే జరుగుతుందన్నట్లు గడుస్తుంది కాలం.

జిల్లా హెడ్ క్వార్టర్లో లోనే..

ఉన్న 'డివిజనల్ ఆఫీసు'లో రెండేళ్లుగా సుఖపడుతున్న నాకు.. ప్రమోషను పేరుతో మళ్ళీ ఏ మండలానికో విసిరేస్తారన్న భయం వెంటాడుతూనే ఉంది.

ఇంకా చెప్పాలంటే ప్రమోషన్లలో ఉన్న వాళ్ళని ఎప్పుడూ దూరంగా ఉన్న ఏజన్సీ మండలాలకే వేస్తారు. పదోన్నతి కోసమేనా తప్పనిసరి అయి జాయిను అవుతారని. దట్టమైన కొండ కోనల్లో.. ఉండే గిరిజన ప్రాంతాలు. సరి అయిన రోడ్డు మార్గంలేక.. ఎక్కడో విసిరేసినట్లు నాగరికతకు దూరమైన పల్లెలు,

అయితే, నాకు అలాంటి ఏజన్సీ భయం లేదు. లేడీస్ని వారి అంగీకారం లేకుండా వేసెయ్యరు.

జిల్లా పెద్దది కావడంతో చాలా మండలాలు దూరంగానే ఉంటాయి. అలాగే, గనుక జరిగితే, మళ్ళీ బస్సులు పట్టుకుని వెళ్ళే కష్టం. సర్వీసు చివరికి వచ్చేసింది. ఇంకో సంవత్సరంలో రిటైరుమెంటు. ఈ వయసులో ప్రయాణాలంటే కత్తి మీద సామే.

లిస్టులో పేరున్నాక ప్రమోషను రాక, మానుతుందా అన్నట్లు ఆదురదురుగా ఎదురు చూస్తూనే ఉన్నాను. ఇలాంటి టైములో కాలక్షేపరాయుళ్ళు కొంతమంది పని గట్టుకుని వచ్చి "ఎక్కడికి వెయ్యించుకుంటున్నారు మేడం" అంటూ అడిగేవారు. నేను చెప్పే సమాధానాన్ని బట్టి, నా పరపతిని అంచనా వేస్తారు వాళ్ళు.

సమాధానం చెప్పాలి కాబట్టి "నాకంత కెపాసిటీ లేదయ్యా! నేనేమన్నా ఎసోసియేషనులో మెంబరునా, వి.ఐ.పీ. నా? ఓ మామూలు సీనియర్ అసిస్టెంటుని. ఎక్కడకు వేస్తే అక్కడకు వెళ్ళడమే. కాకపోతే కాస్త దగ్గర పడాలని కోరుకోవడం" అంటూ ముక్తాయింపు ఇచ్చేదాన్ని.

"పోనీ, ఇక్కడికే వచ్చేయండి" అనేవారు నన్ను వదులుకోవడం వాళ్ళకంత ఇష్టం లేనట్లుగా. నేను పనిచేస్తున్న ఆఫీసులోనూ ఓ డిప్యూటి తహసీల్దారు పోస్టు కూడా ఉంది.

"ఇక్కడ ఉన్నదే.. ఒక పోస్టు.. అందుట్లోనూ ఒకళ్ళు ఉన్నప్పుడు నేనెలా రాగలను?" అనేదాన్ని అది జరిగే పని కాదన్నట్లు. ఆ పోస్టులోనే ఉన్న డిప్యూటి తహసీల్దారు రామదుర్గగారు బాధ పడకూడదని. ఆమె చాలా తెలివైనది. కొన్ని డ్రాఫ్టులు ఆమె వ్రాయగలదు అన్నట్లు ఉండేది ఆఫీసులో. అవసరాన్ని బట్టి.. టైపిస్ట్ ప్రక్కన కూర్చుని.. డిక్టేషన్ ఇస్తే టైపు కొట్టేసేవాడు టైపిస్ట్. అలా నిముషాల మీద పనులు పూర్తి అయ్యేవి. అది హెవీ సీటు కావడంతో అలాగే పని నడిచేది. అలాంటి సీటుకి నేనెలా ఎగబడగలను.

వర్కు మీద పట్టుఉన్న వాళ్ళకే అక్కడ స్థానం.

"అంతే లెండి. న్యాయం మాట్లాడారు" అంతలోనే తమాయించుకునేవారు అత్యుత్సాహం ప్రదర్శించిన వాళ్ళు.

♦♦♦

ఇలాంటి నేపథ్యంలో..

ఓ రోజు..

"హెడ్ ఆఫీసులో ఎవరినన్నా కలిసారా" అడిగాడు వర్మ. అతనికి ఏం కొత్త ఇన్ఫర్మేషన్ తెలిసిందో.

"లేదు. ఎవరిని.. ఎలా కలవాలో.. ఏం మాట్లాడాలో తెలీడం లేదు" చెప్పాను.

"అయినా సరే ! ఓ సారి ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసరుగారిని కలుసుకోండి. ప్రమోషను పోస్టింగులు కలెక్టర్ గారే వేసినా .. ఫైలంటూ కదిలేదు సెక్షను నుంచే... చెప్పుకునేది ఏమైనా ఉంటే చెప్పుకుని రండి. ముందు 'క్రింది కేడరు' వాళ్ళను గనుక ఒప్పించుకుంటే... పనులు అవే సులువు అవుతాయి" అంటూ సలహా ఇచ్చాడు తన అనుభవాన్ని దృష్టిలో ఉంచుకుని.

అదీ సరయినదే అనిపించింది.

అతను చెప్పినట్లే విషయం అంతా కాగితం మీద పెట్టి సాధ్యమైనంత వరకూ హెడ్ క్వార్టర్లోనే వెయ్యమనీ, సివిల్ సప్లై డిపార్టుమెంటులో అయితే బాగుంటుందనీ (అందులో కొన్ని ఎగ్జిక్యూటివ్ పోస్టులు ఉంటాయి) ఇంకో సంవత్సరంలోనే రిటైరుమెంట్ అనీ' చెప్పుకున్నాను.

నా అప్లికేషను చదివిన ఆఫీసరుగారు..

"సంవత్సరంలోనే రిటైరుమెంట్ అంటున్నారు. ఎప్పుడో ఖచ్చితంగా డేటు చెప్పండి" అడిగారు కన్ఫర్మేషన్ కోసం.

"వచ్చే సంవత్సరం డిసెంబర్ ముప్పై ఒకటి సార్"

"ఓ వచ్చే సంవత్సరం డిసెంబర్ ముప్పై ఒకటా ! నాదీ అప్పుడే. అంటే, నాతో పాటే రిటైరు అవుతారన్నమాట"

అని నవ్వుతూ "సరే! అలాగే, మీరడిగినట్లే సివిల్ సప్లైకు వేస్తాను లెండి" అంటూ భరోసా ఇచ్చారు.

చాలా సంతోషపడ్డాను.

అంత భరోసా దొరుకుతుందని అనుకోలేదు.

అప్పుడే గుప్పెడు తెరవకూడదు. పెదాలపై నవ్వు మొలవకూడదు. విషయం లీకైతే, హెడ్ క్వార్టర్స్‌లో ఉన్న ఆ పోస్టు మరెవరైనా తన్నుకుపోవచ్చు.

నేను పై ఆఫీసర్లని కలుసుకున్న విషయం. తెలుసుకున్న రామదుర్గగారు అడగనే అడిగింది.

"ఏమన్నారు?" అని.

ఎంత.. ఇంటి విషయాలు చెప్పుకునేంత చనువున్నా.. సీక్రెసీ అనేది అందరి దగ్గరా ఒకేలా మెయింటేన్ చెయ్యాలి. లేకపోతే అనవసరపు సమస్యలు వస్తాయి.

"ఏముందీ? మన లేడీస్ ని ఏమని అడుగుతాం. కాస్త దగ్గరలో వెయ్యండనే కదా! అదే అడిగాను"

ఎంత పరిశీలించి చూసినా.. నా ముఖంలో చదవడానికి ఏ భావమూ కనబడి ఉండదు. చివరిగా "నా సీటుకి గానీ ఎసరెట్టకండి" అంది నవ్వుతూ. నాతో స్నేహంగా ఉంటూ నాకే వెన్నుపోటు పొడవద్దన్నట్లు.

ఆమె భయం ఆమెది. వచ్చి మూడేళ్ళు అవుతుంది. అలాగే గనుక జరిగితే ఆమె వేరే స్టేషను వెతుక్కోవాలి. మండలాల్లో వాళ్ళకి ఏ భయమూ ఉండదట, ఒక్క ట్రాన్స్ఫర్ల భయం తప్ప.

ఆమె మాట నా గుండెను తాకిందనే చెప్పాలి. అయినా ఇంకా కన్ఫర్మ్‌గా తెలియని విషయం నాకు అందని ద్రాక్షలాంటిదే. "మీ సీటు చెయ్యగలిగే ధైర్యం నాకు లేదు లెండి. దగ్గర ప్లేస్ కోసమే అడిగాను" అంటూ నా ఆసక్తతను తెలియచేసాను.

♦♦♦

కలక్టరేటు ఏ.ఓ గారు మాట ఇచ్చినట్లే సివిల్ సప్లయిసు డిపార్టుమెంటుకే వేసారు.

అయితే, ఆ ఆఫీసులో కూడా ఓ డిప్యూటి తహసీల్దారు పోస్టు ఉండడంతో ఆ సీటు నాదయ్యింది. బయటకి తిరిగే అవసరం లేకుండా.. ఆఫీసులోనే ఉండడం సంతోషాన్నే

కలిగించింది.

అయితే, కేడరు పెరగడంతో కోర్టు కేసులు వ్రాయవలసి వచ్చింది. జడ్జిమెంట్లు వ్రాయాల్సి వచ్చినప్పుడు కాస్త కష్టపడ్డాననే చెప్పాలి. ఉండడానికి బీరువాడి ఫైళ్ళు ఉన్నా.. అందులో ఏక్షను ఉన్నవి సగం మాత్రమే.

అయినా ఉరుకులు పరుగుల హడావుడే.

సంవత్సరకాలం ఎంతలో గడవాలి?

రోజు వెంట రోజు సాఫీగా గడిచిపోతుంది. ఎదురు చూడకపోయినా డిసెంబర్ ముప్పై ఒకటి వచ్చేసింది. దాంతో, ఇంటికి వచ్చేసాను.

♦♦♦

ఇక్కడో స్వంత విషయం చెప్పుకోవాలి.

ఇక ఇంటికి వచ్చేసే రోజులు.. అంటే రిటైరుమెంటు దగ్గర పడుతున్నాయనగా..

నవంబర్ నెల నుంచీ ఎడమ కాలి 'మడమ నొప్పి' చెయ్యడం ప్రారంభించింది. నవంబర్ నెలలో చలి తీవ్రత ఎక్కువగా ఉండడంతో కాలికి 'కొత్తగా' పగులు ఏర్పడి ఉంటుంది. అదే నన్ను ఇబ్బంది పెడుతుంది అనుకున్నా.

ఉదయాన అడుగు తీసి.. అడుగు వెయ్యడం చాలా కష్టం అయిపోయింది. ముళ్ళ మీద అడుగు వేసినట్లు ప్రాణం గిలగిలలాడిపోయేది. అయినా ఎందుకో.. అంత సీరియస్గా తీసుకోలేదు ఆఫీసుకి వెళ్ళాలన్న ధ్యాసతో.

ఓ ఇరవై రోజులు గడిచిన తరువాత..

డాక్టరు దగ్గరకు చూడాల్సిన అవసరం పడింది. డాక్టరు అది 'కాల్కేరియ ఫాస్' అనీ విశ్రాంతి అవసరం అనీ మందులు వ్రాసి ఇచ్చారు.

అలా నాకు తెలియకుండా ఆ విశ్రాంతి.. ఈ విశ్రాంతి కొచ్చేసింది.

సర్వీసు పూర్తి చేసుకుని ఇంటికి వచ్చేయ్యడం.. అనారోగ్యం బారిన పడడం ఒకేసారి జరిగిపోయింది.

ఆ కారణంగా రిటైరుమెంటు బెనిఫిట్స్ లాంటి పనులేవీ ఆఫీసుకి వెళ్ళి చేయించుకోలేకపోయాను. నెల రోజులు దాటిపోయినా గాని.

కొత్త జీ.ఓ ల ప్రకారం రిటైరుమెంటు రోజునే రావాల్సిన బకాయిలు అన్నీ చేతిలో పెట్టేయాలన్న రూలున్నా. అవన్నీ కాగితాలకే పరిమితం. సీటు నుంచి బయటకి వచ్చేస్తే ఎవరికి ఎవరో?

గ్రాట్యుటీ ఫైలు కోసం కలెక్టరేటు మెట్లు ఎక్కడం.. ఇంకా తెమలని పనుల కోసం మా ఆఫీసు మేడమెట్లు ఎక్కడం చాలా కష్టం అనిపించి.. ఇక తిరగలేక, సెక్షను అమ్మాయి ఫోన్ నెంబరు తీసుకుని వచ్చేసాను.

ఆ అమ్మాయికి ఎప్పుడు ఫోన్ చేసినా "మేడం గారూ! ఈ రోజు వంట్లో బాగాలేక శెలవు పెట్టానండీ అనో! అఫీసులో అర్జంటుగా కేడర్ స్ట్రెంత్ అడుగుతున్నారనో, నెంబరు స్టేట్మెంట్ అడుగుతున్నారో ! అది అయ్యాక మీ బిల్స్ పెడతానండీ ! అయినా మీకెందుకు, నేను మీ బిల్స్ ఆన్లైను చేసి, పని చేయించే భాద్యత నాది. కొద్ది రోజులు ఓపిక పట్టండి మేడం గారూ ! అయిపోగానే నేనే ఫోన్ చేసి చెబుతాను" అంటూ చెప్పేది చాలా నమ్మకంగా.

ఆఫీసు అన్న తరువాత ఎప్పుడూ హడావుడే.

ఏటిలోని కెరటాల్లా కొత్త ఒరవడి వస్తూనే ఉంటుంది.

ఆఫీసు స్టాఫ్ నూట పాతిక మంది. జీతాల బిల్లు చెయ్యడానికే చాలా టైము పడుతుంది. వాటిని మళ్ళీ పేరు పేరునా ఆన్లైను చెయ్యాలి. అదే పని మీద కూర్చుని చేస్తే.. మూడు, నాలుగు రోజుల పని.

మళ్ళీ దాన్లో శెలవుపెట్టిన వాళ్ళుంటే, వాళ్ళ జీతం తగ్గించి వ్రాయాలి. అంతా శ్రమతో కూడుకున్న పని. కాబట్టి, ఎవరినీ తప్పు పట్టలేం. గడవాల్సిన పుణ్యకాలం గడుస్తూనే ఉంది.

నాలుగు రోజుల తరువాత ఎందుకైనా ఆ అమ్మాయి అదే కథనం వినిపించేది.

♦♦♦

ఇలాంటి సమయంలో..

ఓ ఆదివారం ఉదయాన రామదుర్గగారు ఇంటికి వచ్చింది.

ఆమె రాక చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది.

వస్తూనే, ఓ పెద్ద గులాబీ చేతికిచ్చింది. వచ్చే దారిలో వెంకటేశ్వరస్వామి గుడికి వెళితే.. ఇచ్చారని.

"వంట్లో బాగాలేదని తెలిసింది. మా హస్బెండ్ ఇటు వైపు వస్తుంటే వచ్చాను. ఎలా ఉంది ఇప్పుడు?" అడిగింది.

ప్రమోషను తరువాత.... వదిలేసిన పాత ఆఫీసుకి వెళ్ళిందే లేదు. అయినా విషయం తెలుసుకుని వచ్చింది. చానాళ్ళ స్నేహం... ఎంతైనా పాత స్నేహితురాలు. తనూ రిటైరుమెంటుకి దగ్గరలోనే ఉంది. కాకపోతే, నా కన్నా కాస్త

## ప్రజా గజళ్ళు

- సిరా
9866087700



కుత్తుక కోసిన రాచ కత్తికి రాగి రేకున కీర్తి కయిత
కుప్పతొట్టి విస్తరంట్లకు కుమ్ములాటలు గనదు చరిత.

ప్రజల రాజ్య రక్షణ కొరకు ఓటు బాసికం అందరి నుదుట
ఎన్నిక బరిలో నిలవడానికి డబ్బు దొంతుల బరువు అర్హత.

తొంభై శాతం వ్యతిరేకించి తొమ్మిది శాతం ఓట్లు చిక్కినా
గెలుపుగాని గెలుపు పూన్చిన కొయ్య గుర్రపు రథము ప్రభుత.

పున్నెం మూలలు తొక్కిసలాటల నలిగి జచ్చిన మత్తున వుంచి
ప్రజల వుసురు పణకగ తూచె పరకామణుల చేతిల భవిత.

రాజ్యాంగ సంస్థల మూపున యెక్కి సవారి చేస్తు నల్ల ధనము
సహజ న్యాయం దరిదాపులకు చేరలేని సామాన్య జనత.

గాలి యమ్మకం సంత గట్టున దోపిడి గణముల చీకటి వ్యూహం
హక్కుల సాధన సమర రంగమున విగత జీవులై యువత.

ఒక్క పాలు ప్రజల చేతిలో తొంభై పాళ్ల దేశ సంపద
తక్కిన దాంట్లో బతుకుదుమన్నా బీదాబిక్కికి బలము కొరత.

అవకాశాలు అంది రాక అవకతవకలను ప్రశ్నిస్తె
చుట్టుముట్టి యలంకరింతురు ఉగ్రవాది యను బిళ్ళ
యరత.

లోచెద బట్టిన చెట్టును బోలి పంచపాళిలో ప్రజల పాలన
కొత్త కుదుపు వచ్చిన గాని 'సిరా' సాధ్యమౌనె సమత.

◆

---

చిన్నది.

"ఈ అపార్టుమెంటులోకి వచ్చిన ఈ పన్నెండేళ్ళలోనూ లిఫ్ట్ ఉపయోగించింది తక్కువ. వంద మెట్లు అయినా హాయిగావే ఎక్కిదిగాను. ఎంతెంత దూరం అయినా నడిచేసేదాన్ని. అలాంటిది ఇప్పుడు అడుగుతీసి అడుగు పెట్టలేకపోతున్నాను" అంటూ నా కష్టాన్ని గురించి చెప్పాను.

"నాకు అంతే.. ఈ మధ్య అస్సలు బాగుండడం లేదు. చెయ్యి, భుజం నొప్పులు, రెండు నెలలుగా శెలవులోనే ఉన్నాను. రెండు రోజులయ్యింది జాయినయ్యి. వంట్లో బాగోనందుకు అస్సలు పని చెయ్యలేకపోతున్నాను. నా సీటు మీకు తెలుసు కదా ! ఇనాములూ, పట్టాదారు పాసు బుక్కులా... రెండూ హెవీ సబ్జెక్ట్‌లే. ఇన్నాళ్ళూ స్టేషను ఇంట్రస్ట్‌తో చేశాను. ఇప్పుడు ఓపిక లేదు. పబ్లిక్కా ఆగరు. తొందర తొందర అంటారు. అందుకే బయటకు వద్దాం ! అనుకుంటున్నాను." అంటూ చల్ల కొచ్చి ముంత దాచడం ఎందుకన్నట్లు విషయానికి వచ్చేసింది.

"సివిల్ సప్లయిస్‌లో మీ రిటైరుమెంటు తరువాత మీ సీటులో ఎవరినైనా వేసారేమో! తెలుసుకుందాం అని వచ్చాను. అయినా, నేను చెయ్యగలనా ! ఆ సీటు" అంటూ అడిగింది సందేహంగా.

"భలేవారే ! నేనే చెయ్యగలిగింది... మీరు చెయ్యలేరా ! నేను బయటకి వచ్చేసి నెలరోజులు అవుతుంది కదా! నాకు ఆ వివరాలు ఏమీ తెలీదు. ఓ సారి వెళ్లి కలెక్టర్ ఆఫీసులో అడగండి. పని జరుగుతుందేమో" అన్నా

ఒకప్పుడు తన సీటుకి 'ఎసరెట్టాదన్న' మనిషి ఈ రోజు నేను చేసిన సీటుకే ప్రయత్నించాలనుకోవడం..కాస్త విస్మయాన్నే కలిగించింది.

ఇంకా కొసమెరుపు ఏమిటంటే కొత్తగా వచ్చిన ఆఫీసరుగారికి... ఈవిడకీ 'మాట' తేడా వచ్చి శెలవు పెట్టేసిందని బయట అనుకోవడం. అభిమానానికి పోయి ఎన్నాళ్లని శెలవులో ఉండిపోగలదు? పేదవాడి కోపం పెదవికి చేటు అన్నట్లు

సమీకరణాలు మారడం అంటే ఇదేనేమో!

◆

# సూర్యోదయానంతర కవి షమీఉల్లా






- రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి
9440222117

"అంతమాత్రానా
తల్లడిల్లిపోవాల్సిన పనిలేదు
ప్రపంచం విశాలమైంది" (పు. 128, సూర్యోదయానంతరం)

విపులాచపృథ్వీ అనే నమ్మకం ప్రకటిస్తున్న ఈ కవి మా విద్యార్థికావడం మాకు గర్వకారణం. శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయ విద్యార్థి డా. ఎస్. షమీవుల్లా ఒక పేద ముస్లిం కుటుంబంలో పుట్టాడు. ఆశావాది ప్రకాశరావుగారి దగ్గర సాహిత్యాక్షరాలు నేర్చుకొని, మా దగ్గర ఏం.ఏ. తెలుగు చదివి, ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారి పర్యవేక్షణలో ముస్లిం సాహిత్యతత్వం మీద పరిశోధించి డిగ్రీ కళాశాల అధ్యాపకుడుగా పనిచేస్తున్న ఈ షమీవుల్లా, పేదరికం కష్టపడి చదవడానికి దారితీసింది. చదువు కవిత్వం సంస్కారమిచ్చింది. కవులుగా ఎదిగిన మా విద్యార్థులలో షమీవుల్లా ఒకడు. నాగరికమైన కవిత్వం రాయడంలో సిద్ధహస్తుడు. ఆత్మగౌరవం, ఆత్మాభిమానం ఈయన కవిత్వంలో కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి. తనను తాను ఓదార్చుకొనేతత్వం ఈ కవిలో ఉంది. మానవత్వ పరిమళం ఈయన కవిత్వంలో ప్రధానంగా కనిపిస్తుంది. సామాజిక పరిణామాలను కవిత్వీకరించే క్రమంలో మనుషుల బతుకులు పరాయీకరింపబడటాన్ని షమీఉల్లా వేదనగా ఎత్తిచూపుతాడు. వ్యవస్థ ఇంకా బాగా ఉండాలని అభిలషిస్తాడు. షమీఉల్లా నిరాశావాది కాడు. సంయమి అనవచ్చు. కవిగా వస్తువును పాఠకుని ముందుకునెట్టడానికే షమీఉల్లా ప్రయత్నిస్తాడు. తన వాగాడంబరంతో వస్తువును తోసుకుని ముందుకు వచ్చి పాఠకునికి అయోమయం సృష్టించాడు.

ప్రశాంతతకు మారుపేరైన అనంతపురం జిల్లా గ్రామాలు గత నాలుగు దశాబ్దాలుగా ముఠాకక్షల గుడారాలుగా మారి ఇక్కడి ప్రజాజీవితాన్ని సంక్షోభంలోకి నెట్టుతున్నాయి. ఆధిపత్య ప్రదర్శనగా మొదలైన ఫాక్షనిజం ఆస్తుల విధ్వంసరూపం తీసుకొని, ఆస్తుల సంపాదన సంరక్షణల కోసం రాజకీయాధికార దశకు చేరుకుంది. ఈ దృశ్యాలనూ మానవత్వం ఉన్న కవి సహించడు.

ప్రాణప్రదమైన మా ఊరి రహదారి సిగలో
ఎవడు తుడిమినాడో మోపెడన్ని తూటాలు (పు. 34)

అన్నది కవి ప్రశ్న. గతకాలపు అనంత గ్రామానికి, నేటి

గ్రామానికీ మధ్య ఫాక్షన్ వల్ల వచ్చిన మార్పును ఈ కవి 'పరారీ' కవితలో ఆవిష్కరించాడు. ముఠాకక్షల వల్ల గ్రామాలలో ప్రజల కడగండ్లు ఎంత భయానకంగా ఉన్నయో కవి వర్ణించారు.

ఊరు అనాథై బోరున ఏడుస్తోంది (పు.53)

పెట్టుబడిదారీ వ్యవస్థ బలపడుతున్న కొలది మానవ సంబంధాలలో యాంత్రికత ప్రబలుతున్నది. ద్వంద్వ ప్రవృత్తి మనుషుల నైజామవుతున్నది. నిష్కల్మషమైన సమాజం కోసం కలలు కనే కవి ఈ పరిణామాన్ని సహించడం కష్టం. కవి డేగకన్నుతో నిరంతరం సామాజిక పరిణామాలను గమనిస్తూ మానవ ప్రవర్తనలోని వైపరీత్యాన్ని గుర్తించి కవితాబద్ధం చేస్తాడు.

విజానికి

శాశ్వతంగా నిత్యమాట

ఒక్కటుండదు

ఉన్నట్లుగోల (పు.24)

అని నిలకడలేని మనుషుల తత్వాన్ని వర్ణించాడు షమీఉ ల్లా

మనిషి ఆరోగ్యకరంగా ఉండాలంటే రెండు గుణాలుండాలి. అవి 1. ఆత్మవిమర్శ 2. విమర్శ. ఈ రెండూ ఒరిపిడి రాళ్ళ మీద మనిషి తనను తాను పరీక్షించుకోవాలి. అది ఉత్తమ వ్యక్తిత్వం. దీనికి భిన్నమైనది ఆత్మోత్కర్ష, పరనింద. ఇది మన వ్యక్తిత్వాన్ని దిగజారుస్తుంది. మందిలో పలచన చేస్తుంది. నిరంతరం ఇతరులను ఆడిపోసుకోవటమే తప్ప, తనను తాను నిప్పులకొలిమి మీద సానబట్టకోనివాడు మనిషికిండ లెక్కకాదు. షమీఉల్లా తన జీవనసమరంలో అనేక మందితో అనేక రకాల వాళ్ళతో సంబంధంలోకి రావలసివచ్చింది. ఆ క్రమంలో ఆయన మనుషుల స్వభావాలను గుర్తించాడు. 'అద్దం' కవిత రాశాడు.

"అద్దమంటే చచ్చేంత భయంనాకు" (పు.27) ఎందుకు మన నగ్న స్వరూపం బయటపడుతుంది. మన రంగు బయటపడుతుంది. మన నోరు మూతపడుతుంది. తన నోటికి తాళం వేయవలసి వస్తుంది. వ్యక్తిత్వ వికాసంలో ఆత్మవిమర్శ మొదటి మెట్టు. దీనిని గుర్తించమంటున్నాడు కవి. కవి మనుషులను విస్తరింపజేయడానికి, వికసింపజేయడానికి చేసే ప్రయత్నం ఇది.

సమాజంలో మనుషులు ఎవరికి వాళ్ళున్నట్లుగా కనిపిస్తారు. కానీ ఎవరూ ఇంకొకరి నుండి పూర్తిగా విడివడి బతకడం సాధ్యం కాదు. సమాజమంటే సమష్టి రూపం సమూహ చిత్రం. కవికి ఈ రహస్యం తెలుసు. అందుకే ప్రజాదృక్పథం గల కవి, ఎన్ని విమర్శలు చేసినా ఆఖరికి మనుషుల్ని కలపడానికే ప్రయత్నిస్తాడు.

వాళ్ళే లేకపోతే

ఆ క్షణమే

నేను లేకుండా పోయేవాణ్ణి (పు.83)

అని షమీఉల్లా తన సొంత విషయం చెబుతున్నట్లుగానే సమాజ సమష్టిస్వభావాన్ని ఆవిష్కరించారు. మానవ జీవితంలోని సహకార గుణాన్ని పట్టుకున్న కవే ప్రజాకవి.

కవి తాను నివసిస్తున్న సమాజాన్ని ప్రేమించాలి. సమాజాన్ని ప్రేమించడమంటే మనుషుల్ని ప్రేమించడమే. "దేశమంటే మనుషులోయ్" అని గురజాడ అన్నదిందుకే. మనుషుల్ని ప్రేమించడమే గొప్ప కవిత్వం. షమీఉల్లా మానవ ప్రేమికుడు... వ్యక్తిగాను, కవిగానూ...

రాకరాక వచ్చావు

అన్నంవేళ

అప్పుడే వెళ్తానంటావేం?

శుభ్రంగా చేతులు కడుక్కొని రా !

భోం చేద్దువుగాని. (పు.102)

ఇంకా ఆధునికత ఒంటబట్టని సామాన్యుని సంస్కారం ఇది. మనిషి మీద ఎంతో ప్రేమ ఉంటే తప్ప ఈ పిలుపు నోట్లోంచి రాదు. ఇలా అన్నంత మాత్రాన కవికి సమాజంలోని వైరుధ్యాలు కనిపించవని కాదు, చూడరాదనీ కాదు. కవికి సమాజంలోని వైరుధ్యాలు కనిపించకపోతే కవిత్వం దండగా.

వంచన వీరవిహారం చేసే

రంగభూమిలో

మనసు

ఈ శతాబ్దపు తొలిముద్దాయి (పు: 123)

కవి తన మనసును గురించి మాట్లాడుతున్నట్లు ఉన్నా, అది వ్యవస్థతో సంభాషణమే. మనిషి క్రమంగా పరాయీకరింపబడటాన్ని గుర్తించకపోతే ఆధునిక కవి అనిపించుకోలేదు.

ఎవడి కనుసన్నల్లోనో జీవిస్తున్నాను

ఎవడి ఆదేశాల మేరకు

తలవొంచి నడుస్తున్నాను (పు :121)

ఇదీ షమీఉల్లా ఆధునిక సామాజిక పరిజ్ఞానం

వర్గసమాజం జీవితాన్ని అల్లకల్లోం చేస్తుంది. ఎవర్నీ వదిలిపెట్టదు. సముద్రంలో కల్లోలంలా జీవితాన్ని మార్చేస్తుంది. కవి ఈ వాస్తవికతను గుర్తించాలి. జీవితం పూలపాన్పు కాదన్న అవగాహనను కలిగించాలి. జాగృతి గీతం పాడేవాడే ప్రజాకవి. 'సూర్యోదయానంతరం' కవిత షమీఉల్లా తనను, సముద్రాన్నీ తులనాత్మకంగా పోల్చి వర్ణిస్తూ అసమ సమాజం సృష్టించే జీవన కల్లోలాన్ని ప్రదర్శించాడు.

నిర్విరామ సంచలనాలు దానివి

వర్ణనాతీతమైన ఆటుపోట్లు నావి

ఎప్పుడూ యింతే (పు / 17)

ఏ కవికైనా ఒక ప్రాదేశికత ఉంటుంది. కవి ఎంత విశ్వజనీన భావాలు గలవాడైనా తన ప్రాదేశికతను విస్మరించదు. భారతదేశానికి స్వతంత్రం వచ్చినప్పుడు, ఆ సందర్భానికి గుర్తుగా అనంతపురం నడిబొడ్డున ఒక గడియారం స్తంభం నిర్మించారు. దాని ఎత్తు 47 అడుగులని అంటారు. అనంతపురంలో జరిగే ఉద్యమాలన్నీ దానిచుట్టూ తిరుగుతాయి. 'అనంత' చరిత్రకు ఆ స్తంభం మాట్లాడని సాక్షి. షమీఉల్లా అనంతపురం జిల్లా కవిగా దానిని కవిత్వీకరించాడు. స్థాణువులో చరిత్రను సాక్షిని చూడడం కళలోనే సాధ్యం. షమీఉల్లా 'అనంత' గడియార స్తంభాన్ని మానవీకరించాడు.

నాకు

మతం మాలిన్యం లేని

క్లాక్‌టవర్ జీవితమంటే

నిలువెత్తు స్థితప్రజ్ఞత్వం (పు: 112)

కవికి తాను నివసించే సమాజతత్వం అర్థంకాకపోతే, కవిత రాణించదు. మనం నివసించే సమాజం సంవృతా సమాజమా, వివృత సమాజమా కవికి తెలియాలి. వివక్షల సమాజం, ఎపుడూ మూసుకుపోయిన సమాజమే దానిని విమర్శించి, తెరుచుకున్న సమాజంగా మార్చడం కవి కర్తవ్యం. అందుకు కవికి కవిత్వమే ఆయుధం. షమీఉల్లా ఆర్థికంగానూ, సాంఘికంగానూ చిన్నచూపు చూడబడ్డ వర్గానికి చెందిన వ్యక్తి. అందుకే ఆయన ఈ కిటికీలు మూసిన ఇల్లువంటి సమాజాన్ని ఆహ్వానించటం. తలుపులు బార్లా తెరిచిన ఇల్లువంటి సమాజం ఆయన స్వప్నం.

పెద్ద తేడా లేదు

గడ్డికీ, నాకు (పు: 18)

అన్న స్పృహ ఆయనకుంది.

మూసిన తలుపులు మూసినట్టే ఉన్నాయ్

తలుపులు కిటికీలు బార్లా తెరిస్తే కదా!

శుభ్రంగా ఊడ్చి

నీళ్ళు చల్లి కడిగేందుకు వీలవుతుంది

గాలి, వెల్తురు

సోకకపోతే

ఏ గదైనా

ఇలాగే ఉంటుందేమో! (పు.20)

మూసిన గదివంటి సమాజం తెరిచిన గదివంటి సమాజంగా మారాలంటే ఏ మహిమల వల్లా సాధ్యం కాదు. ఉద్యమాల వల్ల తప్ప, అందర్నీ గురించీ కవిత్వం రాసే కవి తనను గురించి రాయకుండా ఉంటాడా! తన జాతిని గురించి రాయకుండా ఉంటాడా! ముస్లిముల పేదరికానికీ, అత్తరు వాసన గల సంబంధాన్ని షమీఉల్లా ఒక కవితలో చిత్రించాడు.

అత్తరు వాసన

అవినాభావ సంబంధమేదో ఉండాలి (పు:57)

ఒక కళాకారుడు, సాటి కళాకారుని పట్ల స్పందించకుండా ఉండలేడు. కవి షమీఉల్లా గాయకుని గురించి 'అతడి పాట' రాశాడు. అద్భుతమైన కవిత. ఒక పాట కవిలో సృష్టించిన ప్రకంపనల్ని షమీఉల్లా పారవశ్యంతో చిత్రించాడు.

పాటలో

వీరుల్ని

సంకెళ్ళు కరచిన వైనం చూశాను (పు:96)

బహుశా ప్రజాగాయకుల గానం విని కవి పొందిన ఆనందం ఈ కవిత. తెలుగులో కళాకారులను వస్తువుగా చేసుకొని వచ్చిన కవిత్వం పుష్కలంగా ఉంది. అందులో

# మట్టి పరిమళం..!!

- యు.ఎల్.ఎన్. సింహా
7702280542

నడవడం నాకిష్టం
మట్టి నేలమీద
మురిపెంగా అడుగుల్ని కదిలిస్తూ...!!

ఎందుకంటే
ఆ నడకలో రైతోడ్చిన
చెమట చుక్కల తడిదనముంటోంది
ఆ అడుగు జాడల్లో
కష్టజీవుల కన్నీటి జల్లులుంటాయ్
ఆ మట్టి రేణువుల్లో
నా చిన్ననాటి
ఆట పాటల బాణీలుంటాయ్
ఆ మట్టి వాసనలో
మనిషితనపు
మానవత్వపు ఆనవాళ్ళుంటాయ్
ఆ మట్టి స్పర్శలో
అమ్మ చేయి తాకిన
అనుభూతులుంటాయ్



ఆ మట్టి పలకరింపులో
నాన్న అరచిన
ఆత్మీయ అరుపులుంటాయ్
ఆ మట్టి రాగంలో
ఊయలమ్మ పాడిన
జోలపాటలుంటాయ్
ఆ మట్టి సరిగమల్లో
అమ్మతనాల
సాహిత్యమొకటి అవగతమౌతోంది
ఆ మట్టి పదనిసల్లో
జీవితాన్ని బోధించే భావాలుంటాయ్
సరిగ్గా చూడాలంతే
అలసిపోయిన మనిషి చివరాంకంలో
అమ్మ ఒడిలా మారి
ఆ మట్టి ఎదురు చూస్తూనే ఉంటోంది
పరిమళమై అల్లుకుని సేదతీర్చాలని...!! ◆

---

నిస్సందేహంగా ఈ కవిత చేరుతుంది.

"అనుభవాలకేం కొరత లేదు" (పు : 47)

అన్నాడు షమీఉల్లా. ఎనిమిదేళ్ళ క్రితం 2011లో వచ్చిన ఆయన కావ్యం "సూర్యోదయానంతరం" ఇది షమీఉల్లా జీవితానుభవాల పేటిక. ఆయన గొడవ మాత్రమే కాదు, ఆయన కాలపు సమాజ గొడవ ఈ కావ్యం. హాయిగా చదివిస్తూనే, నెమ్మదిగా ఆలోచింపజేస్తుంది ఈ కావ్యం. సూర్యోదయమంత అందమైన "నవసమాజం సూర్యోదయానంతరం" కావ్యం ఆకాంక్షిస్తున్నది.

జాలిచూపుల మార్దవాలు
నన్నెప్పుడూ జో కొట్టలేవు
ఆలోచనల కరవాలాలు
అనుభవాల ఆకురాయి మీద
పదునెక్కుతాయి. (పు.107)

అన్న ఆత్మగౌరవమే కాదు, ఆత్మస్థైర్యమూ, ఆత్మవిశ్వాసమూ ఈ కవికి ఉన్నాయి. షమీఉల్లా కవిత్వం జీవితం మీద నమ్మకాన్ని కలిగిస్తుంది. ధైర్యాన్నిస్తుంది. పోరాటం నేర్పుతుంది. స్నేహం పెంచుతుంది. గుంపుదృష్టి కలిగిస్తుంది.

షమీఉల్లా కవిత్వంలో రూపపరమైన బరువు ఉండదు. అట్లని అది పేలవమైన వచనం కాదు. షమీఉల్లాకే సాధ్యమైన అభివ్యక్తి ఈ కావ్యంలో ఉంది.

చుట్టూరా
చూపుల ఫిరంగుల్ని సిద్ధం చేసి
ఒక్కొక్కరే లేచి మాట్లాడుతుంటారు (పు. 41)

ఉద్యమ దశల చిత్రణ ఇది. ఆయన భావుకత ఇలా ఉంటుంది. రాయలసీమ నుండి తెలుగు వచన కవితకు ఈ ప్రతినిధి షమీఉల్లా

ఇప్పుడు మా ఊరిదేదారంటే
ఒక నకిలీ సోయగం (పు. 34) ◆



# రథచక్రాలు - మహీధర రామమోహనరావు

- గనారా
99492 28298

సంస్కరణోద్యమాలను వెనక్కునెట్టి స్వాతంత్రోద్యమ ఆకాంక్ష ముందుకు వచ్చింది. 1930 నాటికి గాంధీ నాయకత్వం స్థిరపడింది. మరోపక్క అంబేద్కర్ నిమ్నజాతుల ప్రతినిధిగా రంగంలోకి వచ్చారు. బ్రిటీష్‌వారు వెళ్ళిపోతే ఈ దేశంలో తామే వ్యాపారం సాగించాలని ఆశించే పారిశ్రామిక వర్గం స్వాతంత్ర్యోద్యమంలో చురుకుగా పాల్గొంది. పారిశ్రామికీకరణ ఆశించే మేధావివర్గం, సాంస్కృతిక, సాహిత్య రంగాలలో పాశ్చాత్య భావజాలాన్ని ఆహ్వానించాయి.

మరోపక్క రష్యాలో సోషలిస్టు ప్రభుత్వం ఏర్పడడంతో చాలామంది ఉద్యమకారులు అటు చూడడం మొదలుపెట్టారు. కాంగ్రెసులో మొదటితరం నాయకత్వంలో అతివాదులు, మితవాదులు ఉన్నారు. కమ్యూనిస్టు భావజాలం వ్యాప్తిలోకి వచ్చి, తెలుగునాట పార్టీ నిర్మాణం మొదలైంది. ఈ దశలో కాకినాడ, రాజమండ్రి, అమలాపురంలోని విద్యావంతులు కమ్యూనిజం పట్ల ఆకర్షితులు అయ్యారు. అలా రూపుదిద్దుకున్న పాత్ర సత్యానందానిది. విద్యార్థిగా కమ్యూనిస్టు భావాల వైపు మళ్ళినవాడు విశ్వం. ఈ నవల మొత్తం ఈ రెండు పాత్రల వైపు నుండే నడుస్తుంది. సనాతన భావాలు కలిగిన బ్రాహ్మణ వర్గం వారిది.

'లంకమాలపల్లి' పూచిక పుల్ల కూడా మిగలకుండా కాలిపోయింది. ఈ సంఘటన కీలకంగా నవల నడుస్తుంది. జమిందారు తమ పూర్వపు హక్కును నిలుపుకోవటం కోసం ప్రయత్నం మొదలవుతుంది.

సత్యానందం, ప్రకాశం, మరియమ్మ మరి కొంతమంది మంటలు ఆర్పుతారు. ప్రక్కనున్న అగ్రహారానికి మంటలు వ్యాపించకుండా జాగ్రత్తలు తీసుకున్నారు. ఎంతో పేరు ప్రతిష్ఠ ఉన్న గ్రామం అస్పృశ్యులు అడుగుపెట్టరాదు, చెరువులో చెంబుడు నీళ్ళు తీసుకోవడం నిషేధం. గుక్క తిప్పకుండా ఉపన్యాసాలు ఇచ్చే కాంగ్రెస్ నాయకులకు కూడా మాలవాళ్ళు ఎప్పుడూ, 'మాలలే' 'హరిజనులు కానే కారు' అనే చోట ఎంతో మార్పు వచ్చింది. మాలపల్లి అగ్ని బాధితులను సత్యానందం అతని సన్నిహితుల సహకారంతో తన తోటలో నెలరోజులు చోటు ఇచ్చి ఆదుకుంటాడు.

1944లో సత్యానందం జైలు నుంచి వచ్చి గ్రామంలో అభివృద్ధి కార్యక్రమాలు చేస్తాడు. రోడ్లు వేయించడం, వీధుల్లో దీపాలు, రేవులో మంచినీళ్ళు తెచ్చుకునే వీలు కలిగించాడు. మాలవాళ్ళు చదువుతారేమోనని మూసిన గ్రంథాలయం తెరుచుకుంది. ఈ అభివృద్ధి కార్యక్రమాలకు యువకులు రోడ్లు, భవనం నిర్మించడానికి కాంట్రాక్టు తీసుకుంటారు. అతనిలో కార్యనిర్వాహణ దీక్ష కాంగ్రెస్ సంపర్కంతో బలపడింది.

కాంగ్రెసు నాయకుడు, రైసుమిల్లు యజమాని పద్మానాభంకి జానకి చెల్లెలు, సత్యానందంకి మరదలు. జానకి

కాలిపోయిన గ్రామానికి ఆహారం ఏర్పాటు గూర్చి అందరిని కార్యరంగంలోకి దింపింది. సత్యానందం భార్య భద్ర కూడా సహకరిస్తుంది. కాని గ్రామాల్లో కాంగ్రెసు పేరుతో బ్రతికే నాయకుల అరాచకాలు చాలా ఉంటాయి.

ఇక్కడ కమ్యూనిస్టులు ప్రాబల్యం బాగా పెరుగుతుంది. మరియమ్మ ఒక కమ్యూనిస్టు. అక్కడ కమ్యూనిస్టులు రాత్రి పాఠశాలలు చదువుతారు. మాలమాదిగల్లో విజ్ఞానం పెరుగుతుంది. ఆ కార్యం వెనక ఎంత ప్రయోజనం ఉందో ప్రజలు గ్రహిస్తారు.

సుబ్బారావు కమ్యూనిస్టు. స్థానిక కార్యకర్త. సత్యానందంతో 'ప్రజాశక్తి' చందా కట్టిస్తాడు. ఈ క్రమంలో కమ్యూనిస్టుల ఆదర్శం, స్త్రీ పురుష సంబంధాలు, ధర్మాల పట్ల, మతం పట్ల కమ్యూనిస్టులకు ఉన్న అవగాహన కాంగ్రెసుకు లేదని గ్రహిస్తాడు సత్యానందం. గ్రామం పునఃనిర్మాణానికి కాంగ్రెసువారు, కమ్యూనిస్టులు కూడా ప్రజల దగ్గర విరాళం వసూలు చేస్తారు. కాంగ్రెసువాళ్ళు ముఖ్యమంత్రి ఆహ్వానానికి ప్రాధాన్యం ఇచ్చి అనేక మెలికలు పెడతారు. కాని కమ్యూనిస్టు కార్యకర్తలు కాంగ్రెసు కార్యకర్తల్ని కలుపుకుపోవాలని ప్రయత్నిస్తారు.

సత్యానందం 'కమ్యూనిస్టులంటే ప్రజలు అభిమానం చూపడానికి కారణం? మరియమ్మతో అంటాడు. ఇద్దరి మధ్య సుదీర్ఘమైన చర్చ జరుగుతుంది. కమ్యూనిస్టుల త్యాగం, ప్రజల పట్ల వారికి ఉన్న అవగాహన, ఏ విషయంలోనైన మూలాలకు వెళ్ళి చర్చించడం ద్వారా వారిని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తాడు.

సత్యానందం 'రాజకీయంగానే కాక, సామాజికంగా కూడా దేశం విముక్తి పొందాలని కాంగ్రెసు ఆశయం. కాంగ్రెస్ చేస్తున్న పనులన్ని మీ దృష్టిలో వంచనయేనా?' అని నిలదీస్తాడు.

మరియమ్మ 'ఆర్థికంగా మాకున్న బలహీనతని పోగొట్టగలిగినప్పుడే... ఎవ్వరనన్నా వృద్ధికి తేగలుగుతారు' అంటుంది.

సత్యానందం ఆమెను రెచ్చగొట్టడం ద్వారా చాలా చర్చ లేవదీసాడు. చాలా విషయాలు అర్థం చేసుకోగలిగాడు.

గతంలో పేదప్రజలపైన జరిగిన నిర్బంధాలు, వారి భూమి ఆక్రమించుకున్నది కూలీ దగ్గర అన్యాయాలు. బ్రిటీష్ అధికారుల భయంకర నిర్బంధ చర్యని ఒక్కొక్కటిగా వివరిస్తుంది. 1930 కి పూర్వం ఆ అగ్రహారం వీధిల్లోకి మాల మాదిగల్ని రానివ్వని చరిత్ర ఏకరువు పెట్టింది.

సత్యానందం, మరియమ్మ ఉద్దేశాన్ని గ్రహించాడు. బ్రిటన్ ఈనాడు ఉన్న సమాజపద్ధతుల్ని మార్చదని గ్రహించాడు.

సత్యానందం మిత్రులలో అనేకమంది వ్యాపారస్తులు కుల మత, ఆచారాన్ని పాటించేవారు. భూస్వాముల ప్రక్క నేనిలబడి సలహా ఇచ్చేవాళ్ళు ఉన్నారు. వారిని గమనిస్తూనే ఉన్నాడు.

గాంధీపై అపారనమ్మకం ఉన్నవాడు కావడం వల్ల క్రమంగా అన్యాయమైన పద్ధతుల్ని ఎదురించలేకపోతాడు.

విశ్వం దివాను కొడుకు విద్యాభ్యాసం వదలి ఉద్యమంలో చేరి అజ్ఞాతంలో ఉంటాడు. దివాన్ని కలసి పేదల భూముల గూర్చి, మాలపేట ప్రజల స్థలం గూర్చి మాట్లాడటానికి వెళతాడు. అక్కడ ఎవ్వరూ అతన్ని గుర్తించరు.

పనివాళ్ళకు సరైన జీతాలు ఇవ్వకుండా కూడబెట్టిన సంపదతో మదరాసులో కార్లలో తిరగడం, ప్రజల నోరూ, కడుపు కొట్టి సంపాదించింది కుక్కలకు, గుర్రాలకు ఖర్చు చేస్తుంటారు. జమిందార్ల ఆడంబరాలు అతనికి తెలుసు.

దివాను రాక గూర్చి చూస్తున్న విశ్వానికి ప్రకాశం అనే వయస్సు మళ్ళిన గుమస్తా వస్తాడు. విశ్వాన్ని చూసి గుర్తుపట్టి లోపలికి రమ్మంటాడు. 'ఇళ్ళు వదలి ఉద్యమంలోకి వెళ్ళినప్పటి నుంచి తల్లిదండ్రులు ఎదురుచూస్తున్నారని' నచ్చ చెప్పడానికి ప్రయత్నిస్తాడు. విశ్వం ఎదుట పడటానికి అంగీకరించడు. తను పేదల ప్రతినిధినని చెబుతాడు. 'దివాను తండ్రి అని అనుకోవడం కన్న 'దివాను' గానే చూస్తాను' అంటాడు.

గుమస్తా ప్రకాశరావు కుటుంబంతో సంధి నెరపాలని చూస్తాడు.

"బంధుత్వాల విషయంలో అభిప్రాయం వేరు. పుట్టుకతో బంధుత్వం ఏర్పడుతుందని మీ దృష్టి సమానాశయాలు, ఆదర్శాలు, సద్భావం బంధుత్వాన్ని గుర్తిస్తాయని నా అభిప్రాయం.

"స్నేహితులు"?

"నా పేరు కూడా వాళ్ళకు తెలియపోవచ్చు. అయినా దగ్గర బంధువులు కన్న ఎక్కువ ఆదర్శం, ఆత్మీయత ప్రేమ చూపించేవారు. ఈరోజున చూస్తే ఒకరి నొకరం గుర్తుపట్టడం కూడా అసాధ్యం. కాని, నాకు చిన్న కష్టం వచ్చిందంటే... తెలుగుదేశంలోనే కాదు, ప్రపంచంలోని వేలాది కుటుంబాలు కంట నీరు పెడతాయి..."

నేనొక పార్టీ సభ్యుణ్ణి. నా పేరు, నా రూపం ఎరక్కపోయినా ప్రపంచంలోని లక్షల కుటుంబాలు ఎక్కడో ఒక వ్యక్తి తమతో పాటు కష్టనష్టాలతో పాటు నిలబడి పోరాడుతున్నాడని ఎరుగుదురు. ఆందోళన చేస్తారు. ముక్కు

మొగం ఎరుగని మా కోసం లాఠీ దెబ్బలకు గురి అవుతారు.

విశ్వం ఆశలు, ఆశయాల పట్ల నిబద్ధుడు అయి, ఇల్లు విడిచి ఉద్యమంలోకి పోయినవాడు, తిరిగిరాడని తెలిసిన తరువాత విశ్వానికి భార్య అని నిర్ణయించిన భద్రను సత్యానందానికి ఇచ్చి పెళ్ళి చేస్తారు. అతనికి ఆ ఒక్క ఆశ కూడా నశించి, మరింత దూరం పెరుగుతుంది.

దివాను గదిలో వచ్చినప్పటికి కొడుకు మొహం చూడలేదు. లంకమాలపల్లి గూర్చి మాట్లడటానికి వచ్చిన రాయబారనుకుంటాడు. విశ్వం కూడా తన మాలపల్లి ప్రతినిధిగానే ప్రవర్తిస్తాడు. దివాను సమస్య పరిష్కారానికి అంగీకరించడు. "మా ప్రయత్నలోపం ఉండకూడదనే వచ్చాను"

"బెదిరిస్తున్నావా!" అంటాడు.

"మీ ఇష్టం వచ్చినట్లు అర్థం చేసుకోండి. సెలవు" తన ముఖం చూపించకుండానే విశ్వం వెనుదిరిగాడు.

పనివాడు లచ్చన్న ద్వారా కొడుకు రాక తెలుసుకుంది దివాను భార్య. రెండో కొడుకు సీతాపతి. అన్నగారు వచ్చిన సంగతి తండ్రిని ప్రశ్నిస్తాడు. దివాన్ ఆశ్చర్యపోతాడు. కుటుంబం అంతా నిరాశతో కలత పడుతుంది.

భద్ర పినతండ్రి కూతురు జ్యోతి. విశ్వం కాకినాడ వచ్చి దివానుతో అతని వాదనలు వినిపించినప్పుడు కొడుకును గమనించక విశ్వం విన్నపాన్ని తిరస్కరించినట్లు అగ్రహారానికి ఉత్తరం వ్రాసింది.

తరువాత విశ్వం సరాసరి ఆగ్రహారంలో సత్యానందం ఇంటికి వెళ్ళి పిలిచాడు. లోపల నుంచి భద్ర గొంతు వినిపించింది. 'మనస్సు ఉద్వేలితం అయింది. తుఫానులో ఆకుల మాదిరిగా ఆలోచనలు గిలగిలలాడాయి. ఆ భయమే అతని ఇంతకాలము ఈ ఇంటిఛాయలకు రాకుండా చేసింది. గ్రామాలలో పెరుగుతున్న కక్షలను కాంగ్రెసు-కమ్యూనిస్టు తగాదాలుగా చూడగూడదని కాంగ్రెసు వాదులతో సంబంధం పెట్టుకోవడానికి ఆటంకంగా తన గత సమస్యలు ఉండకూడదని విశ్వం ఆలోచన. దీనివల్ల రాజకీయంగా సానుభూతిపరులు దూరం కాకూడదని తలుస్తాడు.

విశ్వం, తన భార్య భద్రవైపు బంధువు అని సత్యానందానికి తెలుసు. గతంలో తన ఇంటికి ఆహ్వానించాడు. అంతేకాదు కమ్యూనిస్టులతో తనకు ఇష్టమైన ఆలోచనలు పంచుకొని సామరస్యం నడపాలని సత్యానందం ఉద్దేశం. విశ్వం మంచివాడు. గౌరవం, అభిమానం సంపాదించుకున్న వ్యక్తి. తన ఇంటికి రావడం గౌరవంగా భావించాడు. భార్యను స్నానం భోజనం ఏర్పాట్లు గూర్చి మాట్లాడాడు.

జానకి అక్కడకు వచ్చింది. విశ్వం గుర్తుపట్టలేదు. 'విశ్వం భావే!' అనే స్పృహ ఆమెకు ఉంది. భోజనం ఏర్పాట్లు తిరస్కరించాడు.

'మామ్మగారు' వంట పూర్తి అయిందన్నారు' అంది జానకి. ఆమె ఎవరో సత్యానందం ఎరుగును. కమ్యూనిస్టు పార్టీ అంటే అభిమానమని. కాపు స్త్రీ, కన్నబిడ్డల వలె ఆదరించి 'లోకమామ్మ' అయింది.

విశ్వం జానకిని చదువుకోమని ప్రోత్సహించాడు. కనీసం ప్రాథమిక వైద్యం అన్నా నేర్చుకోమన్నాడు.

'లంకమాలపల్లి విషయం మాట్లాడటానికి వచ్చాను. దివాణం క్విట్ నోటీసులిచ్చారని విన్నాను' అన్నాడు విశ్వం, సత్యానందంతో.

అప్పటికే అక్కడకు వచ్చిన పద్మనాభం 'కమ్యూనిస్టుకి కాంగ్రెసువాళ్ళతో అవసరం ఏమిటి? ప్రశ్నిస్తాడు. అతని వికటపు ఆలోచనలు విశ్వం లెక్కజేయడు. సత్యానందం పద్మనాభం రాక, చర్చలో పాల్గొనడం, విశ్వాన్ని అవహేళన చేయడం ఇష్టం లేదు.

జమిందారు తన హక్కులు సాధించుకోవాలని చూస్తున్నారు. కాని అప్పటికే కోర్టు మాలపల్లెను చర్యల ద్వారా పరిష్కరించుకోవాలని సూచించింది. పద్మనాభం చర్చను పక్కకు లాగి వివాదగ్రస్థం చేస్తున్నట్లు 'విశ్వం', 'సత్యానందం' గ్రహించారు. ముఖ్యమంత్రితో రాయబారం నడపడానికి అభ్యంతరం లేదంటాడు. ఏ విషయంలోనైనా రాజీ లేదన్నాడు.

విశ్వం వెళ్ళిపోయాక భద్ర అన్నది.

'మనిషిలో ఏమీ మీర్పు లేదు. అదే పట్టుదల అదే మనిషి'

మరుసటి రోజు పాలేరు తెచ్చిన వార్తతో సత్యానందం భ్రాంతి చెందాడు.

'మీటింగుకు బయలుదేరిన విశ్వాన్ని ఎవరో కొట్టి చంపారని' భద్రకు చెప్పి ఓదార్చ ప్రయత్నించాడు. జానకికి కూడా విషయం తెలిసిపోయింది.

మాలపల్లికి వార్త పాకింది. ప్రజలు తిరగబడ్డారు.

జోగి అనేవాడితో మరో ముగ్గుర్ని చెట్టుకు కట్టేసారు. ప్రజలు తండోపతండాలుగా అక్కడకు చేరుకున్నారు. కొట్టి అవమానించారు. పద్మనాభం వ్యభిచారి, త్రాగుబోతు అయిన జోగి గూర్చి ఆత్రుతపడడం సత్యానందం సహించలేకపోతాడు.

డాక్టరు వచ్చి, విశ్వాన్ని అతన్ని కాపాడబోయిన వ్యక్తిని ఆసుపత్రికి తరలించాడు. ఠాణేదారు కాకినాడ నుంచి వచ్చి

నాలుగు రోజులు ఇక్కడే ఉన్నాడని తెలిసింది. తండ్రి కొడుకుపై హత్యాప్రయత్నం చేయించాడని అనుమానించింది భద్ర.

అనేక నాటకీయ పరిణామాలు మధ్య 'విశ్వం' బ్రతికి బట్టకడతాడు.

మరియమ్మ వచ్చి మాలపల్లెలో అరెస్టుల గూర్చి మగవాళ్ళని పట్టుకుపోవడం గురించి చెప్పింది. విశ్వనాథం ఠాణేదార్ల పాత్రను వివరించింది.

జానకి ఈ సంఘటనతో కలత చెంది, విశ్వం గాయపడడాన్ని, చచ్చిపోయాడన్న విషయాన్ని సహించలేకపోయింది. అక్కా బావ ఏమనుకుంటురోనని భయం ఉన్నా తన అభిమానం దాచలేకపోయింది.

సత్యానందానికి కాఫీ హోటల్‌లో సర్కిల్ ఇనస్పెక్టర్‌తో పద్మనాభం కనిపించాడు. సర్కిల్ ఇనస్పెక్టర్ కాంగ్రెస్‌వాది. కాంగ్రెసువారి ప్రాణరక్షణకు హామీ ఇచ్చాడు.

'బ్రాహ్మణ అగ్రహారంలో బ్రాహ్మణుల మీద కర్ర ఎత్తడం, ఉమ్మిపొయ్యగలగడం సహించరానిది' ప్రభుత్వానికి తమబోటు వాళ్ళు సహకరించాలని అంటాడు సర్కిల్.

'బ్రాహ్మణుడవై ఉండి' కమ్యూనిస్టులకు నువ్వు జామీనా?'

"రౌడీలకు కాంగ్రెస్ ముసుగు యిచ్చినాక నేను చేయగల మంచిపని ఏదైనా ఉంటే అదొక్కటే' అంటూ సత్యానందం విశ్వానికి మిగిలినవాళ్ళకి జామీను ఇవ్వడానికి వెళతాడు. జామీను వచ్చేవరకూ అమలాపురంలో ఉండిపోయాడు.

భద్ర పినతండ్రులు ముఖ్యమంత్రికి సన్నిహితులు. అందుకే సత్యానందం విశ్వాన్ని జామీను ఇప్పించడానికి భార్యను మదరాసు పంపుతాడు. సంశయించినప్పటికి భద్ర ఒకర్తే రాజమండ్రిలో ట్రైను ఎక్కి వెళుతుంది.

సత్యానందం వెనక్కు అమలాపురం బయలుదేరతాడు. రోడ్డు మీద జెండాల ప్రదర్శన చూసి ఆశ్చర్యపడతాడు. 'ప్రజలపై కేసులు ఎత్తివేయాలని, 'రౌడీలను శిక్షించాలని' నినదిస్తారు. కాంగ్రెసుపాత్ర ఈ సంఘటనలతో తగ్గిందని, కమ్యూనిస్టుల పాత్ర పెరిగిందని గ్రహిస్తాడు. పొలం వెళుతున్నప్పుడు మరియమ్మ సత్యానందం ఆలోచనల్ని తలక్రిందులు చేసింది.

కమ్యూనిస్టుల ఎత్తుగడలను రాజకీయంగా వివరిస్తుంది. కాంగ్రెసు వాదులతో కానివ్వండి, మరొకరితో కానివ్వండి, సహకరించాలనేది ప్రజా ఉద్యమం చంపేటందుకు కాదు, దానినింకోమెట్టు ముందుకు తీసుకుపోవడానికే... ప్రజలు ప్రమాదానికి గురికాకుండా కనువిప్పు కలిగించేందుకే అంటుంది. అందుకే ఈ ఉద్యమంలో కాంగ్రెసును కలుపుకోవడం అన్నది ఆమె వాదన. మరియమ్మ సత్యానందం ఆలోచనలను విస్తృత పరుస్తుంది.

మదరాసు మెయిల్‌లో దిగిన భద్రను పినతండ్రి కొడుకు కలుసుకుంటాడు. ఆ బండిలోనే జమిందారు కుటుంబం కూడా దిగుతుంది. మేనత్త భద్రని కన్నీళ్ళతో కౌగిలించుకుంటుంది. మేనమామ అయిన జమిందారు భద్రను కుశలం అడుగుతాడు. దూరంగా 'హిగ్గన్‌బాథమ్' బుక్‌స్టాలు వద్ద నిలబడి ఉన్న యువకుణ్ణి చూసి దగ్గరకు వెళుతుంది. అతను తలఎత్తి చూస్తాడు విశ్వం. భద్రం పలకరించేలోగా అతని స్నేహితులు పిలిస్తే వెళ్ళిపోతాడు. జబ్బ మీద కట్టు, తలకు పట్టి ఉండి, మనిషి బాగా నలిగిపోయి ఉంటాడు.

భద్ర ఈ విషయం మేనత్తకు కూడా చెప్పదు. 'తన పెళ్ళి విషయంలో అందరూ తొందర పడుతుంటే మగడికి తాళం వేసింది. ఫలితంగా 'విశ్వం' దూరం అయ్యాడు'. మెల్లగా దివాను దంపతులకు, మిగిలినవారికి 'విశ్వం' గూర్చి తెలియపరచింది. అతనిపై హత్యా ప్రయత్నం మీదే అని నిందిస్తుంది. తమపాత్ర లేదని జమిందారు దుఃఖిస్తాడు.

విశ్వం ముఖ్యమంత్రిని కలిసి గ్రామంలోని భూముల విషయం అరెస్టుపై చర్చించాలని పార్టీ ఆఫీసు నుండి బయలుదేరి వెళతాడు. అగ్రహారం నియోజకవర్గం నుండి ఎన్నికైన తిరుపతిరావును తీసుకొని ముఖ్యమంత్రి వద్దకు వెళ్ళాలని ఆలోచన.

ఒక పక్క నలుగురైదుగురు మిత్రులతో కబుర్లు చెప్తుతున్న తిరుపతిని చూస్తాడు. అతను ఇలా వెటకారం చేసాడు.

'ఇదిగో కమ్యూనిస్టు ఇలా వచ్చారేమిటి?' పైగా మాలపల్లి గ్రామంలో ప్రధాన నాయకుడని వేళాకోళం చేస్తాడు.

ముఖ్యమంత్రి పర్మిషన్ దొరుకుతుంది.

పది నిమిషాలు వ్యవధి ఇస్తాడు.

జమిందారు, గూండాలు దౌర్జన్యాలు మాట రాగానే ముఖ్యమంత్రి ముఖం కఠినం అయింది.

'శాంతిభంగం కలగకుండా ఆ చర్య తీసుకోవడం ప్రభుత్వానికి అవసరం అయింది.'

'మాలపల్లి ప్రజలు కారకులు గాని కలహాన్ని చూపించి... కేసులు పెట్టడం. 145 సెక్షనునుపయోగించి వాళ్ళ పెళ్ళాం పిల్లలను ఇళ్ళల్లో వుండకుండా లేవగొట్టడం ఇది అన్యాయం కాదా?... ఇది నాగరికం అనుపించుకొనే ప్రభుత్వం వుండగా జరగవలసిందేనంటారా?'

"ఆలోచిద్దాం"

విశ్వం అక్కడ నుండి బయటపడతాడు. మరుసటి రోజు

పార్టీ ఆఫీసులో ఉన్న విశ్వాన్ని పోలీసులు అరెస్టు చేస్తారు. ప్రశ్నించినందుకు లాఠీలతో కొడతారు. విశ్వం స్పృహ తప్పి పడిపోతాడు. లారీలో పడేసి లాకప్‌లోకి ఈడ్చుకుపోయారు. పట్టణంలోని పత్రికలు కూడా రెండు కాలముల శీర్షికలిచ్చి వార్త ప్రకటించాయి.

విశ్వాన్ని జామీనుపై ఇంటికి తీసుకువచ్చారు. కొడుకు కష్టం చూసి అందరూ కన్నీళ్ళపర్యంతం అవుతారు.

◆◆◆

పంటలు చేతికి వచ్చాయి. పశువుల మేతకు జనుము చల్లాలి. విత్తనాలు దొరకక రైతు పరుగులు పెడుతున్నారు.

ఇరవైరెండు రూపాయలు ఉన్న జనుము కంట్రోలు ధరకు ముప్పై ఐదు అయింది. దొంగ బజారులో అరవై. వ్యాపారస్తులు రైతు మొహం చూడటం లేదు. గ్రామాల్లో ఎక్కడ చూసినా అదేచర్చ. విత్తనాల వేట. కాంగ్రెసు నాయకులు సరుకు దాచి బ్లాకుమార్కెట్టు చేస్తున్నారని అర్థం అయింది. ఈ విషయంపై సత్యానందం కూడా అనుమానిస్తున్నాడు. దాచిన సరుకు 'విశ్వనాథం' అనే కాంగ్రెసు నాయకుడిదని తెలిసి పోలీసులకు పట్టించారు. కాంగ్రెసు పాలనలో అవినీతి అందరికి తేటతెల్లమైంది.

సత్యానందం జీవితంలో కనువిప్పు కలిగిన సంఘటన. జనప విత్తనాలు పట్టుకున్న రోజులోనే జ్ఞానోదయం అయింది. 'వ్యక్తి స్వాతంత్ర్యానికి, సమాజ జీవితానికి కమ్యూనిస్టులు నిత్యము చెప్పే ఘర్షణకు రాజీ పరిష్కారాలకి మధ్య అతలాకుతులం చేసిన ఆలోచనలన్ని మంచు విడిపోయినట్లు విడిపోయాయి. విశ్వనాధానికి పోలీసులు చేసే సకల మర్యాదలు చూసి ఆశ్చర్యపోయాడు. పైగా అతన్ని ఆసుపత్రిలో ఉంచికొని రోగిగా నటింపజేసారు.

ప్రజల్లో తీవ్రమైన అలజడి ఏర్పడింది. గమనించిన ప్రభుత్వం అదనపు బలగాలను, మలబారు పోలీసులను దింపారు. కవాతులు జరిపారు. ప్రజల్లో భయం కలిగించేందుకు పెద్ద 'కేంపు' వేసారు.

నబ్బన్నశెట్టి, షావుకారు, జగన్నాథం లాంటి కాంగ్రెసువారు పోలీసులకు కావలసిన మర్యాదలు, సౌకర్యాలు పంచుకున్నారు. కొంత సరుకు పోలీసులు దగ్గర ఉండి విత్తనాలు అమ్మించారు. కాని, విశ్వనాధంలాంటి పలుకుబడి కలిగినవాళ్ళను వదలిపెట్టారు. సరుకు దొరుకుతుందని ప్రజలకు తెలిసి పెద్దఎత్తున స్టోరు వద్దకు వస్తారు. ఒక రైతును పోలీసులు కొట్టడంతో పరిస్థితి ఉద్రిక్తంగా మారింది. పోలీసుల హెచ్చరికలు, లాఠీఛార్జీ జరిగింది. సత్యానందం ఈ దౌర్జన్యాన్ని సహించలేకపోతాడు. పిరికిగా పారిపోవద్దని చెప్పి 'దౌర్జన్యాన్ని హింసతో ఎదిరించినా, తప్పులేదని' గాంధీ వాక్యాలు చెబుతాడు.

కేకలు విని బయటకు వచ్చిన 'జానకి' పోలీసుల చేతిలో దెబ్బలు తింటున్న రైతుల్ని ఆదుకోవడం గూర్చి ఆలోచించింది. ఆమెకు దెబ్బ కూడా తగిలింది. పారిపొమ్మని ఎవ్వరో హెచ్చరిక చేస్తారు. ఇంట్లోకి పారిపోతుంటే పోలీసు వెంబడిస్తాడు. చేతిని కొరికి గాయపరిచి, బిందెతో కొట్టి, గోడదూకి పారిపోతుంది. దగ్గరలో ఉన్న కమ్యూనిస్టు సానుభూతి పరురాలైన కాపుల ఇంటిలో తల దాచుకుంటుంది. అక్కడ తన ఆచార వ్యవహారాలు వాళ్ళ ఆదరణ ముందు నిలవలేదు.

దెబ్బ తిన్న ఉద్యమకారుల్ని ఆసుపత్రిలో ఉంచి డాక్టరు వైద్యం చేస్తాడు. అతను కమ్యూనిస్టు సానుభూతిపరుడు. సత్యానందాన్ని జానకి గూర్చి ఆందోళన పడవద్దు సురక్షితంగా ఉందని చెబుతాడు.

'ఒక సాంఘీక వ్యవస్థని, దానిని కాపాడే ప్రభుత్వాన్ని ధ్వంసం చేయడం, ఎదుర్కోవడం వ్యక్తుల పట్ల అయ్యే పని కాదు. ప్రయోజనం లేదు. ఆ మార్పు తీసుకురాగలది సమాజమే...' సత్యానందానికి కమ్యూనిస్టుల తార్కిక వాదాన్ని డాక్టరు వివరిస్తాడు.

జానకి పోలీసుల కంట పడకుండా మదరాసు చేరుతుంది. భద్ర విశ్వానికి సపర్యలు చేయడానికి దగ్గర ఉంచుకుంటుంది. విశ్వం జానకి సన్నిహితులవుతారు. విశ్వం జానకిని ఇష్టపడతాడు.

ఈ క్రమంలో నత్యానందం కమ్యూనిస్టు సానుభూతిపరుడై స్వగ్రామంలో వ్యవసాయం చేసుకుంటాడు. విశ్వం తిరిగి ఉద్యమం బలోపేతం చెయ్యడానికి మాలపల్లె అగ్రహారం చేరతాడు.

ఆనాటి సమాజం సనాతన ధర్మాల నుంచి సంస్కరణల దశను దాటుతూ రాజకీయం వైపుకు జరుగుతున్న కాలం. ఆర్థిక, సామాజిక మార్పులుతో ప్రపంచం మొత్తం ఒక కుదుపుతో ముందుకు పోతున్న దశను మనం గమనించవచ్చు.

దీని తరువాత 'ఓనమాలు' (మహీధర రామమోహనరావు), అంతకు పూర్వం వెలువడిన 'మాలపల్లి' (ఉన్నవ లక్ష్మీనారాయణ), 'అతడు ఆమె' (ఉప్పల లక్ష్మణరావు) నవలలు జాతీయోద్యమంనాటికి కోస్తాంధ్రలో వచ్చిన సాంఘిక ఆర్థిక మార్పులు, కమ్యూనిస్టు ఉద్యమాలకు పునాదిగా ఎలా ఉన్నాయో మనం అవగాహన చేసుకోవచ్చు.

◆

# పెద్దమ్మ గారి కల్లం

- వి. వెంకట్రావు
9247235401




"హలో..! ఒరే ! భాస్కర్ ! భోగాపురంలో చిన్న బేంక్ పని వుంది వస్తావా? ఈ వాళ శెలవు పెట్టినట్లున్నావు?" అన్నాడు రమణ.

కాసేపు ఆలోచించి.. "సరే!" అన్నాను. పుట్టిందీ, పెరిగిందీ, చదువుకున్నదీ అంతా విజయనగరమే. ఉద్యోగం కూడా ఇక్కడే. కానీ, తరవాత కాలంలో బదిలీ మీద గుంటూరు వెళ్ళిపోవలసి వచ్చింది. అక్కడా, ఆ చుట్టుప్రక్కల దాదాపు ఇరవై ఏళ్ళు గడచిపోయాయి. మళ్ళీ ఇక్కడకు వచ్చి, ఆరుమాసాలయ్యింది. వచ్చిన దగ్గరనుండీ భోగాపురం వెళదామనే వుంది. నా భార్య లక్ష్మితో కూడా రెండు, మూడుసార్లు అన్నాను కూడా. భోగాపురంలో మా పెద్దమ్మ కుటుంబం వుండేది. అక్కడే, రెండో, మూడో ఎకరాల పొలం. మా అమ్మమ్మ ఊరు కూడా అదే కావడం వలన, ఆ ఊరుని వదలడం ఇష్టం లేక, కాకినాడలో వున్న మా మావయ్య దగ్గరకు కూడా వెళ్ళేది కాదు మా అమ్మమ్మ. పెద్ద కూతురుని వున్న ఊర్లోనే ఇచ్చి, తను కూడా అక్కడే వుండేది. నా చిన్నతనంలో సెలవుల్లో భోగాపురం వెళ్ళడం, అక్కడే వారం పది రోజులుండడం, ఆ వీధులూ, కల్లాలు అన్నీ తిరగడం గొప్ప అనుభూతి. ఎంత వెళ్ళాలని వున్నా, ఏవేవో పనుల వలన కుదరడంలేదు. అందుకే, రమణ ఫోన్లో భోగాపురం వెళ్దాం అనే సరికి "సరే" అన్నాను. నేనూ, కాలూరి రమణా, వంగవోలశంకర్రావు చిన్నప్పటి స్నేహితులం. రమణ ఇదే వూర్లో వ్యాపారం చేసుకుంటున్నాడు. నేను ఆలోచనల్లో వుండగా, రమణ వచ్చాడు. నేను బైక్ వెనకాల కూర్చున్నాను. భోగాపురం అనే సరికి మా ఫ్రెండ్ వంగవోల శంకర్రావు మాటలు గుర్తుకు వచ్చి, గతంలోకి జారిపోయాను.

'మా విజీనగరానికి భోగాపురం ఇరవై మైల్లుంటుదేమో? వుంటే, గింటే రెండు మూడు మైల్లు ఎక్కువుంటే ఉండొచ్చు. "ఒస్ ఈ మాత్రం దానికేనేటి పెద్ద కెంపేల్లినట్లు తెగ ఇదైపోతున్నావు." అననీవోడు మా వంగావోల శంకర్రావు.

"మరి మా భోగాపురం అంటే ఏటనుకున్నారు" అనీ వోన్ని.

ఎండాకాలం వొచ్చిందంటే సాలు. నేనూ, మా సెల్లీ భోగాపురం ఎల్లివొలిమి. పదేసి రోజులు వుండేవోలిమి. మా బొంకుల దిబ్బకాడికి బస్సోచ్చింది. బొంకుల దిబ్బంటే మీకు తెల్దుగానీ, కన్యాశుల్కం సూసేరా? నా పిచ్చిగానీ, కన్యాశుల్కం సదవకపోవచ్చుగానీ, నాటకవో, సినిమానో సుడని తెలుగోల్లు ఎవరుంటారండీ? అందులో మొదటి సీన్నేదండీ...? అదేనండి. గిరీశం సుట్ట కాల్చే సీను. అదేనండి బొంకుల దిబ్బంటే. భోగాపురం ఎల్లాలంటే ఇప్పుడు లాగా ఆటోలు లేవు. రోజు మొత్తానికి ఒకటే బస్సుండిది. అదీ... నారీ లాగా మూతి ముందు కొచ్చిసి వుండీది. భోగాపురానికి సార్జీ ఎంతో గేపకం నేదు. రూపాయో, అర్ధరూపాయో అనుకుంటాను. బట్టలన్నీ పెట్టుకోడానికి బేగులుండియి కావు. బట్టలన్నీ గుడ్డ సంచిలో

కూరిసుకొని వోట్టుకేల్లిపోయివోలిమి. బస్సులో కిటికీ దగ్గరే కూకుండివోడిని. అసలు అంతకు ముందు భోగాపురానికి నడుసుకుని ఎల్లెవోరట. డెంకాడ పక్క నుండి, బంటుపల్లి మీద నుండి, అడ్డుతోవ ఉండేదట. మా మామ్మ సేప్పేది. బస్సులో ఎల్తే, బంటుపల్లి తగ్గల్దు.

భోగాపురంలో మొత్తం మూడు జాగాల్లో బస్సు ఆపుతారు. మేము మూడో జాగాలో, సత్తెం కిల్లి కొట్టు దగ్గర దిగివోలిమి. అక్కడ నుండి కుడి వైపు పల్లంలోకి దిగీ, రోడ్డంట ఊర్లోకి ఎల్లాలి. ఊర్లో బొల్లిదిలో వుండిది మా పెద్దమ్మ ఇల్లు. ఆ సుట్టు పక్కలందరూ వింతగా సూసీవోరు. మా పెద్దమ్మ కొడుకు వరాల్లన్నయ్యని... వుండివోడు. 'విజీనగరం నుండోచ్చారు. మా పిన్ని కొడుకూ, కూతురు" అని అందరికీ సేప్పేవోడు. మా అమ్మని అక్కడ అందరికీ బాగా తెలుసు. "యశోదమ్మగారి బొట్టుడివా" అని వోరు.

ఆ రోజు ఊరుకుని, మరసటి రోజు కల్లానికి ఎల్లీవోలిమి. పొద్దున్నే కంచుగిన్నెతో, చద్దన్నం, తెలగపిండోడిం నంచుకుని తినివోల్లం. రోజు వరన్నం వుండీది కాదు. ఒక్కోరోజైతే సోడిపిండంబలి. ఇప్పుడంటే సోడిపిండంబలి టౌన్లంట పేసనుగా తాగుతారట. అప్పుడదేం లేదు. కడుపునిండా తినీసి, ఎల్లివోల్లం. మాతో మా పెద్దమ్మ రెండో కొడుకు రాజు, ఆడూ, నాఈడోడే. అందుకే పేరు పెట్టి పిలిసీ వోన్ని.

కల్లానికి ఎల్లాలంటే, మేం మొదట బస్ దిగిన సత్తెం కిల్లి కొట్టు దగ్గర నుండి యెల్లాల. ఎగువకి ఒక పర్లాంగు దూరం ఎల్లీ, ఎడమ వైపు పల్లంలోకి దిగీ మట్టి రోడ్డంట లోపలి కంటూ యెల్లాల. ఆ రోడ్డంట అలా అలా ఎగువకి ఎల్లిపోతే, మద్రాసు వస్తదట. దిగువకి ఎల్తే, కలకత్తా వొస్తదట. మా రాజుగాడు సెప్పేడు. కొంచెం ముందు కెల్లనిచ్చి, పల్లంలోకి దిగివోలిమి. రెండు వైపులా తాటి దుబ్బులు. మద్దిన రెండెడ్ల బండి ఏల్లెంత జాగా. లోనికి కొద్ది దూరం యెల్లాల.

మద్ది తోవలో యాతంతో నీరు తోడుతుంటే, కాసేపు అక్కడే ఆగి సూసి ఎల్లివోల్లిమి. అక్కడ మిరపసేనూ, సెనగసేను ఉండేవి. ఒక పక్క దిబ్బలాగ వుండేది. పక్కన సపోటా సెట్టు, సెట్టునిండా కాయలుండీయి గానీ, ముగ్గబెట్టాలి. ఇప్పుడు తిండానికి పనికిరావు. ఒక పక్కగా గుడిసె. అక్కడ మా వరలన్నయ్య వుంటాడు. రాత్రంతా అక్కడే వుండివోడో, సీకట్నే వచ్చివోడో తెల్దుగానీ, మేం ఎల్లిసరికి అక్కడే వుండీవోడు. ఆ గుడిసెలోకి ఎల్లడానికి సిన్నం కన్నం లాగా వుండిది. లోపలంతా చీకటి, కింద మట్టి. ఎలాగుంటారో అనుండివోన్ని. ఒకసారి బయటకే అనేసాను. "ఇక్కడ మనం కాపరం వుండలేంట్రా. కాసేపు నడుంవాల్చుడానికి ఈ మాత్రం సాల్దా?" అని వోడు.

ఎలిపోతున్న యాతోడ్ని కేకేసి 'ఒరే! ఈరయ్యా! నాలుక్కాయలు కొట్రా. టౌన్ నుంచి మా తమ్ముడూ, సెల్లీ వచ్చారు" అన్నాడు. మా వరాలన్నయ్య సెప్పడవేటి ఆడు సెట్టెక్కిపోయాడు. ఆడు సెట్టేక్కుతుంటే సూసినోడిని నాకు బయం యేసింది. "అమ్మబాబోయ్! అంత మీద నుండి పడితే' అనుకున్నాను. కానీ, ఆల్లకి అలవాటే. రోజు సెట్టెక్కడమే ఆల్లపనంట. మా వరాలన్నయ్య సెప్పేడు. తాటి సెట్టు ఎక్కించి, తాటి కాయలు కొట్టిచ్చివోడు. ఆ సుట్టుపక్కలంత తాటిసేట్లే, కొంచెం కొబ్బరి సెట్లు కూడా ఉండియి. అక్కడ నుండి మేం తాటిసెట్ల దగ్గరికే ఎల్లివోల్లం. తాటిసేట్ల నీడ లోనే కూకొని, లేత తాటిముంజులు తింటుంటే బలే బావుండేది. మొదట్లో నాకు తిండం వచ్చిది కాదు. మా రాజు సూపుడు వేలు ముంజులోకి గుచ్చి, నోటితో జుర్రుకునేవోడు. ఆడ్ని సూసి నేను అలాగే తినేవోన్ని. నన్ను సూసి మా సెల్లి.

అక్కడ నుండి సపోటా సెట్ల దగ్గర కాసేపు ఆడుకునివోలివి. మరి కాసేపటికి కొబ్బర బొండాలు దింపించివోడు మా వరాలన్నయ్య. అప్పటికీ బాగా యెర్రగా ఎండ కాస్తుందేమో ఆ నీడ లోనే అందరం కూచుని కొబ్బరిబొండం ఒక్కోటి కొట్టి ఒక్కోలకి ఇచ్చివోడు. కొబ్బరినీళ్ళు తాగడానికి పుల్లలు అక్కడ ఉండవ్ కదా! అందుకని అక్కడ గడ్డి వాము నుండి గడ్డి పుల్ల తీసి లోన పెట్టి ఇచ్చివోడు. బలే ఉపాయం అనిపించేది. ఈ అన్నిటి తోనూ, కడుపు నిండిపోయి సాయంకాలం వరకూ ఆకలి ఏసిది కాదు. కొంచెం సల్లబడనిచ్చి కళ్ళం నుండి ఇంటికి బయల్దేరివోల్లం. పడమటన సూరీడు కొండదిగిపోయినా, వెలుగు మాత్రం నలుదిక్కులా పరచుకునే వుండేది. రోడ్డు పొడవునా ఆవుల మందలూ, మేకల మందలు గుంపులుగా కనిపిస్పీవి. వాటిని తోలుకుంటూ నా వయసు కుర్రవాళ్ళు వెనకనే. ఇంటికి రాబోతప్పటికి బాగా సీకటి పడిపోయేది. అప్పటికి ఇంకా కరెంటు తక్కువ. అన్ని ఇళ్ళలో నుండీ గుడ్డి దీపాలే. సిన్నపాటి యెర్రని ఎలుతురు రోడ్డుమీదకు వచ్చి రానట్టుగా వుండేది. యెర్రని వీధి లైటు మాత్రం బలహీనంగా ఎలుగుతుండేవి. అక్కడే రచ్చబండ. వుదయం నుండీ పొలం పనులు సేసి,, అలసిపోయి వుంటారేమో తీరుబడిగా సేదతీరుతూ వుంటారు. ఆ చిన్నపాటి వెలుతురులో పెద్ద వయసు వాళ్ళంతా కూర్చొని కబుర్లు చెబుతుండే దృశ్యం ఎంతో బాగుండేది.

అక్కడున్న వారం పది రోజులు మంచు ముద్ద కలిగిపోయినట్లు యిట్టే గడిసిపోయేవి. సెలవులు అయిపోతున్నాయంటే ఏదో చెప్పలేని దిగులు. తిరిగి విజీనగరం వచ్చే ముందు ఆ సుట్టు పక్కలందరు సంచిలతో సెనక్కాయలు ఇచ్చివోరు. ఆ సంచుల్లో సెనక్కయల్తో పాటు అక్కడ గేపకాలు

కూడా మాడ గట్టుకొని ఇంటి దారి పట్టేవోల్లం. ఇంటి కొచ్చిన తర్వాత మల్లీ మామూలే. కొత్త తరగతులూ. కొత్త పుస్తకాలూ. అక్కడి నుండి తెచ్చిన సెనక్కాయలు తింటుంటే అక్కడి విషయాలు మదిలో మేదిలేవి

ఇప్పుడు భోగాపురంలో మా అమ్మమ్మ లేదు. తరం మారింది. మా అమ్మమ్మలాగే, మా పెద్దమ్మ, కూతురు దగ్గర ఉంటోంది. వ్యవసాయాలు లేక ఉన్న కొద్ది పొలాన్ని అమ్మేసుకొని వలసలు ఎల్లిపోయారు. మా వరాలన్నయ్య బెజవాడ వెళ్ళిపోయి కాయగూరల మార్కెట్‌లో పని చేస్తున్నాడు. మా రాజు రాజమండ్రిలో సిల్వర్ కంపనీలో పని చేస్తున్నాడు. ఎప్పుడయనా, ఏవైనా పెళ్ళిళ్లు అయితే, అలాంటి సందర్భాలలో కలవడం తప్ప అంతకు మించి, కలుసుకోవడం లేదు.

రమణ బైక్ నడిపిస్తూనే వున్నాడు. చల్లని గాలి ముఖానికి తగుల్తోంది. ఒక్కసారి బండి ఆపడంతో గతకాలపు జ్ఞాపకాల నుండి బయటపడ్డాను. బ్యాంకు బయట బైక్ ఆపి, లోనికి వెళ్ళాడు. అప్పటికి సమయం పదకొండున్నర. పరిసరాలన్నీ గమనిస్తూనే వున్నాను. గతంలో చాలా చిన్న రోడ్డు వుండేది. ఇప్పుడు డబల్ రోడ్డు. రెండు రోడ్లనూ విడదీస్తూ మధ్యగా డివైడరు. భోగాపురం వూరు దాటేంత వరకూ ఫ్లైయ్ ఓవర్ . ఫ్లైయ్ ఓవర్ దాటే వచ్చాం. సత్యం కిళ్ళీకొట్టు ఎక్కడా..? ఆలోచిస్తూ, కళ్ళతో గత కాలపు గుర్తుల్ని వెతుకుతూనే వున్నాను. మెదడులో నిక్షిప్తమైన గత కాలపు దృశ్యాలు, ఇప్పుడు వెతుక్కొనే ప్రయత్నం చేస్తున్నాను. కనిపించడం లేదు. ఎందుకు కనిపిస్తాయి? నా తెలివి తక్కువగాని, ఎవరో కుర్రవాడు బ్యాంకు లోనికి వెళు తున్నాడు.

"బాబూ! ఇక్కడ అటు వైపు రోడ్డులో సత్యం కిళ్ళీకొట్టు వుండేది. పక్కనే పెద్ద బాదం చెట్టు. ఎక్కడా కనిపించడం లేదు." అన్నాను.

"ఏమో తెలియదండీ, నేను కూడా వూరికి కొత్త. ఈ మధ్యనే వచ్చాను" అంటూ నన్ను దాటుకొని బ్యాంకులోకి వెళ్ళిపోయాడు. లాభం లేదు. ఎవరైనా పెద్ద వయసు వాళ్ళని అడగాలి అనుకున్నాను. ఒకవేళ ఇంకా మరికాస్త ముందుకు వెళ్ళాలేమో. సరే! ఈ రమణ గాడు రానియ్' వస్తే ఎవరినైనా అడుగుదాం' అని ఆలోచిస్తుండగానే కాస్త పెద్ద వయసు మనిషి వస్తూ కనిపించాడు. ముందు కుర్రవాడిని అడిగిన ప్రశ్నలే ఈ పెద్దాయన్నీ అడిగాను.

"సత్తెం కిల్లీ కొట్టా ఎక్కడుంది? పోయిందిగా, ఇదిగో రెండేల్ల ముందు రోడ్లు పెద్దవి సేసేరు కదా! బాబూ ! అప్పుడు పోయింది."

"మరి కాస్త వెనకగా బాదం చెట్టు కూడా వుండేది కదా!"

'అదీ కూడా అప్పుడే పోయింది."

"మరి సత్యం. అతనెక్కడున్నాడు?"

"అతని పేరు సత్తెం కాదు బాబు! రాజారావు. సత్తెం అంటే ఆల్ల నాన్న. ఆల్ల నాన్న పేరునే సత్తెం కొట్టంటారు. చాలా కాలంగా అదే అలవాటు. అసలు ఈ రాజారావు పేరు ఎవరికీ తెలీదు"

"అంటే చాలా కాలంగా ఆ కొట్టు మీదే బ్రతుకుతున్నారన్నమాట. సరే ! ఇప్పుడేటయ్యాడు? అది సొంత జాగా కదా?"

"కాదు బాబూ! అప్పుడేవరికి కావాలి. ఈమాత్రం జాగాలు. కొట్టు పెట్టుకుని బతుకుతానంటే, సరే అనీ వోల్లు. ఇప్పుడంటే నిలబడ్డానికి జాగా కూడా రేటే. కొట్టు లేకపోవడంతో పిల్లల్ని తీసుకుని బెజవాడ కూలి పనికి ఎల్లిపోయాడు. కాయగూరల మార్కెట్లో పని. ఎప్పుడైనా కనకమ్మ పండక్కి వస్తే కనిపిస్తాడు."

"ఇంతకీ ఆ కొట్టు ఎక్కడుండీది? పోల్చుకోలేకపోతున్నాను."

"అదిగో మీరు దాటుకొనే వచ్చారు. అటు వైపు రోడ్డుకి వెళ్ళండి బాబూ!" అంటూ వెళ్ళిపోయాడు. నేను పెద్దాయన్ని ఆపే ప్రయత్నం చేయలేదు. "అలాగా" అన్నాను, అతి నెమ్మదిగా, అంత కన్నా వివరాలు అడగలేదు. రోడ్డు దాటుకొని వెళ్ళడం కూడా కష్టం. డివైడరు చాలా దూరంగా వుంది. ఇంతలో రమణ పని ముగించుకొని వచ్చాడు. ఇద్దరం బైక్ ఎక్కి ముందుకు కదిలాం. "నా బేంక్ పని అయిపోయిందిరా! ఇక నీ పనే. చెప్పు ఎక్కడికి వెల్దామో"

"ముందుకి పద" అన్నాను. సత్యం కిళ్ళీకొట్టు దాటి వచ్చేము అంటే మరొక ఫర్లాంగు దూరం. మనసులో లెక్కవేసుకొన్నాను. రమణ బండి నడుపుతున్నాడు. కానీ, అటు వైపు అన్నీ, ఏవేవో ప్రభుత్వ ఆఫీసులూ, కొట్లూ కనిపిస్తున్నాయి. మేముండే వైపు ఒకటి, రెండు రెస్టారెంట్లూ, పెద్ద, పెద్ద రిసార్ట్స్ కనిపిస్తున్నాయి. చాలా చోట్ల కార్లు ఒక పక్కగా పార్క్ చేసి వున్నాయి. ఒకటి, రెండు కార్లు లోనికి వెళుతూ కనిపించాయి. ఇంత దూరం రిసార్ట్‌లలో ఎవరుంటారు? వాటి అద్దెలు ఎలా వుంటాయి? అనుకున్నాను గానీ, అంత లోనే కార్లు అక్కడ పార్క్ చేసి వుండడం, కార్లు లోనికి వెళ్ళడం గుర్తుకు వచ్చి, ఎవరూ వెళ్ళకపోతే, అక్కడ కార్లు ఎందుకుంటాయి. అనుకున్నాను. నా కళ్ళు మాత్రం నా చిన్ననాటి గుర్తుల్ని వెతుకుతున్నాయి. ఎక్కడా నేను చిన్నప్పుడు చూసిన రెండెడ్ల బండి కాలిబాట కనిపించడంలేదు. మరికాస్త దూరం వెళితే కనిపిస్తుందేమో? ఆశగా వుంది. ఒక్కసారి పెద్దమ్మగారి కల్లం చూడాలి. ఆనాటి చిన్ననాటి రోజుల్ని నెమరువేసుకోవాలి. అసలు నేను వచ్చిందే అందుకు. కనుచూపు మేరలో తాటి చెట్లే కనిపించడం లేదు.

రమణ బైక్ నడుపుతునే వున్నాడు. మేము వెళుతూనే వున్నాము. ఎక్కడా, రెండెడ్ల బండిబాట కనిపించదే. కొన్ని చోట్ల పెద్ద ఆర్జీలు. వాటిమీద అందంగా వాటి పేర్లు. లోపల మట్టిరోడ్లూ, రోడ్డుకి ఇరువైపులా ఇంటి స్థలాలకి రాళ్లు పాతిపెట్టి వున్నాయి. అప్పటికే చాలా దూరం వచ్చేసాం. దాదాపు పోలిపల్లి వరకూ వచ్చేసాం.

"ఒరే ! రమణా! చాలా దూరం వచ్చేసాం. పదవెనక్కి వెల్లిపోదాం. పోల్చుకోలేకపోతున్నాను" అన్నాను. నా మాటతో డివైడరు చూసి బండి తిప్పి పక్క రోడ్డులోకి పోనిచ్చి, వెనక్కి తిప్పాడు.

"ఇప్పుడెక్కడికి?" అన్నాడు. భోగాపురం ఊర్లోకి మా పెద్దమ్మని ఒకసారి పలకరించి, వెల్లిపోదాం." అన్నాను. కాసేపటికే, ఊర్లోకి వచ్చాం. భోగాపురం చాలా మారిపోయింది. అంతకు ముందు చాలా వరకు కమ్మల ఇళ్లే ఉండేవి. అక్కడక్కడ ఎక్కడో పెంకుటిళ్ళు. మరి ఇప్పుడో, దానికి పూర్తి వ్యతిరేకం. అక్కడక్కడ కమ్మల ఇళ్ళు కనిపిస్తున్నాయి. బండి బొల్లి వీధికి వెళ్ళమని చెప్పాను. పరిసరాలు మారాయిగానీ, రోడ్డు అదే. అక్కడక్కడ చిన్న చిన్న కొట్లు. కాకపోతే అప్పుడు మట్టి రోడ్డు వుండేది. ఇప్పుడు సిమ్మెంటు రోడ్డు అయ్యింది. త్రోవలోనే మిఠాయి కొట్లో ఒక అరకేజీ స్వీట్ తీసుకున్నాను. ఆ వీధిలో మారనిది ఒక్క మా పెద్దమ్మ ఇల్లు ఒక్కటే. మరో రెండు మూడిళ్లు. అంతే, మిగతా వీధంతా స్లాబ్ ఇళ్ళే. ఇంటి ముందు బైక్ స్టాండ్ వేసాడు రమణ. మేము వెళ్లేసరికి ఇంటి బయటే నులక మంచం మీద కూర్చొని వుంది. పక్కనే పొడవాటి కర్ర. ఒకప్పుడు అదే మంచంమీద మా అమ్మమ్మ కూర్చొని, అలాంటి కర్రే పట్టుకొని వుండేది. ఇంటి ముందు జొన్నలో, రాగులో ఎండలో ఉండేవి. పక్కన కర్రతో కాకులూ, పిచ్చికలూ రాకుండా కాపలా కాసేది. ఇప్పుడు అలాంటి పనేమీ లేదు. కుక్కల్ని తోలడానికి తప్ప పక్కనున్న కర్రెందుకూ పని చెయ్యదు.

నన్ను దూరం నుండి చూసింది మా పెద్దమ్మ. కళ్ళు సరిగ్గా కనపడవు. ఎండ వెలుతురికి చెయ్యి అడ్డం పెట్టుకొని" ఎవులూ? అంది.

"నేను పెద్దమ్మా ! భాస్కరరావుని" అన్నాను.

"నువ్వా! పోల్చుకోలేకపోనాన్రా నాయనా ఎలగున్నావు? అక్కడెక్కడో గుంటూరు దగ్గరేక్కడో వున్నావన్నారు?

సుబద్రా..." అని మా అక్కని కేకేసింది. లోపలి నుండి వచ్చింది మా సుబద్రక్క.

"ఏంరా! తమ్ముడూఊఊ! బాగున్నావా? లస్మి ఎలగుంది? గుంటూరు నుండొచ్చావా?"

"లేదక్కా విజయనగరం ట్రాన్స్‌ఫర్ మీద ఒచ్చేసాను. చాలా కాలంగా ప్రయత్నిస్తుంటే, ఇప్పటి కయ్యింది"

"ఏటీ ఇజీనగరం వచ్చిసేవా? మాకు తెల్దు. ఎవులూ అన్లేదు. ఎన్నాల్లయ్యింది వచ్చి?"

'ఈ మధ్దే అక్కా! ఆరుమాసాలు. ఎంతయినా సొంతూరు. కదక్కా"

"నిజమే గాని తమ్ముడూ.. వరలన్నయ్య సూడు. సత్తెం తమ్ముడు సూడు. ఇందంట ఉందామనే వుంది. కానీ, జరుగుబాటేది? కడుపు సేత పట్టుకొని, దేశాలు పట్టిపోనారు.'

"ఏ మాత్రం దూరం లే అక్క ! రాజమండ్రి, బెజవాడ"

"మనూరు కానప్పుడు ఏ వూరైతే ఏట్లే?" అంది మా పెద్దమ్మ నిజమేననిపించింది.

"మావే...వూరొదల్లేక, ఇందంటే దేకుర్లాడుతున్నాం. మీ బావకి ఈ వూరు ఒదల్దాం ఇష్టంనేదు".

"పోనీలే అక్కా! ఆ మాత్రం మీరుండ బట్టే కదా ! ఇదిగో ఇలాగ వచ్చాం."

'పోనీలేరా తమ్ముడూ! భోజనం చేసి వెళ్ళండి. ఆ బాబెవరు?"

"మా ఫ్రెండ్ రమణ అని. ఇతనిదే బేంకు పనుండి వచ్చాం. ఈసారి వచ్చినపుడు చేస్తాంలే"

"అందుకా? మా దగ్గరికి రాలేదన్నమాట"

"అదేం లేదక్కా! ఇంటికి వెళ్ళాలి. లక్ష్మి చూస్తుంటుంది. అవును గానీ, పెద్దమ్మా ! మన కల్లం ఎక్కడుంది? ఆ రోడ్డంతా వెతుక్కొని చాలా దూరం వెళ్ళాం. పోల్చుకోలేకపోయాను."

"మన కల్లం సూడ్డానికెల్లావా? బాస్కరూ...! ఇంకెక్కడి కళ్ళంరా బాబూ! కల్లాలూ, బూవులు ఏనాడోపోనాయి. అక్కడన్నీ ఓటల్లంటా, మేడలంటా... ఏటేటో అంతన్ను. ఒక్కటీ అరదం కాదు." అంతలోనే ఇద్దరికీ టీ పట్టుకొని తెచ్చి ఇచ్చింది సుబద్ర. టీ గ్లాసు అందుకొని "మావే... పోల్చుకాలేకపోతున్నాం. ఇంక నువ్వేటి పోలుస్తావు." పెద్దమ్మగారి కల్లం, పెద్దమ్మే పోల్చుకోలేకపోతే ఇక నేనేటి పోలుస్తాను'. అనుకున్నాను మనసులో

"అదేటీ? మీ వూర్లో విమనాలు దిగుతాయంట. నేరుగా ఇంటి ముందే దిగిపోవచ్చట" అన్నాను నవ్వుతూ.

"దిగుతాయ్... దిగుతాయ్... తిండి గింజలు పండవలసిన బూవుల్లో, ఇమనాలు దిగితే.. ఏం తినాలి?"

ఏ మాత్రం చదువుకొని, మా పెద్దమ్మ మాటలకు ఏం సమాధానం చెప్పాలో తెలియలేదు. రమణ వైపు ప్రశ్నార్ధకంగా చూసాను. వాడేమైన జవాబు చెబుతాడేమోనని, వాటి నోటి వెంట మాటలేదు. ప్రశ్నించడానికి చదువు అక్కరలేదు. కానీ, జవాబు చెప్పడానికి ఎంతో, కొంత చదువు కావాలి. మా ఇద్దరి దగ్గరా ఎంతో కొంత చదువున్న మాట నిజమే. కానీ... మా దగ్గర మాత్రం జవాబేది? ◆

## చిగురించని వెన్నెల

- అడిగోపుల వెంకటరత్నం
9848252946



కొమ్మల గూటింట్లో
కోయిల బిడ్డతో సంభాషణ
వృద్ధాప్యం ముంచుకొచ్చింది
వారసత్వం అంకితం చేస్తున్నాను
సంగీతంలో నిన్ను శిఖరాగ్రం చేర్చాను
కచేరి చేసుకుని సభాస్థలి ఏలుకో
నడిచిన కాలం నడతలు
నీ ముందు వుంచుతాను
నడతల నడకలు చూసుకో...
మేఘాలు కుంపలతో కుమ్మరిస్తుంటే
ఆకులు శిరస్సులు అడ్డుపెట్టి
గూటికి రక్షణ ఛత్రాలై నిలిచాయి!
భూమిని కంపించిన భానుడు
నేలను కాల్చి ఆకులపై ఆగ్రహిస్తే
ఎండమంటల్లో ఆకులు వాడాయేగాని
ఒక్క ఉష్ణవీక్షణం గూటిపై వాలలేదు!
విజృంభించిన చలిలో
సమస్తం వొణుకుతూ
నీరు గడ్డకట్టినపుడు
ఆకులు తెరలుగట్టి అడ్డాయేగాని
ఒక్క చలిరేఖ
గూటిని అందుకోలేదు!
ఆకులు రాలుతున్నపుడు
అస్తమిస్తున్న సూర్యుణ్ణి చూపి
రేపు ఉదయిస్తాడనే నమ్మకం
యిచ్చి
కొమ్మలు రెమ్మలు
గూటికి బాసట నిలిచాయి!
రెమ్మలు చిగురించి పుష్పించి
ఫల పుష్పాదులతో చెట్టు
అష్టలక్ష్మిగా అలరారుతూ
మన ఆవాసాన్ని వత్సరానికోసారి
వసంతం అలంకరిస్తుంది!

అమ్మా ! అడగాలనుకున్నది
మనసు విప్పి అడుగుతాను
మన పక్క గుడిసెను
పసితనం నుండి చూస్తున్నాను
ఒంటినిట్టాడు కూలిపోయి
కప్పు ఎగిరిపోయింది
గంజి వుంటే వుప్పులేదు
ఉప్పు వుంటే గంజి వుండదు
బిడ్డ కోకిల ప్రశ్నించింది!
చెప్పాలనుకున్నది
మది కుంగి చెపుతాను
సంపదను పుట్టించిన నేల
సమంగా పంచమంటుంది
మనిషి పుట్టించిన స్వార్థం
అంతరాలు సృష్టిస్తుంది
తల్లి కోయిల ప్రత్యుత్తరం! ♦

## నా కలం పిడికిలెత్తింది

- తిరునగరి శరత్ చంద్ర
6309873682



నిన్నటి చీకట్లను చీల్చి
తెచ్చుకున్న వెలుతురును
దోపిడీ చేసే కన్నులను పొడవాలని
నా కలం ఉలెమి చూసింది.
పిడుగుల వంటి కవితలను కురిసి
మేఘాల గర్జనలతో మెరిసి నిలిచింది.
మా బూటు కాళ్ల కింద
మీరు బాట వేసుకుని నడవాలని,
మా తుపాకీ తూటా నోటికి
మీ గుండెని ఆహారంగా అందించి
పునీతులు కావాలని,
మా చూపుల దారుల్లోనే
మీరు బారులు తీరి నిలబడాలని,
మేం కన్నెర్రజేస్తే మీ బతుకులు
బుగ్గిపాలు కావాలని
అదిలించే, బెదిరించే
నీచ రాజకీయాలను చూసి నా కలం
కదం తొక్కింది.
నిరాశమయ జీవితంలో
తీయని ఆశలు విరియాలని,
నలుగురి క్షేమం కోసం
తమ జీవితాలను త్యాగం చేయాలని,
సమతా మమతల విలువలు
తోటలుగా నాటి పూలు పూయించాలని
తపించే వారికి నా కలం
చేయూతనిచ్చింది.

మంచి పనులు చేసే మనుషులు
ఎదురుగా వచ్చినప్పుడు,
అమాయకుల బ్రతుకులను
తొక్కిపెట్టాలని చూసే
దుర్మార్గుల కత్తులను నరికే
సత్తువలు ఎదురైనప్పుడు
నా కలం హారతులెత్తింది.

అశాంతిని నశింపజేసి
ప్రశాంతిని వెలిగించేందుకు
జరుగుతున్న రణంలో
కోటి చేతులు పడగెత్తి నిలిచినపుడు,
కోటి గొంతుకలు అలలెత్తి నడిచినపుడు
ఆ రణంలో తానూ నిలబడి
కలబడతానని
నా కలం పిడికిలెత్తింది. ♦

# దగాపడ్డ గొంతుకల కామన్ కోరస్

- డాక్టర్ కె. శశిధర్
9491991918






కవిత్వమంటే నాలుగక్షరాలను ముందరేసుకుని, వాటిని నాలుగు పంక్తుల్లోకి దిగ్గొట్టటం కాదు. కవిత్వమంటే అక్షరాలకు బానిసత్వం నేర్పే బారసాలా కాదు. కవిత్వమంటే ఒక అలజడి, అణగదొక్కబడ్డ గుండెల నుండి ఎగిసిపడ్డ లావా వంటిది కవిత్వం. కవిత్వమంటే కదలలేనివాడ్ని సైతం కదన రంగానికి నడిపించగలిగిన కదన కుతుహాల రాగం. అందుకే శ్రీశ్రీ ' కదిలేది, కదిలించేది.. పెనునిద్దుర వదిలించేది' కవిత్వమంటాడు. ఈ నేల మీద పుట్టుకొచ్చిన అక్షరాలన్నీ ఒక్కటి కానట్టే, కవిత్వమంతా కూడా ఒక్కటి కాదు. తెలుగు కవిత్వాన్ని కూడా చాలా ఏళ్లు అంటు అనే మాయరోగం పట్టి పీడించింది. వేల సంవత్సరాలు రాజాశ్రయాల్లోనూ, అంబారీ ఏనుగుల మీదా ఊరేగిన కవిత్వం చాలా కాలం అగ్రహారాలలోనే కాపురముండేది. అక్కడే తిష్ట వేసుకుని సామాన్యుని గూడేల వైపు కాని, గుడిసెల వైపుక్కాని చూసేది కాదు. పేదవాడి గుడిసెల్లోకి ప్రవేశిస్తే మైల పడిపోతాననే భయం దానికి.

తెలుగు సాహితీక్షేత్రంలోకి కుసుమ ధర్మన్న, గుర్రం జాషువా వంటి దళిత కలాలు ప్రవేశించిన తర్వాతే దళితుని జీవితం, కష్టాలు కవితా వస్తువలయ్యాయి. అప్పటి వరకూ దళితులకు, వారి కష్టాలకు తెలుగు సాహిత్యంలో చోటు దక్కలేదు. ఆ తర్వాత అరంగేట్రం చేసిన శివసాగర్, కలేకూరి, మద్దూరి, పైడి, శంభూక వంటి వారు దళిత జీవితంతో పాటు దళిత అస్తిత్వాన్ని, వారి భాషను, సంస్కృతిని తెలుగు సాహిత్యంలోకి జుట్టు పట్టుకుని లాక్కొచ్చారు. అప్పటి వరకూ అగ్రకులాలకు చెందిన కవులే అడపాదడపా దళితుల సమస్యల మీద కవిత్వం రాశారు. కానీ తొలితరం దళిత కవుల ప్రవేశంతో తెలుగు సాహిత్యంలో నూతన దళిత కవితా శకం ప్రారంభమయ్యిందని చెప్పాలి. ఆ పరంపరలోనే అనేక మంది దళిత వర్గాలకు చెందిన వారు కలమందుకుని, దళిత సాహితీ క్షేత్రాన్ని సుసంపన్నం చేశారు. వారి వారసత్వంతో ముందుకొచ్చిన అనేక మంది కవులు తమ కవితా పతాకలను తెలుగు సాహితీక్షేత్రంలో సగౌరవంగా ఎగుర వేశారు. ఆ వారసత్వంతోనే తంగిరాల సోనీ తన ' బ్లాక్‌వాయిస్ ' తో కవితా కదన రంగంలోకి ప్రవేశించాడు. 1968లో ఆంధ్రదేశంలో జరిగిన ఒక ఆమానవీయ ఘటన భారతదేశంలోని కుల సమాజం యొక్క పైశాచికతను ప్రపంచానికి మరొకసారి పరిచయం చేసింది. ఆంధ్రప్రదేశ్‌లోని కంచికచర్ల అనే గ్రామంలో దొంగతనం నెపంతో ఒక దళిత యువకుణ్ణి కొంతమంది భూస్వాములు పట్టపగలే కాల్చి చంపారు. ఆ ఘటన దేశంలోని కోట్లాది మంది దళితులను అభద్రతాభావంలోకి నెట్టివేస్తే, దళిత కవుల్లో ఆగ్రహావేశాలను రగిలించింది. కంచికర్ల ఘటనతో దేశంలోని

దళితులంతా భగ్గుమన్నారు. కవులు తమ కలాలను, గళాలను దళిత ఉద్యమాలకు వెన్నుదన్నుగా నిలబెట్టారు. అదే ప్రాంతానికి చెందిన కలేకూరి ప్రసాద్ 'నేను ఎప్పుడు పుట్టానో తెలియదు కాని, వేల ఏళ్ల క్రితమే ఈ గడ్డ మీద హత్య చేయబడ్డాను, పునరపి జననం, పునరపి మరణం నాకు కర్మ సిద్ధాంతం తెలియదు కాని, మళ్లీ మళ్లీ ఈ దేశంలోనే పుట్టుకొస్తున్నాను... త్రేతాయుగంలో నేను శంభూకున్ని.. అంటూ తన ధిక్కారస్వరాన్ని వినిపించారు. సరిగ్గా అదే గొంతుతో, అదే ధిక్కారంతో , అదే గడ్డ నుండి తంగిరాల సోనీ ఇప్పుడు తన బ్లాక్ వాయిస్‌ని వినిపిస్తున్నాడు.

సోని అయాచితంగా కలమందుకున్నవాడు కాదు, అవసరార్థమే కలమెత్తిన వాడు. సోనీ రాయటం తెలిసినవాడు. అక్షరాలకు అవమానాల్ని తాగించి వాటితో అగ్నిపూల రాగాలను ఆలపింప చేయగలడు. కవితా కదనరంగంలోకి ప్రవేశించటంతోనే తన పూర్వీకుల ధిక్కారస్వరానికి నిఖార్సైన వారసుడునని నిరూపించుకున్నాడు. కంచికర్ల గడ్డ మీద నుండి ఉదయించిన కాంతి కిరణం కలేకూరికి అసలు, సిసలైన వారసుడు. వెంటిలేటర్ మీద అంతంతమాత్రంగా కాలం వెళ్లదీస్తున్న దళిత కవిత్వానికి కొత్త నెత్తురు ఎక్కిస్తున్నవాడు. అతని కవిత్వం ఇప్పుడు దళిత కవిత్వాన్ని కొత్త సత్తువ తీసుకు వస్తుందనటంలో సందేహం లేదు. అతన్ని గుండెలకి ఎత్తుకోవాల్సిన అవసరం ఇప్పుడు యావత్తు దళితజాతి మొత్తం మీద ఉంది. శివసాగర్, కలేకూరి, మద్దూరి, సతీష్‌చందర్, పైడి, శంఖాక, మధ్యలో అనేక మంది, ఇప్పుడు సోని. నేటికాలంలో అనేక మంది దళితులు కవిత్వం రాస్తున్నారు. కానీ విచారించాల్సిన అంశమేమిటంటే వాటిలో దళిత అస్తిత్వం మచ్చుకైనా కనిపించటం లేదు. దళిత సాహిత్యం పేరుతో వస్తున్న సాహిత్యమంతా అవార్డు కేంద్రాల ప్రమాణాలకు అనుగుణంగా రాస్తున్నవే. అవార్డుల కోసం, అచ్చు కోసం, అచ్చైన తర్వాత వచ్చే మెప్పు కోసం తహతహలాడటం, తన్నుకులాడటమే ఆ కవిత్వంలో ఎక్కువగా కనిపిస్తుంది. అచ్చమైన దళిత కవిత్వం స్వచ్ఛంగా కనిపించటం ఈ కాలంలో చాలా అరుదై పోయింది. మళ్లీ బ్లాక్‌వాయిస్ రూపంలో దళిత కవిత్వానికి కొత్త స్వరం, కొత్త నెత్తురు దొరికాయి. దళిత కవిత్వానికి కొత్త నెత్తురద్దుతున్న ఆ నూతన స్వరమే సోనీ. మన జీవితాన్ని, మన జీవనాన్ని, మన బతుకులని, మన వెతల్ని, మన ప్రమాణాలతో మనమే రాసుకోవాలి, అలా రాసిందే దళిత కవిత్వం, అదే మన తత్వం అన్న కలేకూరికి అసలైన వారసుడు తంగిరాల సోనీ. ' చీకటి బతుకుల్లో మగ్గుతున్న మనుషులకు కవిత్వం వెలుగునివ్వాలి/ బానిస వీరుల నెత్తుటి చరిత్రను లిఖించే రక్తాక్షరాలే కవిత్వం కావాలంటాడు' సోనీ తన బ్లాక్‌వాయిస్‌తో.

నడిచొచ్చిన తొవ్వను, కనిపెంచిన అవ్వను మరిచిపోయి భావ కవిత్వం, భామ కవిత్వం రాసుకుంటూ, అచ్చైన పేపర్లలో పేర్లు, అవార్డులు చూసుకుంటూ మురిసిపోతున్న కవులకు కూడా సోనీ తన కవిత్వంలో కీలెరిగి వాతలు పెట్టాడు. కలేకూరి, మద్దూరి ప్రారంభించిన దళిత సాహితీ ప్రస్థానముతో ఏమాత్రం సంబంధం లేకుండా అచ్చంగా అగ్రవర్ణ సాహిత్య కుటీరాలలో పిపిలీకాలుగా మారి అక్కడక్కడే సంచరిస్తున్న దళిత మనువాద కవులను సోని ఎద్దేవా చేస్తాడు. అంతులేని సంఘర్షణ, అంతకు మించిన వేదన, ఆత్మగౌరవ పోరాటం అన్నీ ఉన్న స్వీయ జీవితాంశాలను వదిలి పెట్టి భావావేశం, భామావేశం అంటూ లేని లోకాల్లో విహరిస్తూ అప్పుడప్పుడూ నాలుగక్షరాలు స్ఖలించి అదే కవిత్వమంటూ మురిసిపోతున్న వారికి కవిత్వమంటే ఎలా రాయాలో కలేకూరి చెప్పిన మాటలు మరొక్కసారి తన కవితా పుటంలో మరిగించి చెవిలో పోయాలని ప్రయత్నం చేసాడు.

ధిక్కారం అనే కవితలో

'మనిషన్నాక మరీ కవి అన్నాక
మట్టి సట్టిలో బువ్వ గురించి
బువ్వలేకపోతే కడుపు మాడ్చుకుని
నక్షత్రాలతో తన గోస చెప్పుకోకపోతే ఎట్లా అంటూ

ప్రశ్నిస్తాడు.

ఆకాశంలో సుక్కలపై
ప్రకృతి వింతలపై
కనబడని శక్తులపై
పేర్లు బిరుదుల కోసం
శాలువా సత్కారం కోసం

కవి పీఠాల అవార్డుల కోసం రాయొద్దని వేడుకుంటాడు.

' గొడ్డు చాకిరీ సేసే ఈ బతుకుల్లో
కాస్త వెలుగుకోసం రాయాలి కదా...
రాయటమంటే అట్టా ఇట్టా కాదు...
కవితైనా, రచనైనా, పాటైనా బతుకుల నుండి
రాయాలి అంటాడు.

సోనికి వంగి నడవటం తెలీదు. నంగిగా మాట్లాడటం తెలీదు. ఉన్నది ఉన్నట్టు నట్టనడిమికి కట్టె రెపాలున విరిచినట్లు

మాట్లాడమే తెలుసు. తరతరాలుగా తమ జాతిని వేధిస్తున్న అవమానాలు, చిత్రహింసలు అతన్ని నిటారుగా నిలబడేలా, నింగి నంటి నినదించేలా నిలబెట్టాయి. తరతరాలుగా అంటరానితనంతో చిత్రహింసలు ఎదుర్కొంటున్న అణగారిన వర్గాలు ఎప్పటికైనా ఈ దేశాన్నేలే పాలకులు కావాలని, దాని కోసం దళితులందరూ ఆత్మగౌరవంతో ఉద్యమించాలని ఉద్బోధిస్తాడు. అందుకే తన బ్లాక్‌వాయిస్‌లో

'మూడువేల సంవత్సరాలుగా చిత్రహింసలు అనుభవిస్తున్న వాణ్ణి
రాజ్యాధికారంకై తిరగబడక తప్పదు
కుర్చీ ఎక్కటమూ తప్పదు
వణుకు లేదు... బెణుకు లేదు
ఎవరొచ్చినా నడ్డి ఇరగతన్నే
పొగరుతోనే ఉన్నా
కదలకుండా కాలికింద నలిపేస్తా
నా పొగరు నాకు అలంకారం' అంటాడు.

సోనికి ఏ రాయాలో, ఏం రాయకూడదో తెలుసు. ఆ ఎరుకే అతన్ని అందరిలోకి విలక్షణుడ్ని చేస్తుంది. తను వొచ్చిన తోవ అతనికి తెలుసు. అతనికి నీడనిచ్చిన పల్లె తెలుసు. తన జాతి తెలుసు, అది పడుతున్న వేదన తెలుసు. అందుకే సమస్త దళిత జాతి వేదననూ, పరివేదననూ కవితా వస్తువులుగా స్వీకరించి కణకణ మండే కవిత్వాన్ని అందించాడు. దళితుడు హత్య చేయబడిన ప్రతిసారి ప్రభుత్వం న్యాయం పేరుతో ఎంతోకొంత ఎక్స్‌గ్రేషియా పేరుతో వారి మొఖాన కొడుతుంది. చనిపోయిన దళితుల ప్రాణాలకు విలువ కట్టి చెల్లించే దుర్మార్గాన్ని అందరూ ఖండించాల్సింది పోయి, పోయిన ప్రాణాలకు జరగాల్సిన న్యాయం బదులు ఎక్స్‌గ్రేషియా తీసుకోవటాన్ని సోనీ తిరస్కరిస్తాడు. ప్రభుత్వాలిచ్చే ఎక్స్‌గ్రేషియాలను దళితులు ఎగిరితన్నే రోజు రావాలని, ఆరోజుల కోసం దళితులు తమను తాము సంస్కరించుకోవాలని ఆయన కోరతాడు. దళితులకు, ప్రభుత్వాలకు మధ్య బ్రోకరిజం చేస్తూ తరతరాలుగా తన జాతిని మోసం చేస్తున్న దళిత దళారీలంటే అతనికి వల్లమాలిన కోపం. అతను దాన్ని సహించడు, తన జాతికి ఎవడు అన్యాయం చేసినా, చెయ్యాలని చూసినా సోనీ నిలదీస్తాడు. ఆ విషయంలో తన, మన అనే తరతమ భేధాలేవీ అతనికి ఉండవు. పల్లెల నుండి, గూడేల నుండి బయలుదేరిన దళిత దళారీలు అగ్రవర్ణ రాజకీయ పార్టీలకు బానిసలుగా బతుకుతూ తల్లిలాంటి పల్లెను, స్వజాతీయులను ఎంతగా దగా చేస్తున్నారో, ఎంత ద్రోహం చేస్తున్నారో చూసి రగిలిపోతాడు. దుర్భరమైన తమ జీవితాలలో వెలుగులు నింపిన అంబేద్కర్ పేరుతో కూడా కపట నాటక రాజకీయాలు చేస్తున్న దళిత దగుల్బాజీ నాయకులను చొక్కా పట్టుకుని నిలదీస్తాడు.

'నలుగురితో నాలుగు దిక్కులు తిరిగి
బతక నేర్చే మీరు
పల్లెకు, పట్నంకు ఏదో పొడిచేసినట్టు
జాతికోసం మీ జీవితాల్ని త్యాగం చేసినట్టు
మేం తప్పితే దిక్కుమొక్కు లేదని
మీరు అనుకోవటం పెద్ద పొరపాటు బాబు' అంటూ ఆగ్రహిస్తూనే

'పొద్దస్తమానం అగ్రకులాల కాళ్ల కింద కూర్చునే
నువ్వు...
గూడెంలోకి రాగానే
నడిమంచంలో కాలు మీద కాలు యేసుకుని
జాతి గురించి చర్చిస్తుంటే
నీ పక్కన తోకతిప్పే నీతిమాలినోళ్లు
విని సప్పట్లు కొడతారు కానీ
మాకు మాత్రం మా చెడ్డ చిరాకు' అని తేల్చేస్తాడు.

పల్లె అంటేనే ఘనీభవించిన అవమానాల దిబ్బ. అందునా దళిత పల్లె అంటేనే అంతులేని దుఃఖాలను మోసుకు తిరుగుతున్న దుఃఖనది. దళితుని జీవితమంత దుర్భరమైన జీవితం బహుశా ఈ భూమ్మీద మీద ఏ జీవికి ఉండదనటంలో అతిశయోక్తి కాదు, అది అక్షర సత్యమే అవుతుంది. భారతదేశంలో గుడి, బడితో పాటు, సమస్తమూ వివక్షా కేంద్రాలుగా పరిఢవిల్లుతున్న విధానాన్ని చూసి సోనీ తల్లడిల్లుతాడు. పాఠాలు చెప్పే గురువులు కూడా తనను కులం దృష్టితోనే చూడటం, అడుగడునా అవమానించడాన్ని చూసి కుమిలిపోతాడు. పసిప్రాయంలోనే కులం కారణంగా తాను బడిలో ఎదుర్కొన్న వివక్ష తన చదువుపై, తన జీవితంపై ఎలాంటి ప్రభావం చూపిందో అతను గుర్తు చేసుకుంటాడు. బంగారు భవితకు మార్గం వెయ్యాల్సిన పాఠశాల తనను ఎంతగా భయపెట్టిందో, ఎంతగా అవమానించిందో 'పంతులు' అనే కవితలో చెబుతాడు.

'పలకా, బలపం అంటే
నాకు ఎప్పుడూ ఏడుపు వచ్చేది
నన్ను చూడంగానే నామాలు

మొఖాలు నవ్వుతూ

పప్పు ఉండలు తింటూ

నావైపు అట్టే చూసేటోళ్లు.. అంటూ ఆవేదన వ్యక్తం చేస్తాడు.

ఆ కవితలోనే 'ఓంకారం రాయని మాకు సదువులు ఎట్టా అబ్బాయనీ

నెమలి ఈకలు ఉండని మా పుస్తకాల్లో

అక్షరాలు ఇంత సక్కగా రాస్తున్నారని

నాలుక తిరగదని నవ్వే మాకు

నాలుగు మార్కులు ఎక్కువ వస్తే

నిద్రపోని రాత్రుళ్లు ఎన్నో

మా పంతుళ్లకు' అంటూ అధ్యాపకులలో ఉండే ఈ కులవివక్ష దళిత విద్యార్థులను ఎంతలా వేధించి, భాదిస్తుందో తన జీవితాన్నే సాక్ష్యంగా నిలబెట్టి మన ముందు ఆవిష్కరింప చేస్తాడు.

దళిత కవిత్వమంటే ఆకలి, అవమానాలే కాదు, అంతులేని ప్రేమ, తమకు మాత్రమే సొంతమైన బంధాలు, భాందవ్యాలు ఎన్నో ఉంటాయి. అమ్మ లేకుండా దళిత కవిత్వం లేనట్టే, అమ్మ ప్రేమను స్పృశించని దళిత కవంటూ ఉండడు. దళిత తల్లి, అందునా ఆడపిల్లని కన్న అమ్మ ఎంతగా భయపడుతుందో, ఆమెని సమాజం ఎంతగా భయపెడుతుందో అమ్మ ఒంటరి అనే కవితలో మనముందు నిలబెట్టే ప్రయత్నం చేస్తాడు. ఎదుగుతున్న తన కుమార్తె ఈ సమాజంలో ఎన్ని అవమానాలు ఎదుర్కొవాల్సి వస్తుందో అని ఆవేదన చెందుతుంది. నిజానికి ఏ తల్లైనా తన బిడ్డ ఎదుగుతుంటే ఆనందిస్తుంది ఈ దేశంలో పుట్టిన దళిత తల్లి వేదన ఎలా ఉంటుందో అమ్మ ఒంటరి అనే కవితలో ' నేను ఎదుగుతుంటే అమ్మకు గుండెల్లో కలుక్కుమన్నట్టు ఉండేది' అంటూ ఎదిగిన కూతురు సమర్తకు ఒక రైక ముక్కైనా కొనలేక తల్లడిల్లే ఆ తల్లి దీనత్వాన్ని మన కళ్ల ముందు ఆవిష్కరిస్తాడు. ప్రపంచంలోనే అభివృద్ధి చెందిన దేశాలలో ఒకటిగా ఎదుగుతున్న భారతదేశంలో దళిత తల్లులు ఎదుగుతున్న తమ బిడ్డలను చూసి ఎంత తల్లడిల్లుతున్నారో చూస్తే అర్థమవుతుంది ఈ దేశం ఎవరిదో, ఈ దేశాభివృద్ధి ఎవరిని అభివృద్ధి చేసిందో. ఇతరుల్ని అనుసరించడాన్ని, అనుకరించడాన్ని సోనీ అసహ్యించుకుంటాడు. అణగారిన జాతులకు సంబంధించిన కవులు తమ సొంత గొంతుతోను, సొంత భాషతోను విస్తరించాలని కోరుకుంటాడు. నీ పాట అనే కవితలో 'పాడు.. నీపాటే పాడు అంటూనే రా..। నలిగిపోయిన నీ కంఠాన్ని సవరించు/ రా..। నొక్కి పెట్టిన నిన్ను కదిలించు/ నువ్వే పాట పాడాలి, నీ గొంతే తిరగబడాలి/ రా..। ఇటురా 'బాబాసాహెబ్' దగ్గరకురా' అని ఆహ్వానిస్తూనే 'ఏది ఇప్పుడు పాట పాడు విందాము' అని ప్రోత్సహిస్తాడు.

పపంచంలోనే అతి పెద్ద ప్రజాస్వామ్య దేశంలో మనుషులందరూ సమానం కాదు. అట్టడుగు వర్గాల ప్రజలకు కనీసం మనుషులుగా కూడా చూడలేని పరమ నీచత్వం ఈ దేశానికి అనాదిగా వస్తున్న వారసత్వం. అదేమి విడ్డూరమో.. గాని ఈ దేశంలో దళితులని మనుషులుగా చూడరుగాని, ఓట్లుగా మాత్రం గుర్తిస్తారు. అంటుకోడానికి, ముట్టుకోడానికి, చుట్టరికం కలుపుకోడానికి పనికిరాని ఈ సమూహాలపై నాయకులకు ఎన్నికల సమయంలో ఎక్కడలేని ప్రేమ పుట్టుకొస్తుంది. అప్పటి వరకు కులం తక్కువోడని, విలువలేనోడని దళితుల మెడలో అవమానాల దండలను ఏసినోడు, ఎన్నికలు దగ్గరకు రాగానే ఎక్కడలేని కపటప్రేమను నటిస్తూ ఆలింగనం చేసుకుంటాడు. ఈ నాటకాలన్నీ సోనీకి తెలుసు, ఎన్నికల నాడు నాయకులు కురిపించే ప్రేమను బట్టబయలు చేస్తాడు.

'వాడొస్తున్నాడు

నిన్నటి దాకా నిన్ను వాడి గుమ్మంలో నిల్చోబెట్టినోడు

నీ గుమ్మంలోకి, నీ ఇంటిలోకి వస్తున్నాడు

నువ్వు మంచినీళ్లు అడిగితే

దొడ్డికి పోయే చెంబుతో నీళ్లు ఇచ్చినోడు

ఈ వేళ నీ చేత్తో నీళ్లు తాగుదామని వస్తున్నాడు' అంటూ

ఎన్నికల సమయంలో అగ్రనాయకులకు నిమ్నకులాలపై ప్రేమ నటించే నాయకులను చూసి

'వాడు నవ్వు స్మశానంలో పుర్రె నవ్వినట్టుంది

వాడి మొఖం పీనుగుల పెంటలా ఉంది' అంటాడు.

అంతులేని ఆగ్రహం, అనంతమైన ధిక్కారస్వరాన్ని తన కవితా సంకలనం ఆద్యంతమూ ప్రదర్శించిన సోనీ తనదైన భవిష్యత్తు దర్శనాన్ని కూడా మన ముందు నిలబెడతాడు. 'కొన్ని వేల సంవత్సరాలు పాలించబడుతున్న జాతి/ ఈ దేశాన్నేలే రోజు రావాలని కోరుకుంటాడు. కవిత్వానికి కాలానికి ఎదురీదే శక్తి ఉండాలి, అప్పుడే అది తరతరాలను చైతన్యవంతం చేస్తుంది. ఈనేల మీద వివక్ష కొనసాగినంత కాలం 'బ్లాక్ వాయిస్' తన గొంతును వినిపిస్తూనే ఉంటుందనటంలో సందేహం లేదు. ◆




# కొలువుతీరిన ప్రభుత్వాలు - ముందున్న సవాళ్లు

- తెలకపల్లి రవి

కేంద్ర రాష్ట్రాలలో నూతన ప్రభుత్వాలు కొలువు తీరాయి. తొలి అడుగులు మొదలుపెట్టాయి. తమతో పాటు తీసుకొచ్చిన కొత్త సవాళ్ల మాట అటుంచి పాత సమస్యలే వీటిని వెంటాడుతున్నట్టు మొదటి రోజునే స్పష్టమై పోయింది. కేంద్రంలో నరేంద్ర మోడీ మంత్రివర్గం మొదటి సమావేశం జరుపుతుండగానే గత పాలనకు సంబంధించిన ఆందోళనకరమైన లెక్కలు పతాక శీర్షికలను ఆక్రమించాయి. 2019 ఆర్థిక సంవత్సరంలో భారత ఆర్థిక వ్యవస్థ పెరుగుదల రేటు అయిదేళ్లలో ఎన్నడూ లేనంత తక్కువగా 6.8 శాతానికి దిగజారిందని 'ఎకనామిక్ టైమ్స్' మొదటి పేజీలో వార్త ఇచ్చింది. 2018లో వృద్ధి రేటు 8.1 శాతం వుంటే 2019 మొదటి త్రైమాస అంచనాలో 6.6 శాతానికి చేరింది. ఇప్పుడు ఆఖరి త్రైమాస లెక్కల్లో అది 5.8 శాతానికి పడిపోయింది. ద్రవ్య బ్యాంకింగు రంగాల్లో ఒత్తిడి వంటి కారణాల వల్ల ఇలా జరిగిందని ఆర్థిక శాఖ కార్యదర్శి సుభాష్ గార్గ్ వంటి వారు సమర్థిస్తున్నా ఎవరూ దాన్ని అంత తేలిగ్గా తీసుకోవడం లేదు. ఇక 2018లో నిరుద్యోగం 65 ఏళ్లలో ఎన్నడూ లేనట్టు 6.1 శాతం పెరిగిందని 'నేషనల్ శాంపిల్ సర్వే సంస్థ( ఎన్ఎస్ఎస్‌వో)' నివేదిక విడుదల చేసింది. ఎంతో ప్రచారంతో మరోసారి ప్రజా తీర్పు పొందిన మోడీ ప్రభుత్వం అనుసరించిన విధానాల పర్యవసానాలు ఎలా వున్నాయో ఈ లెక్కలే చెబుతున్నాయి. ఇక కొత్త క్యాబినెట్ మొదటి సమావేశంలో తీసుకున్న నిర్ణయాలు మరింత ఆందోళనకరంగా వున్నాయి. కార్మిక ఉద్యోగ భద్రతను హరించే విధంగా ప్రస్తుత చట్టాలను మార్చివేయాలన్న కార్పొరేట్ల కర్కోటక కోర్కెలను మోడీ సర్కారు ఆనందంగా ఆమోదించింది. ఈ మేరకు 44 చట్టాలను ఒకటే చట్టం చేయడానికి వచ్చే పార్లమెంటు లోనే బిల్లు పెడతామని నీతి ఆయోగ్ వైస్ చైర్మన్ రాజీవ్ కుమార్ ప్రకటించారు. దాంతో పాటే 46 ప్రభుత్వ సంస్థలను శరవేగంగా ప్రైవేటు పరం చేయడానికి పావులు కదిపింది. రైతులకు, చిన్న వ్యాపారులకు సాయం వంటి నిర్ణయాలే మీడియా బాగా ప్రచారం ఇచ్చింది గాని కీలకమైన ఈ అంశాలు మరుగున పడ్డాయి. నిర్మలా సీతారామన్‌ను మొదటి మహిళా ఆర్థిక మంత్రిగా నియమించడం వీటిని వేగవంతం చేయడానికేనని ఢిల్లీ రాజకీయ వర్గాలు చెబుతున్నాయి. గతంలో కొంత కాలమైనా ఇందిరాగాంధీ హయాంలో ఆర్థిక శాఖ చూసిన బ్యాంకుల జాతీయీకరణ, రాజభరణాల రద్దు వంటి ప్రజాపక్ష సంస్కరణలు అమలైతే ఇప్పుడు నిర్మల హయాంలో సర్వ సంపూర్ణమైన కార్పొరేట్ అనుకూల ఎజెండా అమలు కాబోతుంది. వాస్తవానికి అది మోడీ నూతన ప్రభుత్వ పోకడలకు తొలి సంకేతం. గుజరాత్‌లో మోడీ ముఖ్యమంత్రిగా వుండగా ఆయన దగ్గర సహాయ మంత్రిగా ఆ శాఖ చూసిన అమిత్ షా తీవ్ర ఆరోపణలతో జైలులోనూ గడిపారు. ఇప్పుడు ఆయన దేశానికే హోం మంత్రి కావడం మరో రాజకీయ సంకేతం. మోడీని ప్రధానిగా ప్రతిపాదించడమే గాక అన్ని వేళలా ఆయనకు అండగా నిలబడి తన స్థానం కాపాడుకున్న రాజ్‌నాథ్ సింగ్ రక్షణశాఖలోనూ మొన్నటి తీవ్ర

జాతీయవాదాన్ని యుద్ధ భాషను కొనసాగించబోతున్నారు. వైమానిక దళాధిపతి నివాసం ముందు రఫేల్ నమూనా పెట్టారన్న వార్త ఇందుకో నిదర్శనం. ఏమైనా మోడీ ప్రభుత్వానికి గతం కన్నా ఎక్కువ ఆధిక్యత లభించిన తర్వాత ఇవన్నీ ఊహించదగిన పరిణామాలే.

1971లో బంగ్లాదేశ్ యుద్ధ నేపథ్యంలో ఇందిరాగాంధీ ప్రభుత్వం 43 శాతం పైగా ఓట్లతో 352/518 లోక్‌సభ స్థానాలు గెల్చుకొంది. ఆమె హత్యానంతర సానుభూతి పవనాలలో రాజీవ్ గాంధీ 49.1 శాతం ఓట్లతో 1984లో 404/514 తెచ్చుకున్నారు. కాని ఒక కాంగ్రెసేతర పార్టీ ఇంతటి ఆధిక్యతతో తిరిగి రావడం ఇదే మొదటి సారి. బిజెపికి వ్యతిరేకంగా ఎన్నో మాట్లాడిన కాంగ్రెస్ పార్టీ ఎక్కడా లౌకిక శక్తులను ప్రాంతీయ పార్టీలనూ ఐక్యం చేయలేకపోయింది. ప్రతిపక్ష ఐక్యతా సూచి దారుణంగా పడిపోయింది. ఎస్‌పి బిఎస్‌పిలు కలసిన యు.పి లోనూ ఆ పార్టీ పోటీలు పెట్టి చెడగొట్టింది. కనీసం ఆర్జేడీ, కాంగ్రెస్ కలసి పోటీ చేసిన బీహార్‌లోనైతే మరంత దారుణంగా వెనకబడింది. చెప్పాలంటే ఒక్క తమిళనాడులో మాత్రమే బిజెపి వ్యతిరేక కలయిక విజయ ఢంకా మోగించింది. ఒక్కచోటైనా లభించిన ఈ విజయం సరైన ప్రత్యామ్నాయం వుంటే తట్టుకోవచ్చని నిరూపించింది. బలమైన జాతీయ, ప్రాంతీయ పార్టీలున్న ఒరిస్సా, కర్ణాటక, ఎ.పి, కేరళ వంటి చోట్ల కూడా బిజెపి చొరబడలేక పోయింది. ఒక్క తెలంగాణలో మాత్రం అనూహ్యంగా నాలుగు స్థానాలు తెచ్చుకున్నది కాంగ్రెస్, బిజెపిలు పరస్పరం సహకరించుకున్నాయనే భావనతో పాటు టిఆర్‌ఎస్ ప్రభుత్వ ఏకపక్ష ధోరణిపై నిరసన కూడా ఇందుకు తోడైంది. కర్ణాటకలో బిజెపి వ్యతిరేక కూటమి అధికారంలో వున్నా ఎన్నికల్లో పోటీ నివ్వలేకపోయింది. బిజెపి వరస విజయం ప్రపంచ వ్యాపితంగా మితవాద నేతలు సాధిస్తున్న విజయాలలో భాగమే. ఈ మతవాద మితవాద రాజకీయాల ప్రతిధ్వనులు కూడా అప్పుడే మొదలైనాయి కూడా. సికింద్రాబాద్ నుంచి ఎన్నికై కేంద్ర మంత్రి వర్గంలో సహాయ మంత్రిగా స్థానం పొందిన కిషన్‌రెడ్డి అప్పుడే స్లీపర్ సెల్‌ల గురించి మాట్లాడ్డం మొదలెట్టారు. భద్రత కోసం తీసుకోవలసిన చర్యలు తీసుకోవచ్చు గాని తెలంగాణలో తమ పురోగమనానికి ఆ రాజకీయ భాష అవసరమనుకుంటే మాత్రం కష్టం. తెలుగు రాష్ట్రాల నుంచి ఏకైక ప్రతినిధిగా విభజన సమస్యల పరిష్కారానికి, ఆర్థిక సహాయం రాబట్టడానికి ఉపకరిస్తే ప్రజలు సంతోషిస్తారు.

ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రిగా పాలన ప్రారంభించిన వైఎస్ జగన్మోహన్ రెడ్డి తొలి ప్రసంగంలోనే తన అడుగులు ఎటుండేది సూచించారు. వృద్ధుల పింఛను రూ. 2000 నుంచి రూ. 3000 లకు దశలవారీ పెంచడంలో భాగంగా రూ. 250 పెంచుతూ తొలిసంతకం చేశారు. నవరత్నాలే తన ఎజెండాగా సంక్షేమ పథకాల అమలుకు సహకరించేందుకు యాభై ఇళ్లకు ఒక వాలంటీరు చొప్పున 4 లక్షల మందిని నెలకు రూ. 5000 జీతంతో నియమించనున్నట్టు ప్రకటించారు. దీంతో వైఎస్ హయాంలో ఆదర్శ రైతులు, తెలుగుదేశం పాలనలో జన్మభూమి కమిటీల వలె ఈ పథకాలను రాజకీయ కోణంలోకి మళ్లించరు కదా అనే సందేహాలు సహజంగానే వ్యక్తమైనాయి. ఎలాంటి కుల, మత, రాజకీయ తేడాలు లేకుండా పథకాలు అమలు చేస్తామని ముఖ్యమంత్రి అన్నారు గనక ఆచరణలో చూడాల్సి వుంటుంది. ఇక రివర్స్ టెండరింగ్ ప్రక్రియను చేపట్టి గత ఏప్రిల్ 1 తర్వాత ఇచ్చిన పనులను రద్దు చేస్తున్నట్టు కూడా ప్రకటించారు. అప్పటికి 25 శాతం పూర్తి కాని పనులు కూడా ఆపేసి సమీక్షిస్తామన్నారు. ఇందుకోసం ఒక న్యాయమూర్తితో పరిశీలన బృందం ఏర్పడుతుందన్నారు. అమరావతిలోనూ ఇన్‌సైడర్ ట్రేడింగ్ జరిగిందని గతంలో ఆరోపణలు చేసిన వైసిపి నేత ఇప్పుడు ప్రభుత్వ నేతగా వాటిపై దర్యాప్తు జరిపిస్తామని వెల్లడించారు. అక్కడ కూడా పనులు ఆపేసి సమీక్షలు చేపట్టే అవకాశం వుంది. పోలవరం ప్రాజెక్టు విషయంలోనూ పనులు ఆపేయాలని పోలవరం అథారిటీ రాష్ట్ర అధికారులతో కలిసి జరిపిన సమావేశం తర్వాత ప్రకటించారు. అవినీతికి అవకాశం లేకుండా చేస్తామంటున్న పాలకపక్షం రూ. 30 వేల కోట్ల వరకూ ఈవిధంగా అదనపు చెల్లింపులు చేసి వుంటారని వైసిపి భావిస్తున్నది. ఈ దిద్దుబాటు ప్రక్షాళన చర్యలు అవసరమే గాని పనులు ఆగిపోకుండా, అభద్రత రాకుండా చూసుకోవలసిన అవసరం వుంటుంది. నిన్న అధికారులతో ఆర్థిక పరిస్థితిపైనా ముఖ్యమంత్రి సమీక్ష చేశారు. రూ. 2 లక్షలా 60 వేల కోట్ల అప్పు గుదిబండలాగా మారిందని ఢిల్లీలో తొలి సమావేశం లోనే బయటపెట్టారు. రానున్న రోజుల్లో వీటిపై శ్వేత పత్రాలు ప్రకటిస్తామన్నారు. వైసిపి ప్రకటించిన సంక్షేమ పథకాలకు దాదాపు రూ. రెండు లక్షల కోట్లు అవసరమవుతాయని భావిస్తున్న పూర్వరంగంలో వనరుల సమీకరణకు ప్రత్యామ్నాయ మార్గాలు కూడా చూడవలసి వుంది. రివర్స్ టెండరింగ్ మాత్రమే గాక ప్రజా వ్యతిరేక విధానాల రివర్సల్ జరగాల్సి వుంటుంది. పోలవరం

## సాహిత్య ప్రస్థానం మే 2019 పురస్కారాలు

**వర్తమాన దుఃఖాక్షరం**
వ్యాసం: రూ.500/-
రచయిత: మెట్టా నాగేశ్వర రావు

**మనసున మనసై**
కవితకు : రూ .500/-
రచయిత : కె. ఉషారాణి

**వక్రరేఖ**
కవితకు : రూ .500/-
రచయిత : శ్రీదేవి సురేష్ కుసుమంచి

■■■

కథకు, కవితకు సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కారం, వ్యాసానికి కర్లపాలెం రుక్మిణమ్మ పురస్కారం చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

■■■

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు. తగిన రచనలు లేనప్పుడు పురస్కారాలు ప్రకటించబడవు.

- ఎడిటర్

నిర్వాసితులకు రూ.34 వేల కోట్ల మేరకు చెల్లించాల్సిన పరిహారంపై కేంద్రం కూడా సానుకూలంగా నిధుల విడుదల చేయాలే గాని వట్టి మాటల వల్ల ఉపయోగం లేదు.

చంద్రబాబు నాయుడు ప్రభుత్వ తప్పిదాలపై ప్రచారార్భాటాలపై విమర్శలు నిజమైనా కేంద్రం సహాయ నిరాకరణ, అరకొర విదిలింపులు కూడా నిజమేనని మర్చిపోలేం. ఆ మాటకొస్తే రాష్ట్ర సారథ్యం చేపట్టే ముందు ముఖ్యమంత్రి జగన్ ఢిల్లీలో ప్రధాని మోడీని మొదటిసారి కలిసినప్పుడు కేంద్రం స్పందన చాలా నిరుత్సాహకరంగానూ నిర్బాధ్యతగానూ వుంది. మామూలు భాషలో పూర్తిగా సహకరిస్తామని చెప్పడం తప్ప ప్రత్యేక హోదాతో సహా గతంలో ఇచ్చిన హామీలు భారీగా రావల్సిన నిధుల బకాయిలపై పెదవి విప్పింది లేదు. ఈ విషయంలో జగన్ మీడియాలో చేసిన వ్యాఖ్యలు కూడా నిరుత్సాహమే మిగిల్చాయి. మొదటే చెప్పుకున్నట్టు మోడీ సర్కారుకు 300 పైన స్థానాలు వచ్చాయి గనక మనం నిస్సహాయులమన్నట్టు నిర్లిప్తత వెలిబుచ్చారు. ప్రతిసారి అడుగుతుంటానంటూనే బలం వుంది గనక చేయగలిగింది లేదన్నట్టు చేతులెత్తేసిన భావన కలిగించడం ఆది లోనే హంసపాదు అవుతుంది. మోడీకి 300 పైన వుంటే తనకూ 150 పైన వున్నాయి. ప్రత్యేక హోదా రాష్ట్రమంతటి నినాదంగా వుంది. వామపక్షాలు, జనసేన, హోదా సాధన సమితితో పాటు వైసిపి కూడా పోరాడిన అంశమది. జగన్ స్వయంగా పలు నిరసనలు చేశారు. ఆఖరి ఏడాది వరకూ మోడీతో జత కట్టి చివరి ఆరు నెలల్లో చంద్రబాబు చేసిన హడావుడిని ప్రజలు ఘోరాతి ఘోరంగా తిరస్కరించారు. అప్పటి వరకూ ఆయన ఏనాడూ అఖిల పక్ష సమావేశం జరిపింది లేదు. ఇప్పుడు ముఖ్యమంత్రి జగన్ హయాంలోనైనా ప్రత్యేక హోదా, విభజన హామీల సాధన, అమరావతి నిర్మాణం వంటి అంశాలపై అందరినీ కలుపుకుని పారదర్శకంగా ప్రజాస్వామికంగా వ్యవహరించడం అవసరం. ఈ నేపథ్యంలో కొన్ని మీడియా సంస్థలపై కొత్త ముఖ్యమంత్రి చేసిన వ్యాఖ్యలు, కేసులు పెడతామన్న హెచ్చరికలు అసందర్భంగా కనిపిస్తాయి. జగన్ అధీనంలోనూ మీడియా వుంది. ఈ విజయానికి ఎంతో దోహదం చేసిన సాక్షి పైనా కొన్ని విమర్శలు లేకపోలేదు. ఏమైనా తెలుగు నాట మీడియా పూర్తిగా కార్పొరేట్ భరితం, పాలక వర్గ రాజకీయమయం అయిపోయింది. 1955 ఎన్నికల లోనే నాటి పత్రికల విషపు దాడులు చూసిన కమ్యూనిస్టులకు ఇదేమీ కొత్త కాదు. ఎవరి భావాలు ఏమైనా-వాస్తవాలే రాయడం కట్టుకథలకు వ్యక్తిగత దాడులకు చోటు లేకుండా చూడటం అవసరమే గాని విమర్శలు అనివార్యంగా వుంటాయి. అవి నిర్మాణాత్మకంగా వుండేలా చూసుకోవాలి. ప్రభుత్వాలు కూడా ప్రజాస్వామికంగా వచ్చే విమర్శలు స్వీకరించి తప్పొప్పులు దిద్దుకోవాలి. ఇరుపక్షాల ఈ సంయమనం సమతుల్యత వుంటే అప్పుడు ముఖ్యమంత్రి అన్నట్టు పరువు నష్టం కేసుల వరకూ వెళ్లవలసిన అవసరముండదు. అసత్యాలు రాస్తే ఫిర్యాదు చేయడానికి అడ్డమూ వుండదు. తెలంగాణలో కొంత వరకూ ఆంధ్రప్రదేశ్‌లో గత అయిదేళ్లలో చూసిన అవాంఛనీయ ఘర్షణ, ఒత్తిడి లేకుండా చూడటం శ్రేయస్కరం. ఆర్టీసీ సమ్మె ప్రతిష్టంభన పరిష్కరించడం మరింత తక్షణ కర్తవ్యం. ♦

# స్ఫూర్తి నింపిన కందుకూరి వీరేశలింగం శతవర్ధంతి సమాలోచన సభ




- వొరప్రసాద్
9490099059

విజయవాడలో మే 26 ఆదివారం రోజు సిద్ధార్థ కళాశాల ఆడిటోరియంలో జరిగిన 'కందుకూరి వీరేశలింగం శతవర్ధంతి సమాలోచన' సభ సభికుల్లో ఉత్తేజం నింపింది. కందుకూరి వీరేశలింగం జీవితం, సంఘసంస్కరణ ఉద్యమ, సాహిత్య కృషిపై అవగాహనను పరిపుష్టం చేసింది. కందుకూరి తన జీవితకాలంలో చేసిన కృషిని భిన్న కోణాల్లో వక్తలు విశ్లేషించారు. ఉదయం నుండి సాయంత్రం వరకు జరిగిన సెమినార్లు, రూపకం, హాజరయిన వారిలో సామాజిక స్ఫూర్తిని రగిలించాయి.

తెలుగునాట అధ్యయనపరులుగా, మేధావులుగా, సామాజిక కార్యకర్తలుగా కృషిచేస్తున్న వారు ఈ సదస్సులో వక్తలుగా పాల్గొని ప్రసంగించారు. సంఘ సంస్కరణ ఉద్యమంతో ప్రత్యక్ష సంబంధం ఉన్న గోరా కుటుంబానికి చెందిన డా॥ విజయం, డా॥ సమరం, అలాగే విద్యారంగంలో ముఖ్యంగా చరిత్ర అధ్యాపకులుగా, శాసనమండలి సభ్యులుగా ఉన్న కె.ఎస్. లక్ష్మణరావు, సామాజిక, రాజకీయ విశ్లేషకులుగా ఉన్న తెలకపల్లి రవి, కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కార గ్రహీతలు డా॥ రాచపాళెం చంద్రశేఖర రెడ్డి, డా॥ పాపినేని శివశంకర్, సీనియర్ సాహిత్య వేత్తలు కడియాల రామమోహన్‌రాయ్, కొత్తపల్లి రవిబాబు, పెనుగొండ లక్ష్మీనారాయణ, బహుజన సాహిత్య వేత్త గుంటూరు లక్ష్మీనరసయ్య, దళిత కవి, విమర్శకులు శిఖామణి, సాహిత్య విమర్శకులు మేడిపల్లి రవికుమార్, చూపు కాత్యాయని, డా॥ కె. ఆశాజ్యోతి, ప్రజాశక్తి దినపత్రిక సంపాదకులు ఎం.వి.ఎస్. శర్మ, ఐద్వా నాయకురాలు పుణ్యవతి, మనసు ఫౌండేషన్ రాయుడు, మంజులూరి కృష్ణకుమారి, డా॥ హేమాపరిమి, తూమాటి సంజీవరావు వంటి ఉద్దండులు విలువైన ప్రసంగాలు చేశారు. వీరి ప్రసంగాలన్నీ ఈక్షణం యూట్యూబ్ ఛానల్లో నిర్వాహకులు అందుబాటులో ఉంచారు. వినదగ్గ ఉపన్యాసాలు వీరందరివీ. వాటి సారాంశాన్నీ, సభ అందించిన స్ఫూర్తిని చెప్పటానికి చేసే చిన్న ప్రయత్నమిది.

అభివృద్ధి చెందిన మీడియా ప్రజలను తప్పుదారి పట్టించే భావాలను, మౌఢ్యాన్ని, మరింతగా ప్రచారం చేస్తున్నది. సమకాలీన సమాజంలో సరికొత్త రూపాల్లో పెచ్చురిల్లుతున్న మూఢనమ్మకాలు ఆందోళన కలిగిస్తున్నాయి. ఇలాంటి పరిస్థితుల్లో ప్రజలకు నష్టం కలిగించే మూఢనమ్మకాలు, దురాచారాలపై 100 ఏళ్ళ కింద పోరాడిన కందుకూరి వీరేశలింగం కృషిని తిరిగి గుర్తుచేసుకోవడం ఒక మంచి ప్రయత్నం. కందుకూరి తన కాలంలో ఆనాటి మూఢనమ్మకాలపై, ఛాందస భావాలపై తిరగబడ్డ తీరును గుర్తుచేసి ఈనాటి మనం చేయాల్సిన కర్తవ్యాన్ని ఈ సభ గుర్తుచేసింది. ఈనాటికీ బ్రాహ్మణ భావజాలం సమాజాన్ని ఎంతగా ప్రభావితం చేస్తుందో లోతుగా వక్తలు విశ్లేషించారు. కందుకూరి వీరేశలింగం కృషిని బ్రాహ్మణ కులానికో, లేదా కొన్ని అగ్రవర్ణాలకే పరిమితం చేసిన వాదనలను ఈ సభ పూర్వపక్షం చేసింది. బ్రాహ్మణ మతతత్వం దేశంలోని అన్ని

కులాలకూ వ్యాపించి ఈనాటి ఆధునిక కాలంలోనూ ఎట్లా తన విశ్వరూపాన్ని ప్రదర్శిస్తున్నదో వక్తలు వివరించారు. వివక్షతలతో, అంటరానితనం వంటి దుర్మార్గాలతో అల్లాడిపోయిన దళితులు, స్త్రీలూ ఇంకా ఆ బ్రాహ్మణ మత భావజాలంతో కొనసాగడాన్ని గుర్తించాలన్నారు. దేశంలోని అన్ని కులాల్లోకీ వివాహం, కర్మకాండ వంటి క్రతువుల ద్వారా బ్రాహ్మణ మతతత్వం ఎట్లా వ్యాపించిపోయి తన ప్రభావాన్ని చూపిస్తున్నదో ఈ సభలో ఉపన్యాసకులు విశ్లేషించారు.

కందుకూరి వీరేశలింగం కాలంనాటికి ఆయన తనున్న సమాజంలోని మౌఢ్యాన్ని ఎదుర్కొన్న తీరును వక్తలు అభినందించారు. ఆయనను అసాధారణమైన ప్రతిభాశాలిగా వక్తలు కొనియాడారు. తన సంస్కరణోద్యమ కృషికి సాహిత్యాన్ని ఆధారం చేసుకున్న తీరును అభినందించారు. ఆనాటి వ్యవస్థలో వేళ్ళూనికుని పోయిన మూఢనమ్మకాలను, దురాచారాలను ప్రహసనాల వంటి హాస్యప్రక్రియ ద్వారా చీల్చి చెండాడిన తీరును వక్తలు గుర్తుచేశారు. రాజశేఖర చరిత్ర వంటి నవల ద్వారా ఆనాటి సామాజిక వ్యవస్థను కందుకూరి రికార్డు చేశారన్నారు. పలు సాహిత్య ప్రక్రియలలో ఆద్యుడుగా పేరు గడించిన కందుకూరి తన స్వీయ జీవిత చరిత్రను తెలుగు ప్రజల కందించి చిరస్మరణీయుడిగా మిగిలిపోయాడన్నారు. ఈనాటికీ సమాజంలో సింహభాగం కందుకూరి భావాలను అందుకోలేక వెనకబడిపోయిందన్నారు.

కందుకూరి వీరేశలింగం తన జీవితకాలంలో చేసిన కృషిని ఈనాటి తరానికి గుర్తుచేయాల్సిన అవసరం ఉందని వక్తలు అభిప్రాయపడ్డారు. ఆ రోజు కందుకూరి చేసిన కృషి తన వ్యక్తిగత సౌఖ్యాల కోసం, కీర్తి కోసం కాదని, వ్యవస్థ బాగుకోసం ఆయన శ్రమించారన్నారు. రచన, ఆచరణ రెండింటి మేలుకలయికగా వీరేశలింగం ఈనాడు రచయితలందరికీ ఆదర్శనీయం అన్నారు. అభివృద్ధి పేరుతో ఎంతగా ప్రచారం సాగుతున్నా, వ్యవస్థలో మానవీయ విలువలకు స్థానం లేకుండా పోయిందని, అందుకు కారణం కందుకూరి వంటివారు సాగించిన సాంఘిక సంస్కరణ కృషి కొనసాగకపోవడమే నని వక్తలు అభిప్రాయపడ్డారు. ఈ రోజుకీ కొనసాగుతున్న మూఢనమ్మకాలు, మహిళా వివక్షత, దళితుల పట్ల దౌర్జన్యాలు వంటివి నేటి అభివృద్ధిని అపహాస్యం చేస్తున్నాయని అన్నారు.

సుమారు 750 మంది హాజరయిన సభ ఆద్యంతం ఆలోచనాత్మకంగా సాగింది. వర్తమాన సమాజంలో అందరం కలిసి కందుకూరి వీరేశలింగం వంటి వారి కృషి నుండి స్ఫూర్తి పొంది కర్తవ్యబద్ధులం కావాలని విజ్ఞప్తి చేశారు. కందుకూరి వీరేశలింగం మరణించి 100 ఏళ్ళయిన సందర్భంగా ఆయన స్మరించుకోవడమంటే వర్తమానంలో కూడా ఆయన భావాలు మనకు ఉత్తేజం కలిగించడమే కారణమని అన్నారు. మారువేషాల్లో సాగుతున్న మౌఢ్యాన్ని, వెనుకబాటు తనాన్ని కందుకూరి భావాలతో ఈ రోజు ఎదుర్కోవలసిన అవసరం ఉందన్నారు. ఇలాంటి పరిస్థితుల్లో కందుకూరి వీరేశలింగం శతవర్ధంతి రావటం, ఆయనను స్మరించుకోవటం అనివార్యమని అన్నారు. ఆయన భావాలను ఈనాటికీ అందుకోని సామాజిక వ్యవస్థ పట్ల సందేహాలు రావడం సరైందేనని వక్తలు అభిప్రాయ పడ్డారు.

కందుకూరి వీరేశలింగం కృషిని, ఆయనలోని కొన్ని లోపాలను పేర్కొంటూ కొందరు ఆయనను విమర్శించడం పట్ల కూడా సభలో చర్చ జరిగింది. కందుకూరి వీరేశలింగం పరిమితుల్ని, ఆయన కాలంనాటి సామాజిక పరిస్థితుల్ని అన్నిటినీ దృష్టిలో పెట్టుకుని కందుకూరి వీరేశలింగాన్ని అంచనా వేయాలన్న అభిప్రాయం వ్యక్తమైంది. ఈనాటికి అభివృద్ధి చెందిన భావాలతో ఆనాటి కందుకూరిని చూసి ఆయన భావాలు పనికిరానివని, ఆయన అందరివాడు కాదని కందుకూరిని విమర్శించడం చారిత్రక దృష్టి, స్థలకాలాల దృష్టి లేకపోవడమేనని వక్తలు అభిప్రాయపడ్డారు. కందుకూరి వీరేశలింగం భావాల్లోకాని, ఆయన చేసిన సంఘసంస్కరణ ఉద్యమ కృషిలో కానీ ఈనాటి సమాజానికి పనికివచ్చే అంశాలను తీసుకుని, ఆయన స్ఫూర్తితో పనిచేయడం ఈనాటి అందరి కర్తవ్యమని అన్నారు. సామాజిక నిబద్ధత కలిగిన వారు కందుకూరిని వీరారాధనతో చూడరని, వర్తమాన సమాజానికి జాగృతం చేయడానికి కందుకూరి నుండి స్ఫూర్తి పొందడమే వారి లక్ష్యంగా ఉంటుందని అభిప్రాయపడ్డారు. ఇటీవల కందుకూరి, గురజాడ, శ్రీశ్రీ వంటి వారిపై అంతర్జాలంలోనూ, పత్రికల్లోనూ జరుగుతున్న చర్చల్లోని అంశాలు ఈ సభలోనూ ప్రస్తావనకు వచ్చాయి. వివిధ కోణాల్లో సాగిన ఈ చర్చ ఒక శాస్త్రీయమైన అవగాహనను సభికులకు అందించింది. ముఖ్యంగా దళిత, బహుజన దృక్కోణంలోంచి వచ్చిన పలు ప్రశ్నలకు ఈ సదస్సు సంతృప్తికరమైన జవాబులిచ్చింది. ప్రగతిశీలవాదులూ, మార్క్సిస్టులూ, దళిత బహుజనులూ పరస్పరం ఒక మిత్రస్ఫూర్తితో ముందుకు సాగాల్సిన అవసరాన్ని సభ నొక్కి చెప్పింది.

నిజానికి నేడు ఒక పక్క ప్రపంచీకరణ విధానాలు, మరోపక్క ఫాసిస్టు ధోరణులూ పేట్రేగిపోతూ దళితులనూ,

మైనారిటీలనూ, పేదలనూ అష్టకష్టాలకు గురిచేస్తున్న సందర్భంలో భావసారూప్యం కలవాళ్ళు కలిసిపనిచేసే వాతావరణం కోసం ప్రయత్నించాల్సిన అవసరం ఉంది. ప్రగతిశీలవాదులూ కమ్యూనిస్టులూ, అభ్యుదయవాదులూ ఒక శిబిరంగామూ, దళిత బహుజన వాదులూ మరో శిబిరంగానూ వేరుపడే ధోరణులను ప్రోత్సహించేవారి పట్ల అప్రమత్తంగా ఉండాలి. అటువంటి ధోరణులు అంతిమంగా నష్టానికే దారితీస్తాయి. ఈ సదస్సులో జరిగిన ఇటువంటి చర్చలు ఒక లోతైన, వాస్తవికమైన అవగాహన అందించే ప్రయత్నం చేశాయి.

విజయవాడ నగరంలోని సాహిత్య, సామాజిక, కళా, సాంస్కృతిక రంగాలకు చెందిన 108 సంస్థల భాగస్వామ్యంతో ఏర్పడిన 'కందుకూరి వీరేశలింగం శతవర్ధంతి సమాలోచన' నిర్వాహణ కమిటీ ఆధ్వర్యంలో ఈ సభ జరిగింది. శతవర్ధంతి అవడంతో 100 సంస్థల కలిసి చేయాలన్న నిర్వాహకుల సంకల్పం అందరి ప్రశంసలందుకుంది. ప్రముఖ రచయిత దేవేంద్ర రాసిన 'సంస్కరణోద్యమ ఖడ్గధారి – కందుకూరి వీరేశలింగం' రూపకం ద్వారా ప్రజానాట్యమండలి కళాకారులు కందుకూరి జీవితం, సంఘసంస్కరణోద్యమ కృషి, సాహిత్య పరిశ్రమ కళ్ళకు కట్టినట్టుగా ప్రదర్శించారు.

కందుకూరిపై ప్రత్యేకంగా వెలువరించిన పుస్తకాలు ఈ సభలో ఆవిష్కరించారు. 1970 ప్రాంతాల్లో దేవులపల్లి కృష్ణశాస్త్రి, ఆవుల సాంబశివరావు, నార్ల వెంకటేశ్వర రావు వంటి వారు సంకలనం చేసిన కందుకూరి వీరేశలింగం స్మారకసంచిక యుగపురుషుడు పుస్తకాన్ని తెలకపల్లి రవి సంపాదకత్వంలో ప్రజాశక్తి బుక్‌హౌస్ పునర్ముద్రించింది. ఈ సంకలనం చాలా విలువైనది. నార్ల వెంకటేశ్వరరావు, నాళం సుశీలమ్మ, తాపీ ధర్మారావు వంటి వారి వ్యాసాలు కందుకూరిపై మన అవగాహనను పరిపుష్టం చేస్తాయి. రాచపాళెం చంద్రశేఖర రెడ్డి సంపాదకత్వంలో కొత్త వ్యాసాలను ఆహ్వానించి మరో పుస్తకం ప్రజాశక్తి ప్రచురించింది. 1970లలో నేషనల్ బుక్‌ట్రస్ట్ వారు కొడవటిగంటి కుటుంబరావు గారి చేత కందుకూరి ఆత్మకథను సంక్షిప్తం చేయించి ఆయన ముందుమాటతో ప్రచురించారు. ఆ పుస్తకాన్ని ప్రజాశక్తి బుక్‌హౌస్ వారు ప్రచురించి ఈ సభలో ఆవిష్కరించారు. అలాగే కందుకూరి ప్రసిద్ధ రచన రాజశేఖర చరిత్ర కూడా ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురించి ఈ సభలో ఆవిష్కరించింది. ఐద్వా ప్రచురించిన కందుకూరిపై వ్యాస సంకలనం, తూమాటి సంజీవరావు పుస్తకం, కవిసంధ్య, వీరేశలింగంపై వెలువరించిన ప్రత్యేక సంచిక ఈ సభలో ఆవిష్కరించడం జరిగింది.

సభ అనేక అంశాల సమాహారంగా కొనసాగి ఫలవంతంగా జరిగింది. ప్రముఖ సినీ దర్శకులు అంకురం ఉమామహేశ్వరరావు ఈ నిర్వాహణ కమిటీకి సారథ్యం వహించడంతో పాటు, సభా సమన్వయం కూడా చేసి సభను జయప్రదం చేశారు.

కందుకూరి జీవితాన్ని తిరిగి ఆయన శతవర్ధంతి సంవత్సరంలో తెలుగు ప్రజలు గుర్తుచేసుకోవటం, స్ఫూర్తిపొందటం ఒక గొప్ప నివాళిగా మిగిలిపోతుంది. గత సంవత్సరం శతవర్ధంతి ప్రారంభ కార్యక్రమం రాజమహేంద్రవరంలో జరిగింది. ఆనాటి నుండి రాష్ట్రవ్యాప్తంగా వివిధ సంస్థలు శతవర్ధంతి కార్యక్రమాలు నిర్వహించాయి. ముగింపుగా విజయవాడ, రాజమహేంద్రవరం, విశాఖపట్నం, అనంతపురం, కాకినాడ వంటి పలుప్రాంతాల్లో వందల సంస్థలు భాగస్వామ్యంతో సదస్సులు నిర్వహించాయి. ముఖ్యంగా సాహిత్య, సాంస్కృతిక రంగాలు వ్యక్తుల కీర్తిప్రతిష్టల చుట్టూ, సంకుచిత పరిధుల మధ్య సంచరిస్తున్న సమయంలో సామాజిక స్ఫూర్తిని చాటే ఇటువంటి సభలు కొంత ఊరట నిస్తాయనడంలో సందేహం లేదు. సమాజాన్ని, సమిష్టి తత్వాన్ని కేంద్రంగా చేసుకునే సామాజిక, సాహిత్య, సాంస్కృతిక ఉద్యమాలు నేటి అవసరం. కందుకూరి శతవర్ధంతి సమాలోచన సభ ఆ దిశగా ఒక అడుగు వేసేందుకు దోహదం చేస్తుందని ఆశిద్దాం.

చివరగా అయినా కీలకమైన అంశం– ఇంత భారీ కార్యక్రమాన్ని ఫలవంతం చేయడంలో తెరవెనక ఉండి కృషిచేసిన వారిని ప్రస్తావించాలి. నిర్వాహణ కమిటీలోని 108 సంస్థల బాధ్యులతో పాటు ఎం.బి. విజ్ఞానకేంద్రం కార్యదర్శి పిన్నమనేని మురళీకృష్ణ, ఐద్వా కార్యదర్శి బి. రమాదేవి, ప్రజాశక్తి బుక్‌హౌస్ లక్ష్మయ్య, కెవిపిఎస్ ఆంధ్ర మాల్యాద్రి, ఎం.బి.విజ్ఞానకేంద్రం రామరాజు, జాషువా సాంస్కృతిక వేదిక నారాయణ, గోళ్ళ నారాయణరావు, ఈమని శివనాగిరెడ్డి, గుమ్మా సాంబశివరావు, నాస్తికకేంద్రం హరిసుబ్రహ్మణ్యం వంటివారు, మరికొందరు నేరుగా ఈ కార్యక్రమానికి భుజం కాశారు. వారికి ప్రత్యేక అభినందనలు. ◆

# స్వీకారం

## వెలుతురు వాకిట కవిత్వం

రెడ్డి శంకరరావు

వెల : 100/- పేజీలు: 132

ప్రతులకు : 9441176882

ఉత్తరాంధ్ర వాతావరణం, ఉత్తరాంధ్ర పోరాటాలు, ఉత్తరాంధ్ర కవులు, భాషా శాస్త్రవేత్తలు అన్నీ ఈయన కవితా వస్తువులయ్యాయి. అన్ని రకాల ప్రజా పోరాటాలకు సంఘీభావం పలుకుతూ రాసిన కవితలున్నాయి.

- కె. శివారెడ్డి

## నీలింకని నేల

రాయలసీమ కథల సంకలనం

సంపాదకులు:

యస్.యం.డి. ఇనాయతుల్లా

కెంగార మోహన్

వెల : 150/- పేజీలు: 144

ప్రతులకు: 9493375447

ఇందులో కథకులెన్నుకున్న విషయాలన్నీ వాస్తవాలే. అయితే ఆయా కథకుల జీవితాల్లో ఎప్పుడో ఎక్కడో సంభవించినవో విన్నవో అయి వుంటాయి. వాటికి కొద్దిగా వారివారి వైయక్తిక అభిప్రాయాలు జోడించి, వారి వారి భాషానైపుణ్యాలను వాడి మీ ముందుంచారు.

- కాశీభట్ల వేణుగోపాల్

## భారతదేశ చరిత్ర

సామాజిక సాంస్కృతిక దృక్పథం

డా॥ కత్తి పద్మారావు

వెల : 500/- పేజీలు: 585

ప్రతులకు: 9849741695

జైన, బౌద్ధ, ఉద్యమాల విస్తృతిని ఈ గ్రంథం ప్రముఖంగా పేర్కొంది. భారతదేశ భౌగోళిక సంస్కృతీ వికాసానికి మూలవాసులకు వున్న సంబంధాన్ని, నదీ నాగరికతలో మూలవాసులకు వున్న సంబంధాన్ని, వైదిక సంస్కృతికీ బౌద్ధ సంస్కృతికి వున్న వ్యత్యాసాన్ని చెప్తూనే చారిత్రక అంశాలన్నింటినీ జారిపోకుండా విశ్లేషణాత్మకంగా తాత్విక పునాదితో, శాస్త్రీయ దృక్పథంతో ఈ గ్రంథం వ్రాయడం జరిగింది.

- డా॥ కత్తి పద్మారావు

## ఆమె (గజళ్ళు)

డా॥ దిలావర్

వెల :50/- పేజీలు: 60

ప్రతులకు: 9866923294

ఇందులోని ఇందువదన హృదయంలో కనువిందు చేయాలంటే దిలావర్ సాబ్ 'దిల్'లోకి అక్షర గవాక్షాల్లోంచి (తప్పైనా) తొంగి చూడాలి. ఉర్దూ సాకీ కాదు అచ్చమైన తెలుగు సాకీ దర్శనమిస్తుంది. కాకపోతే ఆయనది అమలిన దృష్టి.

- ఎండ్లూరి సుధాకర్

## మా వూరి మంగలి కతలు

మూరిశెట్టి గోవింద్

వెల :100/- పేజీలు: 96

ప్రతులకు: 9502200749

పాఠకుల్ని నాలుగైదు దశాబ్దాలు వెనక్కు తీసుకెళ్తాయి ఈ కథలన్నీ. ఇందులోని ప్రతి కథా ఒక అనుభవాన్ని పాఠకుల ముందు ప్రత్యక్షంగా నిలుపుతుంది- ఆ అనుభవాన్ని తెలియచెప్పే రచయిత పరిశీలనా దృష్టీ, శ్రామికజన పక్షపాత వైఖరీ, సామాజిక అన్యాయాల పట్ల దిగులు పడే రచయిత కంఠస్వరమూ, పాఠకుల్ని చకచ్చకితుల్ని చేస్తాయి.

- సింగమనేని నారాయణ

## చింకిచాప కథలు

పోట్లూరు సుబ్రహ్మణ్యం

వెల :100/- పేజీలు: 198

ప్రతులకు: 9491128052

ఈ 'చింకిచాప' పుస్తకంలోని కథలు ఊహించి వ్రాసినవే అయినా అన్నీ వాస్తవానికి దగ్గరగా ఉన్న సంఘటనలే. కొన్ని కథలు సుఖాంతాలు, మరికొన్ని కథలు విషాదాంతాలు. ప్రతి కథ మనసులో ముద్రించుకుపోతుంది.

- డా॥ దీర్ఘాసి విజయభాస్కర్

# నేటి సమాజానికి కందుకూరి సాహిత్యం అవసరం

*విశాఖపట్నంలో జూన్ 5న జరిగిన కందుకూరి వీరేశలింగం శతవర్ధంతి సమ్మేళనంలో ప్రారంభ కార్యక్రమంలో గంటేడ గౌరునాయుడు, అట్టాడ అప్పల్నాయుడు, కొలకలూరి ఇనాక్, ఎం.వి.ఎస్. శర్మ, వొరప్రసాద్, ఎ.వి.రమణారావు*




విశాఖ నగరంలోని మద్దిలపాలెం కళాభారతిలో సాహిత్య, కళా, సాంస్కృతిక, ప్రజా సంస్థల ఆధ్వర్యంలో కందుకూరి శత వర్ధంతి సమ్మేళనం జూన్ 5న జరిగింది. సంఘంలోని దురాచారాలను ఎదిరించడం.. వాటిని సరిచేయడంలో ఒకే ఒక్కడు 'కందుకూరి' వీరేశలింగం.. ప్రస్తుత పరిస్థితుల్లో ఆయన ప్రపంచానికి తెలియాల్సి ఉంది. నాడు ఆయన వేసిన ముందడుగు సమాజంలోని తిరోగమన భావాలను వెనక్కి నెట్టే మార్గాలను నేటికీ చూపుతోంది. కానీ కొందరు ఆయన సృజించిన చైతన్యాన్ని బతకనివ్వకుండా, వికసింపజేయకుండా వెనక్కి నెట్టాలని నేడు చూస్తున్నాయి. వాటి పట్ల మనం అప్రమత్తంగా ఉండాలి' అని ప్రముఖ కవి, పద్మశ్రీ అవార్డు గ్రహీత కొలకలూరి ఇనాక్, మాజీ ఎమ్మెల్సీ, ప్రజాశక్తి ఎడిటర్ ఎంవిఎస్. శర్మ పిలుపునిచ్చారు. సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు వొరప్రసాద్ అధ్యక్షత వహించిన సభకు కొలకలూరి ఇనాక్ కీలకోపన్యాసం చేశారు. సాంఘిక దురాచారాలపై కందుకూరిలా పోరాడిన వారూ సాహిత్యరంగంలో ఇంతవరకూ లేరన్నారు. తెలుగు ప్రజలు నేటికీ ఆయన్ను స్మరించడానికి కారణం 'ఆయన రాయని విషయమంటూ' ఏదీ లేదన్నారు. మూఢ నమ్మకాలపై పోరాడి, వితంతు వివాహాలను ప్రోత్సహించడానికి పెద్ద యుద్ధమే చేశారన్నారు. అయితే ఆయన కాలం కంటే క్లిష్టమైన పరిస్థితులు నేటి సమాజంలో ఉన్నాయన్నారు. మతం పేర జరిగే దౌర్జన్యాలపైనా, సమాజంలోని దుస్సాంప్రదాయలను మూలాలతో సహా పెకిలించడానికి ఆచరణలో కృషి చేస్తూనే పత్రికల ద్వారా ప్రపంచానికి తెలియజేసిన ధైర్యశాలి అని కొనియాడారు. కందుకూరి లేకపోతే 'ఆధునిక గద్య రచన' సృష్టి ఉండేది కాదన్నారు. సమాజానికి అనుసంధానంగా ఆయన సృజించిన సాహిత్యాన్ని అధ్యయనం చేయకపోతే నేటి, భావితరం చాలా నష్టపోతుందని అన్నారు. ఆచరణలో చేసి బహుముఖ కోణాలను దర్శించి మార్గం చూపించిన ధీశాలి కందుకూరి అని ప్రజాశక్తి ఎడిటర్ ఎంవిఎస్. శర్మ వెల్లడించారు. నేడు మాధ్యమాల్లో ప్రసారమవుతున్న సంస్కృతి, శ్రమదోపిడీ, ఆచారాల పేర స్త్రీని అంగడి సరుకుగా మార్చడం వంటి విషయాలపై గట్టిగా ఈతరం పోరాడాల్సిన అవసరాన్ని చాటుతున్నాయన్నారు. నేటి సమాజంలోని వివిధ రకాల సమస్యలు, దురాచాలను సాహిత్యానికి అనుసంధానం చేసి భావితరాలకు ఆయన చూపారన్నారు. కందుకూరి సృజించిన చైతన్యాన్ని బతికించుకుని వికసింపజేసుకోవాల్సిన అవసరాన్ని శర్మ చెప్పారు. చదువు, సమాజాన్ని సంస్కరించుకోవడంలోనూ, ప్రజాస్వామ్య పరిరక్షణలోనూ సంస్కరణోద్యమంలోనూ ముందడుగు వేసిన కందుకూరి 'గుండెదిటవు'తో నేటితరం పయనించాల్సిన అవసరం ఉందన్నారు. కుళ్లిపోతున్న సంస్కృతికి దర్పణం పట్టే అనేక అంశాలపై బహుముఖ కోణాల్లో యుద్ధం చేయడం వలనే భారతదేశ వైతాళికునిగా మనం నేడు కందుకూరిని స్మరించుకుంటున్నామన్నారు. నేటి వర్తమాన పరిస్థితుల్లో కందుకూరి సాహిత్యం అధ్యయనం చేయాల్సిన అవసరం ఎంతైనా ఉందన్నారు. వేదికపై ఐద్వా రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కె. రమాదేవి, కందుకూరి శతవర్ధంతి కమిటీ కన్వీనర్ బి.ప్రభావతి, ఉత్తరాంధ్ర కవులు అట్టాడ అప్పలనాయుడు, డాక్టర్ అయ్యగారి సీతారత్నం, ఆచార్య వెలమల సిమ్మన్న, ఎవి. రమణారావు ఉన్నారు. చందు సుబ్బారావు, గంటేడ గౌరినాయుడు, చీకటి దివాకర్ తదితరులు ప్రసంగించారు. ప్రజానాట్యమండలి, చిన్నారుల గేయాలు, సాంస్కృతిక నాటకాలు సభికులను అలరించాయి. కందుకూరి రచనలను, పుస్తకాలను అతిథులు ఇనాక్, ఎంవిఎస్. శర్మ ఆవిష్కరించారు. ◆

# నవతరానికి కందుకూరి ప్రేరణ కావాలి




*రాజమహేంద్రవరంలో మే 27న జరిగిన కందుకూరి శతవర్ధంతి సమాలోచనలో కందుకూరి మాస్కులతో కళారూపం ప్రదర్శన*

రాజమహేంద్రవరంలోని ఆనం కళాకేంద్రంలో మే 27న జరిగిన కందుకూరి శతవర్ధంతి సభలో ఆయనకు ఘనంగా నివాళులర్పించారు. ఈ సందర్భంగా ప్రజాశక్తి ఎడిటర్ ఎంవిఎస్ శర్మ ప్రధాన ప్రసంగం చేశారు. దారి లేనప్పుడు కొత్తదారిని చూపిన గొప్ప వ్యక్తి కందుకూరి అని, అందుకే ఆయనను వైతాళికుడిగా కొనియాడుతున్నామన్నారు. ఎన్నికలు, అప్పులు, రాజకీయ పార్టీలు లేని సమయంలో కందుకూరి మహిళా హక్కుల కోసం, స్త్రీ విద్య కోసం, వితంతు పునర్వివాహం కోసం అనేక పోరాటాలు చేశారని కొనియాడారు. అశాస్త్రీయ భావాలు ప్రస్తుతం రాజ్యమేలుతున్నాయని, ఆవుమూత్రం తాగితే కేన్సర్ పోతుందని చెప్పిన వ్యక్తి ఎంపి అయ్యారని, ఉపగ్రహాలను నింగికి పంపిస్తున్న శాస్త్రవేత్తలు తిరుపతి వెళ్లి పూజలు చేయడం అలవాటుగా మారిందన్నారు. బ్రిటీష్ కాలంలో మూఢాచారాలపై కందుకూరి యుద్ధం చేస్తున్నప్పుడు బ్రిటీష్ ప్రభుత్వం ఆయనకు పోలీస్ రక్షణ కల్పించిందన్నారు. ఇప్పుడు ప్రస్తుతం ఛాందసవాదం, మూఢనమ్మకాలపై ప్రచారం చేస్తే ఈ ప్రభుత్వాలు మనకు ఎలాంటి రక్షణ కల్పించవని, పైగా అరెస్టులు చేస్తారని ఆవేదన వ్యక్తం చేశారు. కందుకూరి స్ఫూర్తి ఇప్పుడు అవసరమన్నారు. తెలుగు భాష వ్యవహారిక భాష పట్ల చిన్నచూపు తగదన్నారు. సభను ప్రారంభించిన శాసనమండలి సభ్యులు ఐ.వెంకటేశ్వరరావు (ఐ.వి) మాట్లాడుతూ సంఘ సంస్కరణల ఉద్యమాలు నడిపిన వీరేశలింగం వారసుడిగా నేటితరం తయారవ్వాలన్నారు. కందుకూరి తన కాలం కంటే ముందున్నారని, మన కాలం కంటే కూడా ముందున్నారని చెప్పారు. కందుకూరి రాజమహేంద్రవరం కేంద్రంగా చేసుకుని అనేక ఉద్యమాలు నడిపారన్నారు. విశిష్ట అతిథిగా హాజరైన ఎంఎల్‌సి రాము సూర్యారావు మాట్లాడుతూ ఆశయాలు ఆదర్శంగా ఉండాలన్నారు. కందుకూరి పుట్టిన గడ్డలో ఆయన ఆశయాలను అందరూ ఆచరణలో చూపాలని కోరారు. తాను ముహూర్తం చూసుకుని నామినేషన్ వేయలేదని, ముహూర్తం చూసుకుని నామినేషన్ వేసినవారు ఓడిపోయారని చెప్పారు. రాజమహేంద్రవరం సిటీ ఎంఎల్‌ఎ ఆదిరెడ్డి భవాని మాట్లాడుతూ కందుకూరి పుట్టిన గడ్డపై పుట్టినవారంతా కందుకూరి ఆశయాల సాధనకు కృషి చేయాలన్నారు. మహిళలు అన్ని రంగాల్లో ముందున్నారంటే దానికి కందుకూరి వేసిన బాటే కారణమన్నారు. అంతకు ముందు కందుకూరి చిత్రపటానికి ఎంఎల్‌సిలు ఐ.వెంకటేశ్వరరావు, రాము సూర్యారావు తదితరులు పూలమాలలు వేసి నివాళులర్పించారు. ఈ సభకు అధ్యక్షత వహించిన యుటిఎఫ్ నాయకురాలు అరుణకుమారి మాట్లాడుతూ కందుకూరి రాజమహేంద్రవరంలో జన్మించడం దేశానికే గర్వకారణమన్నారు. ఈ కార్యక్రమంలో మాజీ ఎంపి మిడియం బాబూరావు, ప్రజా సాంస్కృతిక వేదిక రాష్ట్ర నాయకులు మంతెన సీతారాం, సిఐటియు జిల్లా ఉపాధ్యక్షుడు టి.అరుణ్, ఐద్వా జిల్లా కార్యదర్శి పి.తులసి, ప్రజానాట్యమండలి రాష్ట్ర అధ్యక్షులు బాషా, ప్రధాన కార్యదర్శి అనిల్, రాష్ట్ర నాయకులు సురేష్ నిఖిలం, ఎల్ఐసి నాయకుడు పి.సతీష్, జెవివి జిల్లా అధ్యక్షుడు చైతన్య శేఖర్, ఎస్ఎఫ్ఐ నాయకులు బి.పవన్, డివైఎఫ్ఐ నాయకులు బి.రాజులోవ, ప్రజాశక్తి మేనేజర్ టిఎస్ ప్రకాష్, కెవిపిఎస్ నాయకులు రూపస్‌రావు, మెడికల్ రిప్ నాయకులు ఎన్.సత్తిరాజు, మురళీకృష్ణ, ఎన్‌వి రావు, వివిధ ప్రజాసంఘాల నాయకులు, కార్యకర్తలు పాల్గొన్నారు. ఈ సందర్భంగా ప్రజాశక్తి ముద్రించిన ఆరు పుస్తకాలను ఎంఎల్‌సి ఐ.వెంకటేశ్వరరావు ఆవిష్కరించారు. ♦

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor: T. R. ...**

## రాజమహేంద్రవరంలో మే 27న జరిగిన కందుకూరి వీరేశలింగం శతవర్ధంతి సమ్మేళనం దృశ్యాలు






## విశాఖపట్నంలో జూన్ 5న జరిగిన కందుకూరి వీరేశలింగం శతవర్ధంతి సమ్మేళనం దృశ్యాలు








PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.VJ/187/2017-19
Posting : 1st &2nd of Every Month ▪ Date of Publication: 8.06.2019

PRSVMORA 198

# ప్రజాశక్తి బుక్ హౌస్ తాజా ప్రచురణలు

కందుకూరి వీరేశలింగం తన జీవితకాలంలో చేసిన అసాధారణ కృషి తెలుగుప్రజలను విశేషంగా ప్రభావితం చేసిన విషయం మీకు తెలిసిందే. ఆనాడు సమాజంలో పేరుకుపోయి ఉన్న మూఢత్వాన్ని, ఛాందసత్వాన్ని తన ఆధునిక భావాలతో చీల్చిచెండాడు. ఒకవైపు సంఘసంస్కరణ ఉద్యమాన్ని విజయవంతంగా నిర్వహిస్తూనే మరోవైపు పదునైన కలంతో అద్భుతమైన రచనలు చేశాడు. వీరేశలింగం రచనలు ఏ కోణంలో చూసినా ఈనాటికీ విలువైన ప్రాసంగికతను కలిగి ఉన్నాయి. కందుకూరి మరణించి 100 సంవత్సరాలు పూర్తయిన సందర్భంలో మరోసారి కందుకూరి సంఘసంస్కరణ ఉద్యమాన్ని, వారి రచనలను ఈ తరానికి గుర్తుచేయడం అవసరమని భావించి కందుకూరి వీరేశలింగం శతవర్ధంతి సందర్భంగా ప్రజాశక్తి బుక్‌హౌస్ ఈ దిగువ తెలిపిన పుస్తకాలను ప్రచురించింది. విలువైన ఈ పుస్తకాలను ప్రస్థానం పాఠకులకు ప్రత్యేక రాయితీతో ప్రజాశక్తి బుక్‌హౌస్ అందిస్తుంది.



## కందుకూరి వీరేశలింగం రాజశేఖర చరిత్రము

తొలినవలగా ప్రాచుర్యం పొందిన కందుకూరి వీరేశలింగం నవల 'రాజశేఖర చరిత్ర'. తొలినవలగానే కాకుండా ఆనాటి సమాజాన్ని వాస్తవిక దృష్టితో రికార్డు చేసిన రచనగా కూడా గుర్తింపు పొందింది. తప్పనిసరిగా చదవవలసిన పుస్తకం.

పేజీలు : 184, ధర : 140/-

## స్వీయచరిత్ర సంగ్రహము కందుకూరి వీరేశలింగం

కందుకూరి వీరేశలింగం స్వీయచరిత్రను ప్రసిద్ధ రచయిత కొడవటిగంటి కుటుంబరావు సంక్షిప్తీకరించారు. అత్యుత్తమ జీవిత చరిత్రల్లో ఈ పుస్తకం కూడా ఒకటి. కందుకూరి జీవితంలోని ప్రతి సంఘటనా ఉత్తేజం కలిగిస్తుంది. ఆధునిక వైతాళికుడి జీవితం విలువైన అనుభవాల సమాహారం.



పేజీలు : 192, ధర : 150/-



## క్రాంతి ఖడ్గం కందుకూరి

పేజీలు : 56, ధర : 35/-

ఈ పుస్తకాన్ని ఐద్వా మహిళా సంఘం ప్రచురించింది. కందుకూరి మహిళల సంక్షేమానికి ఎటువంటి కృషి చేశారో తెలియజేస్తూ, ఆయన సేవలను విభిన్న కోణాలలో విశ్లేషిస్తూ మహిళా ప్రముఖులు, రచయిత్రులు, కవయిత్రులు రాసిన వ్యాసాలు ఇందులో ఉన్నాయి.

## సంఘసంస్కరణ దస్తూరి మన కందుకూరి



పేజీలు : 336, ధర : 270/-

ప్రముఖ రచయిత, విమర్శకుడు రాచపాళెం చంద్రశేఖర రెడ్డి సంపాదకత్వంలో వెలువడిన వ్యాస సంకలనం ఇది. ఇందులో సీనియర్ సాహిత్య వేత్తల వ్యాసాలతో పాటు సమకాలీన ప్రముఖ రచయితల వ్యాసాలు ఉన్నాయి. కందుకూరి జీవిత, సాహిత్యాల గురించి, ఈనాడు కందుకూరి ప్రాసంగికత గురించి ఆలోచింపచేసే వ్యాసాల సంకలనం.

## యుగపురుషుడు వీరేశలింగం



పేజీలు : 336, ధర : 270/-

ప్రముఖ రచయిత, సామాజిక, రాజకీయ విశ్లేషకులు తెలకపల్లి రవి సంపాదకత్వంలో పునర్ముద్రించిన అలనాటి విలువైన పుస్తకం ఇది. తెలికిచర్ల వెంకటరత్నం, దేవులపల్లి కృష్ణశాస్త్రి, ఆవుల సాంబశివరావు సంపాదకత్వంలో 'యుగపురుషుడు' పేరుతో స్మారక సంచికగా వెలువడింది. ఆనాటి పెద్దలు కందుకూరిని ఎలా చూశారో ఈ పుస్తకం చెబుతుంది.





**If Un delivered please return to: Prasthanam, C/o M.B. Vignana kendram, 27-30-4, 3rd Floor Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002. Ph: 0866-2577248, Cell: 9490099059**

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVMO9A198 |
| పుస్తకం పేరు | Cwpnoo |
| తారీఖు | 27/5/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూపినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |